అపరాధ పరిశోధన అనుబంధం—104

# నాలుగు నవలలు

(మీకోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## మృత్యులోయ

రచన : వసుంధర

## ఈ హత్య నీ కోసం!

రచన : విశ్వమోహిని

## నడమంత్రపు సిరి

రచన : వాణిశ్రీ

## జరుగవలసిన హత్య

రచన : సికిందర్

రక్తపు టేర్లు - మూడవ భాగం

**అపరాధ పరిశోధన సప్లిమెంట్—104**
ఆగష్టు, 1982
వెల: రు. 5-50
ఏడాది చందా: 66 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
**శ్యామదామోదర్ రెడ్డి**

సంపాదక వర్గం:
**టెంపోరావ్**
**శ్యాంబాబు**
**ఏ. పీ. మోహన్రావ్**
**వసుంధర**
**విద్వాన్ షీలాదేవి**

కార్యాలయం:
**అపరాధ పరిశోధన కార్యాలయం**
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
**క్రాంతి ప్రెస్,**
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# మృత్యులోయ

వసుంధర

సరళ తలుపు తీసి—"నువ్వా?" అంది.

అతను నవ్వి—"అవును—!" అంటూ లోపల ప్రవేశించాడు.

ఆమె అతడికి కాఫీ కలిపి ఇచ్చింది. అభిమానంగా పలకరించింది. కుశల ప్రశ్నలు వేసింది.

అతడు అన్నింటికీ అన్యమనస్కంగా బదులిచ్చాడు.

"ఏదోలా ఉన్నావు!" అందామె.

"అవును. నేను వచ్చింది — ఈ ప్రశ్నలన్నింటికీ బదులివ్వటానికి కాదు—"

"మరెందుకు?" అంది సరళ.

"మీ ఆయన ఊళ్ళో లేడు కదా!"

"అవును...."

"రెండ్రోజులదాకా రాడు కదూ?"

"నీకెలా తెలుసు?"

"నాకింకా చాలా తెలుసు. డబల్ కాట్ చేయించు

కోవాలనుకుని— వెయ్యిరూపాయలవుతుందని మానేశారు కదూ!"

ఆమె ఆశ్చర్యంగా—"ఎవరు చెప్పారు నీకు?"

"మనసుంటే తెలుసుకునే మార్గాలు సవాలక్ష. ఇప్పుడు నేనిక్కడికెందుకొచ్చానో నువ్వు తెలుసుకో గలవా?"

"తెలుసుకోలేను...."

"ఇంకో గంటలో మీ యింటికి డబల్ కాట్ వస్తుంది. మీరు అనుకున్నకంటే కూడా ఖరీదైనది, అందమైనది!"

సరళ ఆశ్చర్యంగా—"ఎలా?" అంది.

"నేను ఆర్డరిచ్చాను—"

"ఎందుకు?"

"నీ కోసం!"

"నా కోసమా—ఎందుకు?"

"ఎందుకేమిటి? ఆ మంచానికి ప్రారంభోత్సవం మన మిద్దరం చేస్తాం!"

సరళ చురుగ్గా అతడివంక చూసి—"ఇలాంటి వేళా కోళాలు నాకు నచ్చవు. పెళ్ళికాకముందు ఏమోకానీ.." అని ఆగింది.

"నీకు పెళ్ళయిందంటే నమ్మటం కష్టం. పెళ్ళయ్యాక నీలో అందం పెరిగింది. వయసు తరిగింది—" అన్నాడతను.

"నా అందమూ, వయసూ ఇప్పుడు నావి కాదు— గోపాలానివి!"

"పోనీ—ఈ ఒక్క రోజుకూ నేనే గోపాలాన్ని అనుకో!"

"షటప్!"

"ఆ రోజులు మరిచిపోయావా?" అన్నాడతను.

ఆ రోజులు గుర్తున్నాయా మెకు.

అతడు.... ఆమె.... ఎదురుగా సముద్రపుటలలు....

ఒకరివైపు ఒకరు ప్రేమ, మత్తుగా.... చూపులు!

అతడి చేయి ఆమెకు తగిలితే వళ్ళంతా షాక్ తగిలినట్లుండేది.

ఒకరులేనిదే ఒకరు బ్రతకలేమనుకునేవారు. ఒకరిని విడిచి ఒకరు ఉండలేమనుకునేవారు. అతడు ఆమెకూ, ఆమె అతడికీ ఉత్తరాలు రాసుకున్నారు. చదువులు కాగానే పెళ్ళిచేసుకుందామనుకున్నారు.

చదువులైపోయాయి.

అంతకాలం అతడు పురుషుడు. ఆమె స్త్రీ. వారి ఆకర్షణ ప్రకృతి సహజం. అంతకుమించి ఇంకేమీ ఆలోచించలేదు.

నిజంగా పెళ్ళిచేసుకుందామనేసరికి ఎన్నో ఇతర ప్రసక్తులు వచ్చాయి. స్త్రీ పురుషుల ఆకర్షణ ప్రకృతి సహజం కావచ్చు. కానీ అది పెళ్ళికి దారితీయాలంటే కులాలు, మతాలు, రాజకీయాలు, అర్థశాస్త్రం—ఎన్నో సహకరించాలి.

సరళ ఆడపిల్ల, పేదరాలు కాబట్టి ఆమె తలిదండ్రులు అడ్జెస్టుమెంటుకు సిద్ధంగానే ఉన్నారు. కానీ అతడి తలిదండ్రులనుంచే ఇబ్బందులు వచ్చాయి. సరళతో వివాహం జరిగితే వాళ్ళు చచ్చిపోతామన్నారు.

"ఇలా జరుగుతుందనుకోలేదు. నేను చాలా సిగ్గుపడుతున్నాను సరళా!"

ఈ మాటలనతను మనస్ఫూర్తిగా అన్నాడు. అంత

వరకూ సరళ రాసిచ్చిన ప్రేమలేఖలన్నింటినీ తీసుకుని వచ్చి ఆమె ముందు అంటించివేస్తూ—"ఇవి నాకు అమూల్యమైనవి. కానీ నీ కివి భవిష్యత్తులో ప్రమాదకరంగా మారే అవకాశముండరాదని ఇలా చేస్తున్నాను—" అన్నాడు.

ఉత్తరాలు ఒక్కసారి భగ్గున మండాయి. ఆ మంటల వెలుగులో అతడి ముఖంలో తేజస్సు కనబడింది సరళకు.

"గుర్తున్నాయి. నా ప్రేమ లేఖలను తగులబెడుతున్నప్పుడు నీ ముఖంలో దివ్యతేజస్సును చూశాను. ఇప్పుడది కనిపించటం లేదు" అంది సరళ.

అతను నవ్వాడు — "నా ముఖంలో తేజస్సు ఎలా మిగులుంది? ఆ క్షణంలో నీ భావి జీవితానికి సాయపడుతున్నానన్న తృప్తి తాత్కాలికంగా ఆ తేజస్సు నిచ్చి ఉంటుంది. ఇప్పుడు నాకు వివాహమైంది. కానీ ఏదో పోగొట్టుకున్నానన్న అసంతృప్తి! నా తలిదండ్రులను ధిక్కరించి నిన్ను పెళ్ళిచేసుకోలేకపోయినందుకు నేను యిప్పుడు నన్ను నేనే రోజూ నిందించుకుంటున్నాను—"

"ఏం—నీ భార్య మంచిది కాదా?"

"ఆమె మంచిది. అందమైనది. కానీ నేను కోరుతున్నది మంచితనాన్ని, అందాన్ని కాదు. నిన్ను! ఆమె నువ్వు కాదు!"

సరళ నిట్టూర్చి ఊరుకుంది.

"అందుకే నాకీ కొత్త ఉపాయం తోచింది. మన ఇద్దరికీ పరస్పరాకర్షణ ఉన్నప్పటికీ ఒక్కటి కాలేకపోయాం. ఒక్కసారైనా మనం దగ్గరైతే తప్ప ఆ ఆకర్షణ పోదు. అందుకే నేనిప్పుడిక్కడికి వచ్చాను. నీకు విలువకడుతున్నానని కాదు. కానీ ప్రతిఫలం కూడా

ఇవ్వదలిచాను. మనమేదో తప్పు చేస్తున్నామనీ, పాపం చేస్తున్నామనీ, నువ్వు అనుకోవద్దు. ఆడా, మగా కలిసి ఏడడుగులు నడిచేచాలు—వివాహం జరిగినట్లేనని శాస్త్రం చెబుతుంది. ఆ విధంగా మన వివాహం ఎప్పుడో అయిపోయింది. అంటే నువ్వు చేసుకున్నది రెండో వివాహమన్నమాట. అది పాపం కానప్పుడు — ఇదీ పాపం కాదు...."

సరళ అతడు చెప్పేదంతా మౌనంగా వింటోంది.

"నీ జీవితం మూడు పువ్వులూ ఆరు కాయలుగా ఉండాలి. డబ్బు మనని విడదీసింది. ఆ డబ్బు ఎప్పుడూ నీకు దాస్యం చేసేలా చేస్తాను. నన్ను వివాహమాడక పోయినా నువ్వు నా భార్య అంత గొప్పగా నూ జీవించాలి. నీకు సకల సదుపాయాలూ చేస్తాను. కానీ ఇంతకాలం నేను నీ నుంచి పొందలేకపోయిన ఆనందం పొందే అవకాశం ఈ రోజు ఇవ్వు—" అన్నాడతను.

"ఇంకా నువ్వు చెప్పవలసిందేమైనా ఉందా?"

"లేదు!" అన్నాడతను.

"అయితే నే చెప్పేది వింటావా?" అంది సరళ.

"ఊఁ"

"నేను శాస్త్రాలకూ, మనసుకూ ప్రాధాన్యతనివ్వను. శరీరానికే ప్రాధాన్యతనిస్తాను. నా మనసు నిన్ను చంపాలనుకోవచ్చు. కానీ అంతమాత్రాన నువ్వు చావవు. నేను ఏ కత్తిపీటతోనే నిన్ను ఎదుర్కొంటేనే నువ్వు చస్తావు. అలాగే కలిసి ఏడడుగులు వేసే శాస్త్రాన్ని నేను నమ్మను. శారీరకంగా కలిసినవారే భార్యాభర్తలు. నేను నా భర్తను ప్రేమిస్తున్నాను. నాకు జీవితంలో ఎటువంటి అసంతృప్తిలేదు—నువ్వు నీ మనసును అదుపులో

పెట్టుకో. మళ్ళీ మరోసారి ఇలాంటి కోరికతో ఈ ఇంట్లో అడుగుపెట్టకు. మరో విషయం — నాకు బహుమతులు గిట్టవు. నాకేం కావాలన్నా నా భర్తని అడుగుతాను. ఆయన శక్తికి మించిన కోరికలు నాకు లేవు. ఉన్నా అదుపు చేసుకోగలను...."

అతడామెవంక చూశాడు. ఆమె ముఖంలో తేజస్సు ఉంది.

## 2

"నమస్కారమండి!" అందామె.

"నమస్కారం—" అన్నాడు గోపాలం ముక్తసరిగా.

"మీరు నా వంక చూడకుండా నమస్కారం అంటున్నారు...." ఆమె అదోలా గారంగా అంది.

గోపాలం అప్పుడామెవంక చూశాడు. ఆమెవంక చూడగానే ఎవరి చూపులైనా ఎక్కడాగిపోతాయో గోపాలం చూపులూ అక్కడే ఆగిపోయాయి.

ఆమె పైట వేసుకోలేదనటం సరికాదు. ఆమెకు పైటలేదు. పాంటు, షర్టు వేసుకుందామె. ఆమె హృదయ భాగం ఎత్తుగా, నిండుగా, విశాలంగా ఉండి-చీరకట్టవలసిన అవసరాన్ని సూచిస్తున్నది.

గోపాలానికి చూపులు మరల్చుకుందుకు కొంతసేపు పట్టింది.

"చూశారా?" అందామె.

గోపాలం తికమకపడుతూ—"ఊఁ" అన్నాడు.

"నాన్నగారు సాయంత్రం మిమ్మల్ని మా యింటికి ఆహ్వానించమన్నారు...."

"నాన్నగారంటే?"

ఆమె చెప్పింది. అతను సరేనన్నాడు.

సాయంత్రం అతను వాళ్ళింటికి వెళ్ళాడు.

"పెద్దగా పనేం లేదండీ — ఈ రాత్రికి మీరు మా ఇంట్లో గడుపుతారని పిలిచాను—అంతే!" అన్నాడామె తండ్రి. ఆయన లోపలకు వెళ్ళగానే ఆమె అతడికి తన గది చూపించింది. గదిలో అన్నీ ప్రత్యేకంగా ఉన్నాయి మంచంతో సహా!

ఆమె అతడికి ఏదో పుస్తకం చూపించి ఏవో సందేహా లడిగింది. గోపాలం ఆమె సందేహాలు తీర్చాడు. ఆమె వళ్ళంతా కుదిపేస్తూ అతణ్ని మెచ్చుకుంది. గోపాలం నరాల్లో సంచలనం కలిగింది.

ఇద్దరూ కబుర్లలో పడ్డారు.

ఓ గంటకు కాబోలు ఆమె తండ్రి వచ్చాడు. ఊళ్ళో తన ఖ్యాందుల గురించి చెప్తూ కున్నాడు. తనమీద అనూయాగ్రస్తులు పన్నిన పన్నాగాల గురించి చెప్పాడు.

గోపాలం ఆ ఊరు వచ్చింది ఇన్‌స్పెక్షన్‌కు. అతడి ఇన్‌స్పెక్షన్ రిపోర్టుపైన ఆమె తండ్రి భవిష్యత్తు ఆధార పడి ఉంది. అప్పటికే గోపాలం సమాచారం సేకరించడం పూర్తయింది. ఆమె తండ్రి చెబుతున్న దానికీ, అతడు సేకరించిన సమాచారానికీ పొత్తు కుదరడం లేదు. అయినప్పటికీ గోపాలం ఆయన మాటలపట్ల కుతూహలం చూపించటంలేదు. ఆయన చెప్పేది శ్రద్ధగా వినా లనుకోవటంలేదు. ఆయన్ను త్వరగా వదుల్చుకోవాలని ఉంది. అతడికి ఆమెతో మాట్లాడాలని ఉంది.

"భయపడకండి .... రిపోర్టు మీకు అనుకూలంగానే ఉంటుంది—"

"అంత మాటన్నారు. అదే చాలు నాకు...." ఆయ

నతన్ని పొగడ్డం ఆరంభించాడు.

గోపాలానికి ఆ పొగడ్తలు వినాలని లేదు. ఆమె తన్ను పొగుడుతూంటే వినాలనుంది. ఆయన వెళ్ళేక ఆమె వచ్చి అతణ్ని ఆదేపనిగా పొగిడింది. అతను చాలా సంతోషించాడు కానీ ధైర్యం చేయలేకపోయాడు. ఆమె కూడా అతణ్ని ఊరించింది కానీ దగ్గరకు రాలేదు.

రాత్రి భోజనాలయ్యాయి. ఆ యింట్లో ఆయన, ఆమె తప్ప ఇంకెవ్వరూ లేరు. ఆమె తల్లి పుట్టింటికి వెళ్ళిందిట. ఆయన రాత్రి సెకండ్ షో సినిమాకు వెళ్ళాడు.

గోపాలం గది వేరు. ఆమె గది వేరు.

ఆమె గదిలోంచి సంగీతం వినబడుతోంది. ఆమె చాలా నెమ్మదిగా పాడుతోంది. అయినా గోపాలానికి వినబడుతోంది. అతడికి నిద్రపట్టటంలేదు.

చాలాసేపాగాడు గోపాలం. ఆమె తన గదిలోకి వస్తుందనుకున్నాడు. కానీ ఆమె రావటంలేదు. పాట కూడా ఆగిపోయింది. ఆమె నిద్రపోయిందో ఏమో!

కాసేపటికి గోపాలం తెగించాడు. అతడు లేచి ఆమె గదిలోకి వెళ్ళాడు.

అతణ్ని చూస్తూనే ఆమె ఉలిక్కిపడింది. ఆమె నైట్ డ్రెస్సులో ఉంది. పేరుకది నైట్ డ్రెస్సు. లేకపోతే నో డ్రెస్సు అనవచ్చు.

గోపాలం అప్పుడామె అసలు అందాలు చూశాడు.

“మీరా?” అందామె.

“దాహంగా ఉంది. మంచినీళ్ళు కావాలి!” అతడు వణికాడు.

ఆమె అతడికి గ్లాసెడు నీళ్ళిచ్చింది. అతడు గ్లాసును వదిలి ఆమె చేయిపట్టుకుని—“ప్లీజ్!” అన్నాడు.

"అంటే?"

"నాకు నువ్వు కావాలి!"

ఆమె చేతిలోని గ్లాసు కిందపడింది. అతడినుంచి చేయి విడిపించుకుని—"ఎంత ధైర్యం నీకు?" అంది.

"ఆ ధైర్యాన్నిచ్చింది నీ చూపులు! నీ బట్టలు!" అన్నాడతను.

"అవా — అయితే తప్పంతా నాదే నంటావు!" అందామె.

"ఊఁ"

"అయితే ఒక్క నిమిషం ఆగు తలుపు వేసొస్తా! నా చూపులు, బట్టలు—నీకు కనిపించవు—" అందామె.

"ప్లీజ్—అలాగనకు—" అన్నాడతను.

"నేను వేశ్యననుకుంటున్నావా?"

"లేదు—"

"అయితే నన్ను పెళ్ళి చేసుకుంటావా?"

"ఊఁ" అప్రయత్నంగా అన్నాడతను.

"అయితే నా మెడలో తాళికడతావా?"

"కడతాను...."

"అయితే రేపటిదాకా ఆగు...." అందామె.

"ఎందుకు?"

"పెళ్ళయ్యే దాకా భారతీయ వనిత మగాడికి స్వంతం కాదు...."

గోపాలం నిట్టూర్చి ఆమె చేయి వదిలేశాడు.

"ఏం?" అందామె.

"నిన్ను పెళ్ళిచేసుకోవటం సాధ్యంకాదు. నాకు పెళ్ళి అయిపోయింది...."

"ఓస్—ఇంతేగదా!" అందామె చాలా తేలికగా,

ఈసారి గోపాలం ఆశ్చర్యపోయాడు — "అంత తేలిగ్గా ఎలా చెప్పావ్? పెళ్ళాం బ్రతికుండగా...."

అతణ్ణి మధ్యలో ఆపి — "బ్రతికుండగా కదా ఇబ్బంది. చంపేస్తే సరి...." అంది.

"చంపేయడమా? అంటే హత్య!" భయంగా అన్నాడు గోపాలం.

"అవును. నన్ను పెళ్ళి చేసుకోవాలంటే అదే ఉపాయం...."

"ఇదేం ఉపాయం? నా బొంద ఉపాయం ..." విసుగ్గా అన్నాడతను.

"అయితే—పోయి నీ గదిలో పడుకో...." అందామె విసుగ్గా.

"నువ్వెలాగూ నా గదిలోకి వస్తావని నాకు తెలుసు" అన్నాడు గోపాలం.

"ఏమిటి నీ నమ్మకం?"

"నువ్వు నా గదిలోకి రాకపోతే రేపు మీ నాన్న పనికాదు...."

ఆమె పకపకా నవ్వి—"అన్నట్లు నీ పేరు గోపాలం కదూ....మంచి పేరే పెట్టారు నీ తలిదండ్రులు...." అంది.

"నవ్వుతావెందుకు?" కోపంగా అన్నాడతను.

"ఆయన మా నాన్న కాదు...." అందామె.

"మరి?" అన్నాడు గోపాలం ఉలిక్కిపడి.

"ఆయన నీకెలాగో నాకూ అంతే! నాకు నీతో పని ఉంది. ఆయనకూ పని ఉంది. ఆయన నీకు డబ్బిద్దామను కున్నాడు. నా సంగతి తెలియగానే డబ్బుకంటే నేనే మంచి ప్రయోగం—అనుకున్నాడు...." ఆమె ఆగింది,

"నాతో నీ కేమిటి పని?"

"చెప్పేముందు నా గురించి కూడా చెప్పుకోనా?"

తల ఊపాడతను.

ఆమె ఒక లక్షాధికారి ఏకైక సంతానం. తండ్రి పోయి నాలుగేళ్ళయింది. ఆమె ఆస్తి, అందం—రెండు చూసి ఎందరో ముందుకు వస్తున్నారు. కానీ ఆమె వివాహానికి అంగీకరించటంలేదు. ఎందుకంటే సరళను చంపాలి!

సరళ పేరు వింటూ గోపాలం ఉలిక్కిపడ్డాడు. అది తన భార్య పేరు!

"సరళ నీకేం చేసింది?"

"నేను ప్రేమించినవాణ్ని నాకు కాకుండా చేసింది!"

"నువ్వు నన్ను ప్రేమించావా?" గోపాలం ఆశ్చర్యంగా అడిగాడు.

"నిన్ను నేను ప్రేమించటం ఈ మధ్యనే మొదలయింది...."

"అంటే?"

"సరళ పెళ్ళికి ముందు తానెవరినో ప్రేమించినట్లు నీకు చెప్పలేదా?"

గోపాలానికి నోటమాటరాలేదు.

"అతడి పేరు మనోహర్. చూపులకు మనోహరంగా ఉంటాడు. డబ్బుకు డబ్బూ ఉంది. ఆకర్షణీయమైన పర్సనాలిటీ. అతణ్ని నేను ప్రేమించాను. అతడు సరళను ప్రేమించాడు...."

"సరళ కూడా అతణ్ని ప్రేమించిందా?"

"అవా—ఇద్దరూ ఒకర్ని విడిచి ఒకరు క్షణం కూడా ఉండలేకపోయారు. ఒకరికొకరు ఉత్తరాలు కూడా

రాసుకున్నారు. సరళకు డబ్బులేదు. అంతస్థులేదు. అయినా మనోహర్ తన తలిదండ్రులకు నచ్చజెప్పాలనే అనుకున్నాడు. మా యిద్దరికీ దూరపు చుట్టరికం కూడా ఉంది. అతడి తలిదండ్రులకు నేనంటే ఇష్టం. మా ఇద్దరికీ పెళ్ళి జరిపించాలని వాళ్ళనుకుంటున్నారు. కొడుక్కు వర్ణాంతర వివాహం చేయటం వాళ్ళకిష్టంలేదు. అందువల్ల మా వివాహం జరుగుతుందనే నేనాశించాను. కానీ అప్పుడేం జరిగింది?

మనోహర్‌ని నోరు విడిచి అడిగితే అతను నన్ను తిరస్కరించాడు. సరళతోవున్న సమస్యలన్నీ చెప్పాను. అన్నీ తను పరిష్కరించుకోగలనని నమ్మకంగా చెప్పాడు. నాకు వేరే దారి కనబడక సరళనే కలిసి వేడుకున్నాను. ఆమె నన్ను వెటకారంచేసింది. నీలో లేనిది నాలో ఉండటంవల్ల అతను నా పట్ల ఆకర్షితుడయ్యాడంది. తన ప్రియుణ్ని వదులుకోలేదంది. ఇలా ప్రేమ గురించి మరో ఆడదాన్ని అర్థించటం సిగ్గుచేటంది.

నాకు చచ్చేటంత అవమానమయింది. కొట్టవలసిన చోట దెబ్బ కొట్టాను.

మనోహర్ కంటె ముందుగా అతడి తలిదండ్రులకు సరళమీద విషం నూరిపోశాను. ఆమె మనోహర్ మీద వల విసురుతున్నదనీ ఆమె శీలం మంచిదికాదని కూడా చెప్పాను. మనోహర్‌ను లొంగదీసే సులభపద్ధతులు కూడా చెప్పాను. అంతే — ఆ వివాహం ఆగిపోయింది.

అయితే మనోహర్‌కు తెలిసింది — నా కారణంగా ఆ వివాహమాగిపోయిందని! అందుకే అతడు నా మీద పగబట్టాడు—'వివాహమంటూ చేసుకుంటే నిన్ను తప్ప మరే ఆడదాన్నయినా చేసుకుంటాను—' అన్నాడు.

అలా గేచేశాడు....''

గోపాలం కుతూహలంగా వింటున్నాడు. తన భార్య సరళ ఈ కథ తనకెందుకు చెప్పలేదు? ప్రేమించేరోజుల్లో తను మనోహర్‌తో ఎలా మసిలింది? ఎలా మసిలినప్పటికీ అసలు అలా ప్రేమించటం మంచి సంప్రదాయమేనా? ఇలాంటి యువతిని తనెలా చేసుకున్నాడు? తను సంసారం చేస్తున్నది ఒక కులటతోనా?

ఆమె తిరిగి కొనసాగించింది. "మనోహర్ భార్య మంచిది కావడం నాకింకా బాధనిపించింది. నా ద్వేషం సరళమీద నే కానీ మనోహర్ మీద కాదు. అతడంటే నాకు ఇంకా మోజు వున్నది. కనీసం అతడితో అనుభవాలు పంచుకోవాలనుకున్నాను. ఆ విధంగా నా కోరిక తీరుతుంది. నా స్థానంలో ఉన్న అతడి భార్యపైన కక్ష కూడా తీరుతుంది. నేను నోరు విడిచి మళ్ళీ అతడి నడిగాను. జీవితంలో మరోసారి అవమానం ఎదురయింది. ఆడది భరించలేని అవమానం. అతను నాతో ఇలా అన్నాడు—

"నా సర్వానికి నా భార్య సరళ. మరో స్త్రీతో కాపురం చేస్తూ నేను తప్పుచేస్తున్నాను. అయితే సమాజం దీన్ని తప్పు అనటం లేదు. అదే నాకు కొంత ఊరట. నీతో సంబంధం పెట్టుకుంటే సమాజం నన్ను వేలెత్తి చూపిస్తుంది. సమాజంచేత వేలెత్తి చూపించు కోవటం నా కిష్టంలేదు. ఒకవేళ అలాంటి పరిస్థితి ఏర్పడితే అందుకు కారణం సరళే కానీ నువ్వు కావటం నాకిష్టంలేదు—''

"ఆ మాటలు వినగానే నాకు వెంటనే చచ్చిపోవా లనిపించింది. కానీ చచ్చి సాధించేదేముంది? నాముందు

బోలెడు జీవితముంది. నా జీవితంమీద నాకు ఆశలూ ఉన్నాయి. అయితే నా మనసులోని ద్వేషం నశించే వరకూ నాకు జీవితంలో సుఖముండదు.

అందుకే సరళ చావాలనుకుంటున్నాను. ఆ చావుకు మనోహర్ జీవితాంతం ఏడవాలి. నేనూ, నువ్వు సుఖంగా జీవించాలి. డబ్బుకు డబ్బు. అందానికి అందం. ఈడూ జోడూ — అన్నీ బాగుంటాయి. నీతో ఈ విషయాలు పర్సనల్‌గా మాట్లాడాలనుకుని ఈ అవకాశం కల్పించు కున్నాను. నువ్వు నాకు సహకరిస్తావని ఆశిస్తున్నాను.

ఒకనాడు లేతవయసులో ఓ మనిషిని ప్రేమించి ఉన్నప్పటికీ ఇప్పుడు నా మనసులో ఎవ్వరూ లేరు. నీ భార్యను చంపేస్తే నువ్వు తప్ప నా మనసులో ఇంకెవ్వరూ ఉండరు. ఈ రాత్రంతా ఆలోచించుకో. మానసికంగా ఎలాగున్నా నేను శారీరకంగా పవిత్రు రాలిని. అందుచేత పని జరక్కుండా నామీద ఆశలు పెట్టుకోకు—" అందామె.

గోపాలం గదిలోంచి వెళ్ళిపోబోయి ఆగి—"హత్య చేయటం మాటలుకాదు. అదైనాక ఉరికంబమెక్కాలి" అన్నాడు.

ఆమె మళ్ళీ నవ్వి—"మీ ఊరికి పదిమైళ్ళ దూరంలో ఉలవకొండ వుంది. ఆ కొండకటువైపు పెద్ద లోయ ఉన్నది. కొండనుంచి లోయలోపడ్డ వ్యక్తి అయిపూ, జాడా వుండదంటారు—" అంది.

ఆ రాత్రికి వారింకేమీ మాట్లాడుకోలేదు.

## 3

అర్ధరాత్రివేళ ఇంటి తలుపు ఎవరో తట్టారు.

సరళ కళ్ళు నులుముకుంటూ లేచింది. ఈ సమయంలో

యెవరు వచ్చివుంటారు? భర్త రావడానికింకా రెండు రోజులు వ్యవధి ఉన్నది.

సరళ తలుపు తీసేముందు — "ఎవరూ?" అనడిగింది.

"నేను—నళిని!"

సరళ తక్కున తలుపు తీసింది. నళిని లోపలకు వచ్చింది. ఆమె బాగా ఆయాసపడుతోంది.

"ఏమిటే — ఈ సమయంలో వచ్చావు?" అంది సరళ.

"నీకోసమే—" అంది నళిని.

సరళ చిరాగ్గా ఆమెవంక చూసి — "నువ్వు నా కోసం వచ్చావంటే నాకు భయం — అలాగనొద్దు— ప్లీజ్!" అంది.

నళిని మధ్యతరగతి యువతి. హైస్కూల్లో చదివే రోజుల్లోనే అల్లరిచిల్లరిగా తిరిగి డబ్బులు సంపాదించుకునేది. ఇప్పుడుద్యోగం చేస్తోంది. ఇప్పటికీ అలాగే తిరుగుతోందని చెప్పుకుంటారు.

నళిని ఘోరుఘోరంనుంచీ సరళకు క్లాసు మేటు. ఆమె సరళ దగ్గర ఏమీ దాచేదికాదు. తన గురించి చెప్పుకోవటమేకాక సరళను కూడా అందుకు ప్రోత్సహించేది. సరళ ఒప్పుకోకపోతే — "మన దృక్పథంలో మార్పు రావాలి. వయసులో ఉన్నపుడు ఆడా, మగా సరదాగా కలిసి తిరిగితే కొంపలేం మునిగిపోతాయి? అన్నీ పెళ్ళికి ముడిపెట్టాలా?" అనేది.

ఈ విషయంలో ఎలా వున్నా సరళ నళినికి మంచి స్నేహితురాలు. అయితే సరళకు వివాహమయ్యేక వాళ్ళిద్దరూ ఇంటి దగ్గర కలుసుకున్నది చాలా తక్కువ.

"స్త్రీ గురించి నాకు తెలియదా?" అని నవ్వి-"అయితే నే నిప్పుడు ఒక ప్రమాదకరమైన వార్త తెలుసుకుని వచ్చాను—" అంది నళిని.

"ఏమిటది?" కంగారుగా అడిగింది సరళ.

"వింటే నువ్వూ కంగారుపడతావు. వినగానే నేనూ కంగారు పడ్డాను. ఇంచుమించు వెంటనే ఇలా పరుగున వచ్చాను...." అంది నళిని.

"ఏమిటో—త్వరగా చెప్పవే!" అంది సరళ.

"నీకు జగ్గూ తెలియనుకనూ!" అంది నళిని.

"జగ్గూ ఎవరు?"

నళిని తమాషాగా నవ్వి — "నా ప్రియుడు!" అంది.

"ఛీ—నీకు సిగ్గులేదు...." కోపంగా అంది సరళ.

"ప్రియుడి పేరు చెప్పడానికి సిగ్గెందుకు? అయినా జగ్గూ నా ప్రియుడు కావటం నీకు కలిసొచ్చింది ..." నళిని మళ్ళీ ఆగింది.

"ఎందుకే — సస్పెన్సు పెంచేస్తున్నావు?" అంది సరళ.

"ఏంలేదు-కాసేపు ఇక్కడ నీతో కూర్చోవచ్చునని!" అంది నళిని — "జగ్గూ చాలా పెద్ద రౌడీ. కానీ నా దగ్గర పిల్లి. నన్ను ఇంప్రెస్ చేయటంకోసం తన వీరోచిత కార్యాల గురించి ఎడ్వాన్సుగా చెబుతూంటాడు...."

"ఊఁ"

"అలాంటి ఎడ్వాన్సు వీరోచిత కార్యం గురించి ఓ గంట క్రితం చెప్పాడు!"

"ఊఁ"

"ఆ కార్యక్రమానికి వచ్చే ఆదివారం నాడు

మహాపరాధం!"

"ఏమిటే అది!"

"నీ భర్త చావు...."

కవ్వమంది సరళి.

"ఎందుకలా అరిచావ్?"

"వివరంగా మరోసారి చెప్పు!" అంది సరళ.

"వచ్చే ఆదివారం సాయంత్రం అయిదింటికి జగ్గూ నీ భర్తను చంపబోతున్నాడు. ఈ విషయాన్ని తను నాకు గర్వంగా చెప్పాడు. చంపబోతున్నది నా స్నేహితురాలి భర్తనని తెలిసివుంటే అతడు నాకీ విషయం చెప్పి ఉండేవాడు కాదు. అది నీ అదృష్టం!"

"ఒక మూల ఆయన్ను చంపబోతున్నాడంటూ—అదృష్టమంటావేమిటే?"

"మీ ఆయన్ను చంపడానికి జగ్గూ నియోగించ బడటం—ఆ విషయం నాదాకా రావటం—నీ అదృష్టం కదూ!"

"అసలు జగ్గూని ఎవరు నియోగించారు?"

"ఎవడో మనోహర్ అట!"

"మనోహరా—అతడెవరు?" ఏమీ ఎరుగనట్లు అంది సరళ.

"ఏమో-నాకెలా తెలుస్తుంది? అతడు నా ప్రియుడు కాదు మరి!"

"ఆ జగ్గూ ఎక్కడ చంపుతాడుట?"

"మీ యింట్లోనే!" అంది నళిని.

"తప్పించుకునే మార్గముందా?" అంది సరళ.

"అందుకే కదా నేనొచ్చాను?" అంది నళిని.

సరళ ఆత్రుతపడింది. నళిని చెప్పింది.

"ఒక రోజూకు తప్పించుకుంటే అయిందా? వాడు వెంటబడి తరమడూ!"

"తరుముతాడు. అందుకు నేను సాయపడలేదు. ముందుగా హెచ్చరించానుగదా — నీ ఏర్పాట్లు నీవు చేసుకో—" అంది నళిని.

## 4

"హలో!" అన్నాడు మనోహర్.

"నేను — సరళను మాట్లాడుతున్నాను. ఒక్కసారి వస్తావా—నీతో అర్జంటుగా మాట్లాడాలి!"

మరుక్షణంలో మనోహర్ సరళ ఇంట్లో వున్నాడు— "ఇన్నాళ్ళకు మొదటిసారిగా నీనుంచి నాకు పిలుపు వచ్చింది. చాలా సంతోషం! ఇంకా మీ ఆయన ఊర్నుంచి రాలేదు కదూ!"

"రాలేదు. కానీ నేను పిలిచిన కారణం వేరు. నిన్నంతా పబ్లిక్ టెలిఫోన్‌లో నీ గురించి ప్రయత్నించి ఫెయిలయ్యాను. నిన్నో ముఖ్యమైన విశేషం అడగాలి!" అంది సరళ.

"అడుగు!"

"జగ్గూ తెలుసా నీకు?"

"జగ్గూ ఎవరు?"

"ఒక హంతకుడు!"

మనోహర్ ఆమెవంక ఆదోలా చూశాడు — "నాకు హంతకులెవ్వరూ తెలియదు. హంతకుల అవసరమూ లేదు—"

"సరే — నీ మాటలు నమ్ముతాను. అయితే వచ్చే ఆదివారం సాయంత్రం నా భర్తకే ప్రమాదమైనా జరిగిందో — అందుకు నువ్వే కారణమని భావిస్తాను.

బ్రతికున్నంతకాలం నిన్ను ద్వేషిస్తాను....” అంది సరళ.

“సరళా — ప్లీజ్ — అలా అనొద్దు!” అన్నాడు మనోహర్.

“అయితే కొంతకాలంపాటు నా భర్తను రక్షించు” అంది సరళ.

“జీవితంలో ఇంతకంటే దారుణమైన శిక్ష ఉండదు. ఎవరైతే చావాలని కోరుకుంటున్నానో వారినే రక్షించ మంటున్నావు—”

“నా భర్తకేదేనా అయిందో — నీదే బాధ్యత. నా పగ ఎలాంటిదో నీకు తెలియదు....” అంది సరళ.

“నీ పగకంటే నా ప్రేమ గొప్పది. ఆ కారణంగానే నీ భర్తకు నా రక్షణ లభిస్తుంది. భయపడకు—” అన్నాడు మనోహర్.

అతడు తలుపులు తీసుకొని వెడుతూంటే ఎదు రయ్యాడు గోపాలం. ఇద్దరూ పరస్పరం ఒకసారి చూసు కున్నారు. మనోహర్ చర చరా వెళ్ళిపోయాడు. గోపాలం నెమ్మదిగా గుమ్మంలో అడుగుపెట్టాడు.

అక్కడే నిలబడి ఉంది సరళ. ఆమె ముఖంలో గాభరా కనబడుతోంది. వాళ్ళిద్దరు ఒకరికొకరు అలా తటస్థపడటం ఆమెకు నచ్చలేదు. ఇలా జరుగుతుందని ఆమె అనుకోలేదు.

గోపాలం ఆమె వంక చూసి — “ఎవరతను?” అన్నాడు.

“మీ క్యాంపు ఎలా వుంది?” అంది సరళ.

ఇద్దరూ ఒకరి ప్రశ్నకొకరు జవాబిచ్చుకోలేదు. జవాబు కోసం నొక్కించుకోనూ లేదు.

కాసేపు ఇద్దరూ మౌనంగా వున్నారు.

అతను కుర్చీలో కూర్చున్నాడు. సరళ లోపలకు వెళ్ళి కాఫీ కలిపి తెచ్చింది.

గోపాలం కాఫీ చప్పరిస్తూ—"నేను లేకపోవటంవల్ల నీకే ఇబ్బందీ కలగలేదుకదా—" అన్నాడు మాట మొదలెడుతూ.

"అక్కడ మీకు భోజనం?" అంది సరళ.

ఇద్దరూ చాలాసేపు ప్రశ్నలే వేసుకున్నారు.

"ఈ రోజు కొత్తగా ఉంది. ఎప్పుడూ ఇలా లేదు!" అంది సరళ.

"కొత్త విషయాలు తెలిసినప్పుడేగదా కొత్తగా ఉండేది!" అన్నాడు గోపాలం.

"మీకేమైనా కొత్త విషయాలు తెలిశాయా?" అంది సరళ ఆత్రుతగా.

"నాకేం తెలుస్తాయి? నువ్వే చెప్పాలి .... మన పెళ్ళయి రెండేళ్ళు దాటింది. ఇంతకాలానికూడా నువ్వు ఒక్కసారైనా విశేషం అనలేదు..."

సరళ సిగ్గుపడింది...."మీరు చాలా కొంటెవారు. మీ గురించి నేనేవేవో ఊహించుకుని కంగారుపడి పోయాను...."

ఏం ఊహించుకున్నావని అతనడుగలేదు. ఆమె కాస్త ఆశ్చర్యపడింది. మనోహర్ గురించి ఏమీ అడగడేం—అనుకుందామె. అడిగితే ఏం చెప్పాలా అన్నది కూడా ఆమెకు తోచటంలేదు. అయితే అతను మనోహర్ గురించి ఆమెను ఆ తర్వాత కూడా ఇంకేమీ అడగలేదు.

## 5

ఆ రోజు ఆదివారం. సరళ ఉదయమే లేచి తలంటి పోసుకుంది. భర్త లేచాక—"ఈ రోజు యెక్కడికైనా

వెడదామాండీ?" అంది.

"ఎక్కడికి?"

"ఉలవ కొండకు...."

గోపాలం ఉలిక్కిపడ్డాడు — "ఉలవకొండకా?" అన్నాడు. అతడి కళ్ళలో అనుమానం కూడా కనిపించింది.

"అవునండీ—అక్కడ సంతాన విఘ్నేశ్వరుడి దర్శనం చేసుకుంటే — మీరు కోరుకునే విశేషం తప్పక జరుగుతుంది!"

"ఎవరు చెప్పారు నీకు?" ఇంకా అనుమానంగానే అన్నాడతను. తనామెను ఉలవకొండకు తీసుకువెడదామనుకుంటున్నాడు. అదీ ఆమెను చంపడానికి. అందుకే రేపే ముహూర్తం పెట్టుకున్నాడు. ఈ రోజే ఆమె కూడా ఉలవకొండకే వెడదామంటోంది. అది కాకతాళీయమా? లేక ఆమెకు తన పథకం తెలిసిపోయిందా?

"ఉలవకొండ గురించి ఎవరైనా చెప్పాలిటండీ! ఈ వీధిలో ఎవర్నడిగినా చెబుతారు. చాలా పేరున్న ప్రాంతం. అక్కడ మీక్కూడా పనికొచ్చే ప్రాంతముంది. గుడికి వెళ్ళాలంటే ఎంతో కొండ ఎక్కనవసరం లేదు. కానీ ఇంకా బాగా పైకి ఎక్కితే అక్కడ ఎంతో రమ్యంగా ఉంటుందిట. కొత్త దంపతులు అక్కడికి వెడుతూంటారుట. ఇంకా చెప్పాలంటే స్వామిని వేడుకుని అక్కడకు వెడితే ..." అని ముసిముసిగా నవ్వింది సరళ.

ఇది కాకతాళీయమా—కాదా? — అని ఆలోచిస్తున్నాడు గోపాలం. కాకతాళీయం కాని పక్షంలో తన పథకం చాలా సులభంగా తెలిసిపోయింది. ఉలవ

కొండకు ఏ వంక పెట్టుకుని వెళ్ళాలా అని ఆలోచిస్తున్నాడతను.

"అలాగే వెడదాం—కానీ ఈ విషయం నువ్వు చాలా రహస్యంగా ఉంచాలి. యెవ్వరికీ చెప్పకూడదు—" అన్నాడు గోపాలం.

"రహస్యమెందుకండీ?"

"సంతానం కోసం దేవుడి దగ్గరకు వెడుతున్నామంటే-అది మన ఇద్దరికీ అవమానమే!" అన్నాడు గోపాలం.

సరళ అంగీకరించింది.

ఉదయం భోజనాలవుతూండగా వాళ్ళింటికో వ్యక్తి వచ్చాడు. గోపాలం తలుపు తీశాడు.

"సరళగారున్నారాండీ?" అన్నాడతను.

"ఎవర్నువ్వు?"

"నన్ను మనోహర్ గారు పంపారండి!"

గోపాలం రక్తం మరిగింది—"నేను సరళ భర్తను. ఏం చెప్పాలో చెప్పు—"

"మనోహర్ గారీ ఉత్తరం ఇచ్చారండి—"

గోపాలం ఉత్తరం అందుకుని—"సరే—నువ్వెళ్ళు!" అన్నాడు. అతను వెళ్ళిపోయాడు. గోపాలం ఆ ఉత్తరం చదువుకున్నాడు.

"సరళా! ఈ రోజు ఇల్లు కదిలి ఎక్కడికీ వెళ్ళొద్దు. అన్ని ఏర్పాట్లూ అప్పుడే నేను చేయగల్గుతాను...."

ఆ ఉత్తరం చదవగానే అతడికి ఆవేశం వచ్చింది. నిగ్రహించుకుని జేబులో పెట్టుకున్నాడు. నెమ్మదిగా భోజనాల గదిలోకి వెళ్ళాడు.

"ఎవరండీ?" అంది సరళ.

"ఎవడో వీరభద్రయ్యిల్లు ఎక్కడా అని అడిగాడు,

తెలియదని చెప్పినా జీడిలా పట్టుకుని వదల్లేదు...."
అన్నాడు గోపాలం.

## 6

ఉలవకొండకు వెళ్ళాలంటే రెండున్నరకు బస్సొస్తుంది.

మధ్యాహ్నం రెండింటికి ఇద్దరూ బయల్దేరారు.

గోపాలం మనసులో సరళకు వ్యతిరేకంగా బలం పెంచుకుంటున్నాడు. ఆమెను చంపాలన్న కోరిక బలం పుంజుకొనేలా చేస్తున్నాడు. తను చేస్తున్నది తప్పు కాదని సమర్థించుకుంటున్నాడు.

ఇద్దరూ బస్ స్టాండు చేరుకున్నారు. అప్పటికి బస్సింకా రాలేదు. అక్కడ ఒకతను గోపాలాన్ని పలకరించాడు. గోపాలం కూడా అతడితో చేతులు కలిపి — "చాలా కాలమైందిరా నిన్ను చూసి!" అన్నాడు.

ఇద్దరూ కాసేపు అవీ యివీ కబుర్లు చెప్పుకున్నారు. ఇంతలో బస్సు రానే వచ్చింది. జనం హడావుడిగా బస్సువైపు పరుగెత్తారు.

"ఎవరండీ అతను!" అంది సరళ.

"నా చిన్ననాటి స్నేహితుడు. జగన్నాథం—మాకెంత చనువంటే నన్ను వాడు గోపిగా అంటాడు. నేను వాణ్ని జగ్గూ అంటాను...."

"జగ్గూ అంటారా?" ఉలిక్కిపడింది సరళ.

"అవును—ఏం?"

"అతడు మీకంటే బలంగా, ఎత్తుగా ఉన్నాడు.."

గోపాలం రక్తం మరిగింది—"వాణ్నీ నన్నూ ఎందుకు పోలుస్తున్నావ్?"

సరళ తడబడింది. తనొకలా అంటే భర్త మరొకలా

అర్థం చేసుకున్నాడు — "అది కాదండీ — అతనిప్పు డెక్కడికి వెళుతున్నాడు?"

"ఏమో — తెలియదు—"

"అతనూ మనతో ఉలవకొండ వస్తాడేమోనని నా అనుమానం — మీరు ఉలవకొండ వెళుతున్నట్లు అతడికి గానీ చెప్పారా?"

"చెప్పలేదులే."

బస్సులో అందరూ యెక్కడం అయింది. సరళ, గోపాలం కూడా ఎక్కారు. ఇంకా నాలుగు సీట్లు ఖాళీ ఉన్నాయి బస్సులో. ఆర్టీసీ బస్సు కాబట్టి భర్తీకోసం ఎదురుచూడకుండానే బయల్దేరింది.

"ఉలవకొండ .... ఉలవకొండ ...." అన్నాడు కండక్టరు.

గోపాలం లేచాడు. సరళ లేచింది. ఇద్దరూ బస్సు దిగుతూంటే జగన్నాథం లేచాడు—"సార్ —మీరు దిగాల్సిందిక్కడ కాదు...." అన్నాడు కండక్టరు.

"తెలుసులేవయ్యా — నాకూ ఇక్కడ పనుంది!" అంటూ విసుగ్గా దిగాడు జగన్నాథం.

అతను దిగడం చూసి గోపాలం ఆశ్చర్యపడ్డాడు. సరళ భయపడింది.

అక్కడ వాళ్ళు ముగ్గురే దిగారు.

"నువ్విక్కడ దిగుతావని మా ఆవిడ జోస్యం చెప్పింది!" అన్నాడు గోపాలం.

జగన్నాథం కూడా ఆశ్చర్యంగా—"ఎలా తెలుసు మీకు?" అన్నాడు.

సరళ మొహమాటంగా నవ్వి ఊరుకుంది. అయితే

ఆమె మనసునిండా భయం. జగ్గా యిప్పుడు రానే వచ్చాడు. అతడు తన భర్తను చంపేస్తాడా? మనోహర్ తనకు యిచ్చినమాట నిలబెట్టుకోడా?

"ఉలవకొండలో నీకేమిటి పని?" అన్నాడు గోపాలం.

"ఏమీ లేదు. మీరూ దిగుతున్నారు కదా అని నేనూ దిగాను...."

అక్కడ వాళ్ళు ముగ్గురూ తప్ప ఇంకెవ్వరూ లేరు. చుట్టూ బొత్తిగా జనసంచారం లేకపోవడం సరళకు ఇబ్బందిగా ఉంటే—అతనక్కడ ఉండటం గోపాలానికి ఇబ్బందిగా వుంది.

గోపాలం ఇబ్బందిగా నవ్వాడు. ముగ్గురూ కలిసి కొండ ఎక్కటం ప్రారంభించారు. గుడి చేరుకుందుకు ఎంతో సేపు పట్టలేదు.

గుడి దగ్గర నలుగురు చిన్న పిల్లలున్నారు. వాళ్ళు ఆడుకుంటున్నారు. గుడిలో పెద్ద విశేషమేమీ లేదు. ఓ పెద్దరావిచెట్టు. రావిచెట్టుకింద ఎత్తయిన దిమ్మ. దానిపై విఘ్నేశ్వరుడి విగ్రహం!

సరళ పిల్లలకు పైసలిచ్చింది. జగన్నాధం వాళ్ళతో "మీ ఇల్లెక్కడ?" అనడిగాడు. కొండకు అటువైపు నుంచి ఏదో అడ్డుదారి ఉన్నదట. సుమారు రెండు కిలో మీటర్ల దూరంలో ఏదో పల్లె ఉన్నది. ఆ కొండకు దగ్గర్లో ఉన్న పల్లె అది ఒక్కటే!

అయితే చుట్టుపక్కల దగ్గర్లో మరే గ్రామమూ లేదు. ఒక్క జగన్నాథం సమక్షం తప్ప అన్ని విధాలా పనికి సానుకూలంగానే ఉంది,

# 7

ముగ్గురూ కొండ ఎక్కుతున్నారు. చాలా ఎత్తు వుంది. జగన్నాథం ఏవో కబుర్లు చెబుతున్నాడు. అయిష్టంగా వింటున్నాడు గోపాలం. అతణ్ని విస్మయ కళ్లతో కనిపెడుతోంది సరళ.

కొండమీదకు చేరుకున్నారు ముగ్గురూ.

జగన్నాథం అన్నాడు — "అలా అంచుకు వెళ్ళి చూస్తే చాలా బాగుంటుంది. ప్రకృతి రమణీయకతను చూడవచ్చు—"

అతడి ఉద్దేశ్యం సరళకు అర్థమయింది—"వద్దు—" అంటూ అరిచిందామె.

గోపాలం ఆశ్చర్యంగా—"ఏం?" అన్నాడు.

"నాకు కళ్ళు తిరుగుతున్నాయి. ఒక్క నిముషం కూర్చుని స్థిమితపడదాం—"

ముగ్గురూ కూర్చున్నారు.

జగన్నాథం చిన్ననాటి విశేషాలు చెప్పటం ప్రారంభించాడు. ఆ రోజుల్లో—గోపాలం బుద్ధిగా చదువుకునేవాడు. జగన్నాథం బాగా అల్లరిచేసేవాడు. ఇద్దరికీ క్షణంపడేది కాదు. ఒంటరిగా దొరికినపుడల్లా జగన్నాథం గోపాలాన్ని చితకబాదేవాడు. గోపాలం పెద్దలకు చెప్పి జగన్నాథాన్ని తన్నించేవాడు. కొంతకాలంపోయాక గోపాలం తెలివిమీరి — తను జగన్నాథానికి ఒంటరిగా దొరికేవాడు కాదు. పైగా తను దెబ్బలు తిన్నట్లు అబద్ధంచెప్పి జగన్నాథానికి అన్యాయంగా దెబ్బలు తగిలేలా చేసేవాడు. ఒకరోజున జగన్నాథం గోపాలాన్ని పదిమందిలో నిలదీశాడు.

"ఏదో ఓ రోజున మళ్ళీ నువ్వు నన్ను తన్నకపోతావా?

దానికిది అద్యాన్ననుకో—" అన్నాడు గోపాలం.

"నీకులా నేనూ అద్యాన్ను గురించి ఆలోచించా నంటే నీకు ప్రాణాలే దక్కకపోవచ్చు. తెలుసా?" అని బెదిరించాడు జగన్నాధం.

అదే వారిద్దరిమధ్యా ఆఖరి శత్రుత్వం. గోపాలం భయపడ్డాడో, జగన్నాధం మారాడో తెలియదు కానీ ఆ తర్వాతినుంచి వారిద్దరూ మంచి స్నేహితులయ్యారు. ఓ రెండు సంవత్సరాల స్నేహం తర్వాత జగన్నాధం గోపాలంతో—"నేను నీతో స్నేహంచేసి చాలా మంచి పని చేశాను...." అన్నాడు.

"ఏం?" అన్నాడు గోపాలం.

"నిన్ను చంపాలన్న ఆలోచన నాలో నిజంగా నే కలిగింది. అయితే నాకు ప్రమాదం లేకుండా నిన్ను చంపాలనుకున్నాను. నీలోని బలహీనతలు తెలుసుకుని ఎవరికీ అనుమానం రాని విధంగా నిన్ను చంపటం కోసం నీతో స్నేహం ప్రారంభించాను. అయితే ఆ స్నేహమే నువ్వెంత మంచివాడివో నాకు తెలియజేసింది. ఇంక కలలో కూడా నిన్ను చంపాలన్న ఆలోచన రానివ్వను. అయితే...." అని ఒక క్షణం ఆగి-"నిన్నెలా చంపాలో నీ బలహీనతేమిటో నాకు పూర్తిగా తెలిసిపోయాయి. ఎప్పుడు ఏ క్షణంలో కావాలనుకున్నా—అత్యంత సులభంగా నిన్ను చంపగలను. ఈ ఆలోచనే నాకు బాగోలేదు...." అన్నాడు జగన్నాధం.

మిత్రులిద్దరూ ఇది గుర్తుచేసుకుని నవ్వుకున్నారు.

సరళ ఆలోచిస్తోంది. గోపాలం భయపడదేం? జగన్నాధం చిన్నతనంనుంచీ అతణ్ని ద్వేషిస్తున్నాడన్న మాట! అతడు గోపాలాన్ని చంపాలనుకోవడానికి అదే

కారణం కావచ్చు. మనోహర్ పేరునతను ఆ కారణంగా చెప్పి ఉండవచ్చు. మనోహర్‌కు తనమీద ప్రేమాభిమానాలున్నాయి. తన మాటంటే అతడికి విలువ వుంది. అందువల్ల అతడు తన భర్తను చంపాలని అనుకోడు.

ఇప్పుడు జగన్నాథం ఆ అవకాశంకోసం వచ్చాడా? తన భర్తను చంపి అతడేం చేస్తాడు? అతను తనవంక చూడటంలేదు. తనపట్ల మర్యాదగా ప్రవర్తిస్తున్నాడు. కానీ — ఏమో! భర్తను చంపటం అయ్యాక అతడి మనసు ఎలా మారుతుందో?

"నీకు కళ్ళు తిరగటం తగ్గిందా?" అన్నాడు గోపాలం. అతడికి చాలా అసహనంగా వుంది. ఏం చేయాలో అతడికి తోచటంలేదు. ఇలాంటి అవకాశం మళ్ళీ రాదు. కానీ వచ్చిన అవకాశాన్నెలా ఉపయోగించుకోవడం?

సరళ ఒక నిర్ణయానికి వచ్చింది. "తగ్గింది—" అంటూ లేచిందామె.

గోపాలం, జగన్నాథం కూడా లేచారు.

"మీరు నడవండి— నేనూ వస్తున్నాను...." అంది సరళ.

ఇద్దరూ నడుస్తున్నారు....కొండ కొనవైపు....

సరళ వాళ్ళిద్దర్నీ పరీక్షగా ఆత్రుతగా చూస్తోంది. ఏం జరుగుతుందిప్పుడు?

ఇద్దరూ కొండ కొన సమీపించారు.

సరళ ఇంక ఆగలేకపోయింది. ఆమె ఒక్క ఉదుటున వాళ్ళను సమీపించింది. జగన్నాథాన్ని లోయలోకి ఒక్క తోపు తోసింది. అతను పెద్ద కేక వేశాడు.

అప్పుడక్కడ ఇద్దరే వున్నారు. గోపాలం, సరళ!

# 8

గోపాలం లోయలోకి తొంగి చూడ్డానికి ప్రయత్నించాడు. ఏమీ కనబడ్డంలేదు. అంతా అగాధం.... జగన్నాథం.... పాపం!

"ఎంత పని చేశావు సరళా!" అన్నాడు గోపాలం.

"ఏం చేయమంటారు మరి?" అంది సరళ.

"ఎందుకలా చేశావు?" అన్నాడు గోపాలం.

"అతను మిమ్మల్ని చంపడానికి వచ్చాడు. నేను ఒక్క క్షణం జాప్యం చేసి వుంటే, ఆ అగాధంలో మీరు అతడి స్థానంలో ఉండేవారు...." అంది సరళ నిలువెల్లా వణికిపోతూ.

"కావచ్చు .. కానీ నీకీ విషయం ఎలా తెలిసింది?"

"నా స్నేహితురాలు నళిని చెప్పింది...."

"నళిని ఎవరు? నేనెరుగని స్నేహితురాండ్రున్నారా నీకు?"

"ఒక్క నిమిషం నన్ను కూర్చోనివ్వండి...." అంది సరళ.

ఇద్దరూ కూర్చున్నారు. సరళ నెమ్మదిగా అతడికి మనోహర్ కథ చెప్పింది. ఆపైన నళిని హెచ్చరిక గురించి చెప్పింది.

కథ వింటూ గోపాలం ఆవేశపడ్డాడు — "అయితే నీ గురించి నేను విన్నది నిజమే నన్నమాట!"

"ఏమిటి మీరు విన్నది?"

"పెళ్ళికి ముందు మనోహర్ తో తిరిగావని!"

"తిరగడమంటే శారీరక సంబంధమని మీరనుకోని పక్షంలో పెళ్ళికిముందు నేనతడితో తిరిగిన మాట నిజం" అంది సరళ.

"పాపాత్మురాలా — ఎంతకు తెగించావ్? ఇవన్నీ నాకు ముందే ఎందుకు చెప్పలేదు?"

"చెప్పవలసిందేమీ లేదని అప్పుడు చెప్పలేదు. చెప్ప కూడనిదేమీ కాదనిపించి ఇప్పుడు చెప్పాను—" అంది సరళ.

"సరే—అయితే నేను చెప్పేది విను...." అన్నాడు గోపాలం.

"చెప్పండి!"

"నేను నిన్నిక్కడికి తీసుకొచ్చింది నిన్ను చంపాలని! నాకు శనిగాడిలా ఆ జగన్నాథం తగుల్కొన్నాడు. వాణ్నెలా వదుల్చుకోవాలా అని ఆలోచిస్తున్నాను. నీ చావుకు నువ్వే సాయపడుతున్నావు. ఇంక దైవప్రార్థన చేసుకో!" అన్నాడు గోపాలం.

"నన్ను చంపుతారా?" నమ్మలేనట్లు అంది సరళ.

"అవును—"

"ఎందుకు?"

"నీకంటే అందమైనదీ, నీకంటే సరసమైనదీ, నన్ను డబ్బులో ముంచి తేల్చేదీ ఓ. అందాల భరిణ నన్ను వలచి వరించింది. నిన్ను అడ్డం తొలగించుకోమంది. అంత సులభంగా మాటలకు లొంగే మనిషిని కాదు నేను. కానీ నీకూ మనోహర్‌కూ ఉన్న సంబంధం గురించి తెలియగానే నేను నిన్ను వదిలించుకోవాలనే అను కున్నాను. అందుకు ఆ నళిని ఎవరో కానీ బాగా సాయ పడింది...."

"మీరు వేళాకోళమాడుతున్నారు" అంది సరళ.

"పోనీ అలాగే అనుకో .... కానీ అయిదే నిమిషాలు టయిం...." అంటూ అతను లేచినిలబడ్డాడు.

అప్పుడు చూసింది సరళ....

అతడి ముఖంలో అసలైన షాంతకుడు కనబడుతున్నాడు.

అప్పుడు కలిగింది సరళకు....

అసలైన భయం.

"నేను మీ ప్రాణాలు రక్షించాలని ఎంతో తాపత్రయపడ్డాను. నన్ను మీరు చంపుతారా?" అంది సరళ దీనంగా.

"జీవితంలో సుఖపడాలనుకున్నవాడు దయాదాక్షిణ్యాలకు దూరంగా వుండాలి. ఆ సత్యం తెలుసుకున్నవాకు నువ్వింకేమీ చెప్పి ప్రయోజనంలేదు—"

సరళ చటుక్కున లేచి నిలబడింది. అక్కణ్నించి పారిపోవాలన్నది ఆమె ప్రయత్నం. అయితే అది గోపాలం కనిపెట్టాడు. ఆమెను బలంగా లాగాడు. కొండ కొనవరకూ ఈడ్చాడు.

"ఏమండీ—ప్లీజ్ .... వదలండి .... నేను మీకేం అన్యాయం చేశానండీ....కావాలంటే నేను మీ దారికి అడ్డురానండీ....మీకు కనబడకుండా వెళ్ళిపోతానండీ.... నన్ను వదలండీ....నన్ను చంపొద్దండీ.... నాకింకా బ్రతకాలనీ ఉందండీ...."

సరళ అరుస్తోంది. గోపాలం ఆ అరుపులు వినటం లేదు. అతడి కనులముందు ఆమె. నైట్ డ్రెస్సులోని వంపుసొంపులతో ఆమె....

గోపాలం సరళను ఒక్క తోపు తోశాడు. ఆమె కెవ్వుమని అరిచింది.

గోపాలం ఓసారి క్రిందకు లోయలోకి తొంగి

చూశాడు. బట్టలు సవరించుకున్నాడు. ఒక్క నిమిషం నిమితంగా కూర్చున్నాడు. చల్ల గాలిలో కూడా అతడికి చెమటలు పట్టాయి. పది నిమిషాల్లో అతను కొంత నిమిత పడి లేచాడు. లేచి నిలబడితే కాళ్ళు వణుకుతున్నాయి.

తను హత్య చేశాడు....తను హంతకుడు....

కానీ ఈ హత్య గురించి ఎవ్వరికీ తెలియదు. తను సమాజంలో పెద్దమనిషిగా చెలామణీ కావచ్చు. హాయిగా జీవించవచ్చు. ఆమెతో జీవితం.....

## 9

గోపాలం ఉత్సాహం తెచ్చుకుని అక్కణ్నించి కదిలాడు. క్రమంగా అతడి అడుగుల్లో వేగం పుంజుకుంది. కొండ ఎక్కడం కష్టం కానీ దిగటం కష్టం కాదు. గోపాలం గుడి చేరుకోవడానికి ఎంతో సేపు పట్టలేదు.

గుడి దగ్గర నలుగురు పిల్లలూ ఆడుకుంటున్నారు. గోపాలాన్ని చూస్తూనే వాళ్ళు పరుగున వచ్చారు—
“బాబుగారూ—ఆ యమ్మ, ఆ బాబు ఏరీ?”

అప్పుడు గోపాలానికి ఏమీ స్ఫురించలేదు — “వాళ్ళా—కాసేపుండి వస్తారు!” అని గబగబా కొండ దిగాడు.

సరిగ్గా కొండకింద ఆమె నిలబడి ఉన్నది.

“నువ్వా?” అన్నాడతను ఆశ్చర్యంగా.

“అవును—నేనే!” అందామె — “జగ్గూ ఏడీ?”

“జగ్గూను నువ్వు పంపించావా?”

“నేనే పంపించాను. కానీ సరళకు మనోహర్ పేరు చెప్పాను....”

“అంటే నువ్వేనా నళినివి....”

“అవును—ఇంతవరకూ నీకు నా పేరే తెలియదు కదూ.

అయినా ఆడదాన్ని ఆడదానిగానే చూసే నీకు నా పేరెందుకు తెలుసుకోవాలనిపిస్తుంది?"

"ఏమైతేనేం—మనమధ్య అడ్డు తొలగించాను ..."

"జగ్గూ ఉండగా నీకది ఎలా సాధ్యపడింది?" ఆమె అడిగింది.

సరళ జగ్గూను తోసినట్లు చెప్పాడు గోపాలం.

"ఆ తర్వాత నువ్వు ఆమెను తోసేశావు. అంతేగా?"

"అక్షరాలా!"

"చాలా థాంక్స్—" అని అక్కణ్ణించి కదిలింది నళిని "నాతో వస్తావా-నిన్ను కార్లో డ్రాప్ చేస్తాను!"

కారెక్కాడు గోపాలం. అతణ్ణి వెనుక సీట్లో కూర్చోమన్నదామె. నళిని కారు డ్రైవ్ చేస్తూ—"నాకు సరళ అంటే ఎందుకు పగో చెప్పాను. కానీ జగ్గూ అంటే ఎందుకు పగో చెప్పలేదు—" అంది.

"జగ్గూ అంటే కూడా నీకు పగ వుందా?" ఆశ్చర్యంగా అన్నాడు గోపాలం.

"జగ్గూ నన్ను బ్లాక్ మెయిల్ చేస్తున్నాడు. ఎందుకూ అని అడక్కు. ఆ రహస్యం జగ్గూతోనే చచ్చిపోయింది. జగ్గూ వేశ్యాగృహం నడుపుతున్నాడు. అందుకు అమ్మాయిలు కావాలి. నన్ను సంపాదించిపెట్టమని వేధిస్తున్నాడు. సరేనన్నాను. నిన్ను చంపి సరళను ఎత్తుకుపొమ్మన్నాను. సంతోషంగా అంగీకరించాడు.

నువ్వు క్యాంపులో ఉండగానే ఓ రాత్రిపూట సరళ ఇంటికి వెళ్ళి ఆమెను హెచ్చరించాను. అంతకు ముందే ఆమెకు వ్యతిరేకంగా నిన్ను హెచ్చరించాను. ఒక సగటు ఆడదిగా ఆమె, సగటు మగాడుగా నువ్వు ప్రవర్తించటంలో నా పథకం నూటికి నూరుపాళ్ళ

విజయవంతమయింది. గుడ్ బై!" అంటూ కారాపింది ఆమె.

"మరి—మన పెళ్ళి!" అన్నాడు గోపాలం.

"అప్పుడే తన ప్రాణాలు కాపాడిందన్న కృతజ్ఞత కూడా లేకుండా పరాయి ఆడదాని మీద ధ్యాసతో అగ్నిసాక్షిగా నాతిచరామి అని పెళ్ళిచేసుకున్న భార్యను చంపేసిన—సగటు మగాణ్ణి—సగటు ఆడది పెళ్ళిచేసుకోవచ్చునేమో—ఈ నళిని చేసుకోదు...." అంది నళిని.

"యూ...." అన్నాడు గోపాలం.

"అరవకు. అల్లరిచేయకు. బెదిరించకు. నువ్వు హత్య చేసినట్లు ఉలవకొండ దగ్గర నలుగురు పిల్లలు సాక్ష్యం చెప్పగలరు. నా మాట విని బుద్ధిగా ఇక్కణ్ణించి ఓ కిలోమీటరు నడిస్తే ఓ బస్ స్టాప్ వస్తుంది. అక్కడ బస్సెక్కితే అరగంటలో మీ వూరు చేరుకుంటావు..."

గోపాలం కారు దిగాడు. నళిని వెనక్కు వంగి కారు తలుపువేసుకుంది.

"అంటే నేను నీకు సాయపడ్డంకోసం నాకున్నదన్నీ పోగొట్టుకున్నాను. ఇదేనా జరిగింది?" అన్నాడు గోపాలం రుద్ధ కంఠంతో.

"సగటు మనుషులు చేయగలిగినదిదే! తనకంటూ మనిషి ఏమైనా సాధించాలంటే ముందు సగటుతనానికి మించి ఎదగాలి...." అందామె కారు స్టార్టుచేస్తూ.

అసహాయతకు, ఓటమికి, సగటుతనానికి చిహ్నంగా అతనక్కడ మిగిలిపోయాడు. తనిప్పుడేంచేయాలో అతడికి తెలియటంలేదు.

విజయానికి చిహ్నంగా నళిని కారు దూసుకుపోయింది.

—:ఐ పో యిం ది:—

# ఈ హత్య నీ కోసం!

## విశ్వమోహిని

బాలభానుడు లోక పర్యటనకు సన్నద్ధుడవుతూన్న వేళ-

డిటెక్టివ్ ప్రాణ్ ఇంటివద్ద ప్రత్యక్షమయ్యాడు క్రయింబ్రాంచ్ ఇన్ స్పెక్టర్ మాధవ్.

గీత బలవంతంగా కుదిపి లేపటంతో తప్పనిసరిగా నిద్రలేచి డ్రాయింగ్ రూంలోకి వచ్చిన ప్రాణ్ — మాధవ్ ని చూడగానే నిద్రకళ్ళను నల్లపిల్లిని చూసినట్లు ఫీలయ్యాడు.

"ఊరక రారు పోలీసులు! ఏమిటి విశేషం, తెల్లవారకుండానే నామీద ఆగ్రహం — సారీ — అనుగ్రహం కలిగింది నీకు?" అన్నాడు ప్రాణ్ మందహాసంతో ఇన్ స్పెక్టర్ నుద్దేశించి.

ఇన్ స్పెక్టర్ వదనం గంభీరంగా వుంది.

"ప్రాణ్! యూ ఆర్ అండర్ అరెస్టు!" అన్నాడు.

చిన్నగా ఉలిక్కిపడ్డాడు ప్రాణ్. ఉలికిపాటును కప్పిపుచ్చుకుంటూ, "రాత్రి పీడకలేమీ రాలేదుగదా?"

అన్నాడు చిరునవ్వుతో.

"అయాం నాట్ జోకింగ్."

"మరి—? ప్రొద్దుటే ఈ వైత్య ప్రకోపానికి హేతు వేమిటి, మాధవా?" అన్నాడు ప్రాణ్ నాటక ఫక్కీలో.

"డోంట్ బీ సిల్లీ!" అన్నాడు మాధవ్ కటువుగా. "కాబరే డాన్సర్ మేనకను హత్య చేసిన నేరానికి నిన్ను అరెస్టు చేస్తున్నాను."

ఇన్‌స్పెక్టర్ చూపించిన అరెస్టు వారెంట్‌ను చూసి తెల్లబోయాడు ప్రాణ్.

"డామిట్ మాధవ్! మనిద్దరిలో ఒకరికి నిద్రమత్తు ఇంకా వదిలివుండదు ...." అన్నాడు. "లేకపోతే, ప్రొద్దుటే ఏమిటీ ఈ న్యూసెన్స్?"

"కటిట్ మాన్! లెటజ్ గో—" అన్నాడు ఇన్‌స్పెక్టర్, జేబులోనుండి హాండ్‌కఫ్స్ తీస్తూ.

అది చూసి నిర్ఘాంతపోయింది మిస్ గీత.

## 2

"ప్రాణ్ జీ! వుయ్ నీడ్ యువర్ హెల్ప్" అన్న వ్యక్తుల వంక పరిశీలనగా చూశాడు డిటెక్టివ్ ప్రాణ్.

ముగ్గురు వ్యక్తులు కూర్చున్నారు డిటెక్టివ్ కెదురుగా. ఆ మధ్య వయస్కులు ముగ్గురిలో ఇద్దరు నగరంలో గొప్ప పేరు ప్రఖ్యాతులున్న లక్షాధికార్లు. ఒకతని పేరు శంకర్‌లాల్. బంగారు నగల వ్యాపారి. రెండవ వ్యక్తి శేట్ కిషోరీలాల్. ఫైనాన్సియర్ అతను.... ఇక మూడవ మనిషి ఫైనాన్స్ బ్రోకర్ సాధుసింగ్.

"పెద్దలందరూ స్వయంగా వచ్చారంటే ఏదో విశేషమే వుండాలి. ఎలా సహాకరించగలనో చెప్పండి"

అన్నాడు ప్రాణ్.

ఒకసారి ముఖాలు చూసుకున్నారు ముగ్గురూ. కళ్ళతోనే మాట్లాడుకున్నారు. ముగ్గురిలోకీ చిన్నవాడైన సాధుసింగ్ గొంతు సవరించుకున్నాడు. "మిష్టర్ ప్రాణ్! ఇప్పుడు మేము చెప్పబోయేదంతా రహస్యంగా వుంటుందని ముందుగా మీరు హామీ యివ్వాలి" అన్నాడు.

"వెల్! అవసరమయితే తప్ప క్లయింట్స్ యొక్క రహస్యాలను బయటపెట్టారు డిటెక్టివ్‌లు. కనుక ఆ విషయంలో మీకు భయంలేదు" అన్నాడు ప్రాణ్ సిగరెట్ పొగ గాలిలోకి వూదుతూ.

"థాంక్స్" అంటూ ప్రారంభించాడు సాధుసింగ్. "రెండు రోజుల క్రితం బొంబాయినుండి రమేష్‌చంద్ర అనే ఓ వజ్రాల వ్యాపారి నగరానికి వచ్చాడు. అతనివద్ద సుమారు కోటిరూపాయలు విలువచేసే వజ్రాలున్నాయి. వాటిలో అపూర్వమూ, అమూల్యమూనయిన వజ్రాలెన్నో వున్నాయి. వాటిని నగరంలోని ప్రముఖ వ్యాపారస్థులకు చూపి, అమ్మకంపెట్టే నిమిత్తం బిజినెస్ టూర్‌మీద నగరానికి వచ్చాడతను. ఆ సందర్భంలో మేమంతా కలిసి నిన్న రాత్రి హోటలు చోళాలో గొప్ప విందు చేశాము...."

ఆగి, సాభిప్రాయంగా కిషోరీలాల్ కన్నుల్లోకి చూశాడు సాధుసింగ్.

"ప్రాణ్ జీ! రమేష్‌చంద్ర అదృశ్యమయ్యాడు. ఎక్కడున్నాడో, ఏమయ్యాడో బోధపడకుండా వుంది" అన్నాడు కిషోరీలాల్.

"పూర్తి వివరాలు చెప్పాలి మీరు....రమేష్‌చంద్ర

రాత్రి పార్టీ తరువాత ఎక్కడ విడిదిచేశాడో ఏమేం చేశాడో చెప్పండి" అన్నాడు ప్రాణ్.

"పార్టీ పూర్తయ్యేసరికి అర్థరాత్రి దాటిపోయింది. ఆ పార్టీలో ప్రముఖ కాబరే డాన్సర్ మేనక కూడా పాల్గొంది. రమేష్‌చంద్రకు ఆమెతో పరిచయముంది. అందుకే రాత్రి ఆమె ఇంట్లో గడిపేందుకు వెళ్ళాడతను. తెల్లవారి చూస్తే అతను కనిపించలేదట! వెంటనే మాకు ఫోన్ చేసింది మేనక" వివరించాడు శంకర్‌లాల్.

"తెలిసిన చోటనల్లా వెదికాం రమేష్‌చంద్ర కోసం. అతని జాడ తెలియలేదు. ఒకవేళ అర్జెంటుగా బొంబాయి తిరిగి వెళ్ళిపోయాడేమోనని, బొంబాయి కాంటాక్టు చేశాము. అక్కడికీ వెళ్ళలేదని తెలిసింది. సుమారు కోటి రూపాయలు విలువచేసే వజ్రాలు అతని దగ్గరున్నాయి. అందుకే భయం కలిగింది మాకు, అతనికి ఏదైనా ఆపద సంభవించిందేమోనని" అన్నాడు సాధు సింగ్.

"పోలీస్ కంప్లెయింటిచ్చి అల్లరిచేయటం ఇష్టంలేక ప్రయివేట్ డిటెక్టివ్ ద్వారా అతని ఆచూకీ తెలుసుకోవాలని నిశ్చయించుకున్నాం మేము. అందుకే మీ సహాయం కోరి వచ్చాం" అన్నాడు కిషోరీలాల్.

"ప్రాణ్ జీ! వెంటనే మీరు రమేష్‌చంద్ర ఆచూకీ కనిపెట్టాలి. అతను ఏ ఆపదలోనయినా చిక్కుకున్నట్టయితే అతన్ని కాపాడాలి మీరు.... ఖర్చులకు వెనుదీయకండి. వజ్రాలతోపాటు రమేష్‌చంద్రను తెచ్చి అప్పగించారంటే—మీరు కోరిన ఫీజు ఇచ్చుకుంటాం" అన్నాడు శంకర్‌లాల్.

ఔనన్నట్లు తలలూపారు కిషోరీలాల్, సాధుసింగ్‌లు.

"ఈ కేసును ట్రేక్ చేయడానికి నాకేం అభ్యంతరం లేదు. కాని, ముందుగా ఈ విషయం పోలీసులకు తెలపటం ముఖ్యం" అని సలహా ఇచ్చాడు ప్రాణ్.

"కాని, ప్రముఖ వజ్రాల వ్యాపారి కోటి రూపాయల వజ్రాలతో మాయమయ్యాడన్న వార్త పత్రికలకెక్కితే ఇంకేమైనా వుందా? ఇటు మద్రాసు నగరంలోనూ, అటు బొంబాయిలోనూ ఎంత పెద్ద అలజడి రేగుతుందో వూహించారా?" అన్నాడు సాధుసింగ్.

"తప్పదు, మిస్టర్ సింగ్! కావలంటే ఈ విషయాన్ని గోప్యంగా వుంచవలసిందిగా పోలీసులను కోరవచ్చును" అన్నాడు ప్రాణ్.

ఒకసారి ముఖాలు చూసుకున్నారు ముగ్గురూ.

"ఆల్ రైట్ మీ సలహా ప్రకారమే చేస్తాం. ఐ.జి.ని కలుసుకుని మాట్లాడతాము" అన్నాడు కిషోరీలాల్ చివరకు.

అంతలో రిఫ్రెష్‌మెంట్సు రావటంతో వాటిని తీసుకుంటూ ఆలోచనలో పడ్డారంతా.

"ఇక ఇతర వివరాలు చెప్పండి" అన్నాడు ప్రాణ్.
"రాత్రి పార్టీకి ఎందరు వచ్చారో, ఎవరెవరు వచ్చారో లిస్టు ఇవ్వండి. మేనక చిరునామా చెప్పండి."

సాధుసింగ్ ఇచ్చిన వివరాలను నోట్ చేసుకున్నాడు ప్రాణ్.

"రమేష్‌చంద్ర ఫోటో వుంటే ఇవ్వగలరా?" అడిగాడు ప్రాణ్.

సాధుసింగ్ వంక చూశాడు కిషోరీలాల్.

"పోయినసారి రమేష్‌చంద్ర నగరానికి వచ్చినపుడు తీసిన ఫోటో కంపెనీ ఆల్బమ్‌లో వుండాలి. చూసి

పంపిస్తాను" అన్నాడు సాధుసింగ్.

తరువాత అడ్వాన్సుగా డిటెక్టివ్ ప్రాణ్ కి అయిదు వేలకు చెక్ యిచ్చి వెళ్ళిపోయారు వాళ్ళు.

# 3

కాబరే డాన్సర్ మిస్ మేనక అడయారులో వుంటోంది.

ప్రాణ్ అక్కడికి వెళ్ళేసరికి రాత్రి ఏడు గంటలయింది.

మేనక పాప్యులర్ డాన్సర్. ఆమెకు ఇరవయ్యేళ్ళుంటాయి. పేరుకు తగినట్టే చాలా అందంగా వుంటుంది. ఒంటినిండా గుడ్డలు కప్పుకున్నా అపురూపమైన ఆమె సౌందర్యం స్త్రీలనే మోహానికి గురిచేస్తుంది. అటువంటిది ఆమె నైట్ క్లబ్ లో గుడ్డలు విప్పుకుని డాన్సుచేస్తూంటే వేరే చెప్పనవసరంలేదు. పురుషులంతా పిచ్చివాళ్ళయిపోతూంటారు. అద్వితీయమయిన ఆమె సౌందర్యాన్ని క్షణకాలమైనా తమ స్వంతం చేసుకునేందుకు వేలు ఖర్చుచేస్తారని వినికిడి.

ఓ లక్షాధికారి ప్రేమతో ప్రెజెంట్ చేసిన ఓ అందమయిన బంగళాలో వొంటరిగా వుంటోంది మేనక.

డిటెక్టివ్ ప్రాణ్ పేరు వినగానే సాదరంగా అతన్ని ఆహ్వానించిందామె. గులాబిరంగు దేహానికి మ్యాచ్ అయిన లైట్ రోజ్ మిడీలో అతనికి దర్శనమిచ్చిందామె.

ఆ అందాలరాశిని చూసేసరికి ప్రాణ్ గుండె ఒకసారి కొట్టుకోవటం మానేసింది. అందమయిన స్త్రీలపట్ల బలహీనత వుంది ప్రాణ్ కి. ఇక మేనకవంటి సుందరిని చూస్తే చెప్పాలా! నిశ్శబ్దంగా గుటకలు మింగాడు.

చిరునవ్వుతో డిటెక్టివ్ కి విలాసంగా చేతులు జోడించి నమస్కరించింది మేనక.

తనను తాను నిగ్రహించుకున్నాడు ప్రాణ్. అయినా, "యూ ఆర్ వెరీ వెరీ బ్యూటిఫుల్, మిస్ మేనకా!" అని కాంప్లిమెంట్ చేయకుండా వుండలేకపోయాడు.

"థాంక్యూ" అందామె అందంగా నవ్వుతూ.

"మిస్ మేనకా! ప్రముఖ వజ్రాల వ్యాపారి రమేష్ చంద్ర అదృశ్యమయినట్లు నీకు తెలుసు. ఆ సందర్భంలో నీతో కొద్దిగా మాట్లాడాలి" అన్నాడు ప్రాణ్, బిజినెస్ కి దిగుతూ.

ఆమె వదనంలో ఆశ్చర్యం కనిపించింది.

"రమేష్ చంద్ర అదృశ్యమయ్యారా!?" అంది నమ్మలేనట్లు.

"ఔను. అతన్ని కనిపెట్టవలసిందిగా శంకర్ లాల్ ప్రభృతులు నన్ను కోరారు" అన్నాడు ప్రాణ్.

"ఆశ్చర్యంగా వుంది. అర్జెంట్ పని వుండటంతో, నన్ను లేపకుండా వెళ్ళిపోయి వుంటారనుకున్నాను. అందుకే శంకర్ లాల్ గారికి ఫోన్ చేసి అడిగాను. అంతే కాని, రమేష్ చంద్ర అదృశ్యమైన సంగతి నాకింతవరకు తెలియదు" అందామె.

"నీనుండి కొన్ని వివరాలు కావాలి నాకు" అన్నాడు ప్రాణ్.

"అడగండి, తెలిస్తే చెబుతాను."

"రాత్రి హోటలు చోళాలో విందుకు నువ్వు హాజరయ్యావు కదూ?" ప్రశ్నించాడు ప్రాణ్.

ఔనందామె.

"పార్టీ తరువాత ఏమయింది?"

"ఏముంది? రమేష్‌చంద్రతో నాకు అంతకుముందే పరిచయముంది. ఎప్పుడు మద్రాసు వచ్చినా రాత్రులు నాతోనే గడుపుతారు. రాత్రి కూడా పార్టీ ముగియగానే ఇక్కడికి వచ్చాం.... నేను స్నానంచేసి వచ్చేసరికి ఆయన బట్టలు మార్చుకుని లుంగీ కట్టుకున్నారు. డ్రింక్స్ సిద్ధంచేసారు. ఆ తరువాత రెండు, మూడు గంటలు మాకు కాలం తెలియలేదు. తెల్లవారేముందు నిద్రపోయానేమో ఉదయం ఎనిమిదిగంటలవరకు మెలకువే రాలేదు. అప్పుడు లేచి చూస్తే రమేష్‌చంద్ర లేరు. ఆయన బ్రీఫ్‌కేసు, షూస్ కూడా కనిపించలేదు. నా నిద్ర చెరపటం ఇష్టంలేక ఆయన వెళ్ళిపోయి వుంటారనుకుని, శంకర్‌లాల్‌కి ఫోన్ చేసి చెప్పాను. ఆ తరువాత ఏం జరిగిందో నాకు తెలియదు" అనది మేనక.

"వజ్రాలు అతనితోనే వున్నాయి కదూ?" ప్రశ్నించాడు ప్రాణ్.

"ఇక్కడికి వచ్చినప్పుడు ఆయన బ్రీఫ్‌కేస్ కూడా తెచ్చారు. సో, వజ్రాలు అందులో వున్నాయనే అనుకుంటాను" అందామె.

"పడుకునేముందు ఆ బ్రీఫ్‌కేస్‌ను ఎక్కడ దాచాడతను?"

"నాకు తెలియదు. చెప్పానుగా — ఇంటికి రాగానే నేను బాత్‌రూంకి వెళ్ళి స్నానంచేసొచ్చానని. అప్పటికే ఆయన డ్రెస్ చేంజ్ చేసుకుని సిద్ధంగా వున్నారు. బ్రీఫ్‌కేస్ ఎక్కడ దాచారో నేనంతగా పట్టించుకోలేదు."

"కోటిరూపాయలు విలువచేసే వజ్రాలు ఆ బ్రీఫ్‌కేసులో వున్నాయి. దానిని భద్రంగా దాచాడో లేదో

నీకు తెలుసుకోవాలనిపించలేదూ?"

తల అడ్డంగా త్రిప్పిందామె.

"లేదు ప్రాణ్ జీ! అలాంటివన్నీ నాకు మామూలే. నిజం చెప్పాలంటే ఎందరో ధనికులు తరచు నా వద్దకు వస్తూంటారు. నాపైన నమ్మకంతో లక్షలతో వస్తూంటా రిక్కడికి. పైగా రమేష్‌చంద్రకు ఈ ఇంట్లోని ప్రతి చోటూ క్షుణ్ణంగా తెలుసు. కనుక నేను ప్రత్యేకంగా అతనికి చెప్పనవసరంలేదు" అంది.

"ఐసీ" అన్నాడు ప్రాణ్ సాలోచనగా. "రమేష్ చంద్ర ఎటువంటివాడు?"

"అంటే?"

"ఐ మీన్, జాగ్రత్తపరుడా, లేక నిర్లక్ష్య వైఖరి కలవాడా అని."

నవ్విందామె. "ధనం నిర్లక్ష్యపు వైఖరిని తెచ్చి పెట్టినా కోటి రూపాయలు విలువచేసే వజ్రాల విష యంలో ఎవరూ అజాగ్రత్తగా వుంటారనుకోను" అంది.

"పరహాప్స్ యూ ఆర్ రైట్" అన్నాడు ప్రాణ్ మందహాసంతో.

"ప్రాణ్ జీ! రమేష్‌చంద్రకు హాని ఏమీ కలగలేదు కదా?" అంది మేనక, గొంతులో ఆతృత తొంగి చూస్తూంటే.

"అది తెలుసుకోవడానికే ప్రయత్నిస్తున్నాను" అన్నాడు ప్రాణ్. "బై దిబై .... రాత్రి విందుకు హాజ రయిన పెద్దమనుషులను గూర్చి నీ అభిప్రాయమేమిటి?"

మళ్ళీ నవ్విందామె. "మీరే అన్నారుగా పెద్ద మనుషులని.... దాదాపు అంతా లక్షాధికారులే. అందరూ రమేష్‌చంద్ర తీసుకొచ్చిన వజ్రాలపైన కొద్దో గొప్పో

ఆసక్తి కలవారే" అంది.

"మొత్తం ఎందరు హాజరయ్యారు విందుకు?"

ఒక నిమిషం మనసులోనే లెక్కించుకుంటూ వుండి పోయిందామె. "నేను, రమేష్‌చంద్ర కాక డజనుమంది" అంది.

తన ఇంట్లో పెనుగులాట జరిగిన చిహ్నాలు వగైరాలేవీ కనిపించలేదని చెప్పిందామె.

మరికొన్ని వివరాలను తెలుసుకుని, ఆమె ఇచ్చిన రిఫ్రెష్‌మెంట్స్‌ను ఆరగించి 'థాంక్స్' చెప్పి అక్కడి నుండి బయలుదేరాడు ప్రాణ్.

గుమ్మంవరకూ వెళ్ళిన డిటెక్టివ్‌ని వెనక్కు పిలిచింది మేనక.

"ప్రాణ్ జీ! దయచేసి రమేష్‌చంద్రకు ఏ హానీ కలగకముందే త్వరగా కనిపెట్టండి అతన్ని....ఐ—ఐ లవ్ హిమ్ సో మచ్" అంది. ఆమె స్వరంలో తొంగి చూసిన విషాద రేఖను, కన్నులలో ప్రతిఫలించిన భయాన్ని గమనించాడు ప్రాణ్.

ఆమె దగ్గరగా వెళ్ళి, "డోంట్ వర్రీ, మేనకా! ఐ విల్ డూ మై బెస్ట్" అంటూ సున్నితంగా ఆమె చేయి నొక్కి బయటకు నడిచాడు.

## 4

ఆ బంగళానుండి బయటకు వచ్చిన ప్రాణ్, సాలోచనగా కారువైపు నడిచాడు. డోర్ తెరుస్తూంటే ఎక్కడినుండో సన్నగా ఈల వినిపించింది. ఆగి అటు వైపు చూశాడు. ఎవరూ కనిపించలేదు. డోర్ తెరవ బోతూంటే మళ్ళీ వినిపించింది ఈల.

అలా రెండు, మూడుసార్లు ఈల వినిపించటంతో,

అది బంగళా ప్రహరీ బయటనుండి వినిపిస్తున్నట్లు గ్రహించిన ప్రాణ్, కారు ఎక్కకుండా గేటువైపు నడిచాడు.

గేటు దాటి అటూ ఇటూ చూస్తూన్న ప్రాణ్ మీదకు హఠాత్తుగా చీకట్లోనుండి ఇద్దరు వ్యక్తులు విరుచుకు పడ్డారు.

ఒక వ్యక్తి ప్రాణ్ గడ్డంక్రింద గ్రుద్దితే, రెండవ వాడు కడుపులో గ్రుద్దాడు.

ఆ సడెన్ అటాక్‌తో ఎగిరి గేటుమీద పడ్డాడు ప్రాణ్. అతను పైకి లేచే లోపునే మీదకు వురికారు ఆ వ్యక్తులు.

వాళ్ళెవరో, ఎందుకలా ఈలవేసి పిలిచి మరీ అటాక్ చేశారో బోధపడలేదు ప్రాణ్‌కి.

ఒకణ్ని బూటుకాలితో మొలపైన తన్నాడు. రెండవవాణ్ని చేత్తో పీకమీద కొట్టాడు. బూటు దెబ్బ తిన్న వ్యక్తి అరుస్తూ దూరంగా పడ్డాడు.

చేతి దెబ్బతిన్న వ్యక్తి మాత్రం ఆ దెబ్బను లెక్క చేయకుండా ప్రాణ్ మీద కలబడి అతని కంఠం పట్టుకున్నాడు రెండు చేతులతోనూ. ఒక క్షణం ఊపిరాడ లేదు ప్రాణ్‌కి. అతడి పట్టు విడిపించుకు నేందుకు ప్రయత్నిస్తూ మోకాలితో అతని కడుపులో పొడిచాడు. పట్టు కొద్దిగా సడలింది. ఆ వ్యక్తి కాళ్ళపైన గట్టిగా తన్నాడు. క్రింద కూలిపోయాడతను. అదే సమయంలో ప్రాణ్ మీదకు ఉరికిన రెండవ వ్యక్తి అడ్డువచ్చిన మొదటి వ్యక్తిమీద పడిపోయాడు.

స్ప్రింగ్‌లా లేచి నిలుచున్నాడు ప్రాణ్. కోపంతో అతని వదనం ఎరుపెక్కింది. చూస్తూంటే ఆరి తేరిన

రౌడీలలా కనిపిస్తున్నారు వాళ్ళు. తగిన బుద్ధి చెప్పా లనుకున్నాడు.

అరచేతిని బాకులా చేసి, పైకిలేస్తూన్న వ్యక్తులలో ఒకణ్ని మెడపైన కొట్టాడు. వాడు బాధతో అరుస్తూ పీక తెగిన కోడిపిల్లలా నేలపైకి ఒరిగిపోయాడు.... రెండవ వాణ్ని షూతో గడ్డంక్రింద తన్నాడు. వాడు ఫుట్ బాల్ లా ఎగిరి దొర్లుకుంటూ పడిపోయాడు.

మెడపై దెబ్బతిన్నవాణ్ని పట్టుకుని లేవదీశాడు ప్రాంక్. జాగ్రత్తగా వాడి మెడను సవరించాడు. తరువాత అరచేతిని బాకులా చేసి అదే చోటులో మళ్ళీ దెబ్బకొట్టాడు. ఎదురుచూడని ఆ దెబ్బకు పెద్దగా అరుస్తూ నేలపైన బోర్లా పడిపోయాడు ఆ వ్యక్తి.

అంతలో రెండవ వ్యక్తి వేగంగా దూసుకొచ్చాడు. వాడి చేతిలో కత్తి వెలుతురులో తళుక్కుమంది.... ఒక్క ఉదుటులో వచ్చి కత్తితో ప్రాంక్ గుండెల్లో పొడిచాడు ఆ వ్యక్తి. సమయానికి తప్పుకోగలిగాడు ప్రాంక్.

పట్టు తప్పటంతో ముందుకు తూలాడు ఆ వ్యక్తి. వాడి వీపుమీద గట్టిగా గుద్దాడు ప్రాంక్. నేలపైన పడిపోయాడు వాడు. పడటంతో కత్తి చేతిలోనుండి జారి దూరంగా పడిపోయింది. దాని నందుకోబోయాడు ప్రాంక్. అలా చేయటంలో కొన్ని సెకనులపాటు రెండవ వ్యక్తివైపు వీపు వుంచాడు.

ఆ అవకాశాన్ని జారవిడుచుకోలేదా వ్యక్తి. చటుక్కున లేచి నిలుచున్నాడు, మెడ నొప్పి కూడా లెక్కచెయ్యకుండా. వంకర మెడతోనే ప్రాంక్ ను సమీపించాడు. ఉక్కులా వున్న చేతులు రెండూ

బిగించి, ప్రాంక్ తలపైన బలంగా మోదాడు.

ఆ దెబ్బతో తల దిమ్మెక్కింది ప్రాంక్‌కి. కళ్ళు బైర్లు క్రమ్మటంతో ముందుకు తూలిపోయాడు. పడకుండా ఆపుకోవాలన్న ప్రయత్నంలో గేటు పట్టుకోబోయాడు. కాని, పట్టు తప్పటంతో గేటుపైన పడిపోయాడు. అలా పడటంతో తల గేటుకు కొట్టుకుంది. దాంతో స్పృహ తప్పి నేలకు జారిపోయాడు.

డిటెక్టివ్‌ని కదిలించి చూశారు ఆ వ్యక్తులు. ముక్కు దగ్గర వ్రేలుపెట్టి చూశారు. తరువాత సంతృప్తిగా తలలు పంకించారు. చేతులు దులుపుకుని అక్కడినుండి వుడాయించారు.

## 5

ఓ అరగంట తరువాత దారినపోయే వాళ్ళెవరో చూసి తెలివి తెప్పించటంతో, ఇంటికి చేరుకున్నాడు ప్రాంక్. తలంతా దిమ్ముగా వుంది. దెబ్బలు బలమయినవి కాకున్నా, అవి తగిలినచోటు సున్నితమైనది కావటంతో స్పృహతప్పటం జరిగింది. ఫ్రాక్చర్ ఏమీ లేకపోయినా, నొప్పిగా మాత్రం వుంది తలంతా.

హార్లిక్స్ త్రాగి విశ్రాంతిగా పడుకున్నాడు ప్రాంక్.

రాత్రి తొమ్మిది గంటలకు టెలిఫోన్ మ్రోగింది. గీత వెళ్ళి రిసీవరు తీసింది. ఆ కాల్ ప్రాంక్‌కి. అతనికి బాగో లేదనీ, విశ్రాంతి తీసుకుంటున్నాడనీ చెప్పినా, అర్జెంటుగా అతనితో మాట్లాడాలన్నారెవరో, పేరు చెప్పకుండా. తప్పనిసరిగా ప్రాంక్‌ని పిలుచుకొచ్చింది గీత.

"హలో..ప్రాంక్ హియర్...." అన్నాడు డిటెక్టివ్ రిసీవరందుకుని.

"హల్లో, ప్రాణ్! హౌ డూ యూ డూ?" అని వినిపించింది అవతలినుంచి.

"ఫైన్. హౌ యీజ్ ఇట్?" ప్రశ్నించాడు ప్రాణ్.

"తల పూర్తిగా చిట్లలేదుగదా?"

అవతలినుండి ఆ ప్రశ్న వినటంతో తెల్లబోయాడు ప్రాణ్. ఆగంతకులు తనను అటాక్ చేసిన సంగతి ఎవరికీ చెప్పలేదు తాను. ఆ వ్యక్తికెలా తెలిసింది?!

"ఎవరు నువ్వు?" ప్రశ్నించాడు ప్రాణ్.

"నీ శ్రేయోభిలాషిని!"

దాని కర్థమేమిటో ప్రాణ్ కి తెలుసు. కళ్ళతోనే గీతకు సైగ చేశాడు ప్రాణ్. ఏదో అర్థమయినట్టు తల పంకించి అక్కడినుండి వెళ్ళిపోయింది గీత.

"నా తలకు దెబ్బ తగిలిందని నీకెవరు చెప్పారు?" ప్రశ్నించాడు ప్రాణ్.

అటువైపునుండి సన్నగా నవ్వు వినిపించింది.

"నీ శ్రేయోభిలాషినని ముందే చెప్పాను .... నిన్ను చీమ కరిచినా నాకు తెలిసిపోతుంది" అన్నాడు అవతలి వ్యక్తి.

"ఇంతకూ ఏమంటావ్?" అన్నాడు ప్రాణ్ తన విసుగుదలను కప్పి పుచ్చుకుంటూ.

"ప్రాణ్! దయచేసి అనవసరపు విషయాలలో కలగ జేసుకోకు...."

"ఇప్పుడు ఏ విషయంలో కలగజేసుకున్నానంటావ్?" అన్నాడు ప్రాణ్ ఆశ్చర్యంగా.

"రమేష్‌చంద్ర మాయం కేసులో నిన్ను తల దూర్చ వద్దంటున్నాను" అన్నాడు ఆ వ్యక్తి.

"ఎందు చేత?"

"నీ ప్రయత్నం ఫలించదు కనుక."

"ఆ సంగతి నీకెలా తెలుసు?"

"నాకు జ్యోతిషం తెలుసు" అంటూ మళ్ళీ నవ్వాడు ఆ వ్యక్తి.

"నేను ఈ కేసు పరిశోధించటంవలన నీకొచ్చిన నష్టమేమిటి?"

"నష్టం నాకు కాదు—నీ తలకు!" అని మరోసారి పెద్దగా నవ్వాడు అతను.

"లిసన్, మిష్టర్! వూరూ పేరూ లేని వ్యక్తుల సలహాలను పాటించవలసిన అవసరం నాకు కనిపించటం లేదు" అన్నాడు ప్రాణ్ తాపీగా.

"కాని, నాకు కనిపిస్తోంది" అన్నాడు ఆ వ్యక్తి. "నీ తలకాయ చిల్లులుపడకుండా వుండాలంటే నువ్వు నా సలహా పాటించటం ముఖ్యం."

"నా తలకాయ గురించి నా కంటె నీకే ఎక్కువ బెంగగా వున్నట్లుందే!" అన్నాడు ప్రాణ్ వ్యంగ్యంగా. "ఇంతకూ నా పరిశోధనవల్ల ఎవరి తలకాయలు ఎగురుతాయో చెప్పనేలేదు నువ్వు."

"అయాం వార్నింగ్ యూ, మాన్! చెప్పినమాట వినకపోయావంటే ప్రాణాలను కూడా కోల్పోతావ్. ఈ రోజు జరిగింది శాంపుల్ మాత్రమే .... జాగ్రత్త!" అంటూ రిసీవరు పెట్టేశాడు ఆ వ్యక్తి.

సాలోచనగా రిసీవరును రెస్టుమీద పెట్టేసి బెడ్ రూంకి నడిచాడు ప్రాణ్.

గీత అతనికి ఎదురొచ్చింది.

"ఆ కాల్ ఎక్కడినుండో తెలుసుకున్నావా?" అని

ప్రశ్నించాడు.

"ఊఁ.... ఫ్లోటింగ్ క్లబ్ 'సీ బర్డ్' నుండి వచ్చింది కాల్" అంది గీత. ప్రాణ్ సైగనందుకుని బెడ్ రూంలో వున్న రెండో టెలిఫోన్ ద్వారా ఎక్స్ఛేంజ్ ని కాంటాక్ట్ చేసి ఆ కాల్ ఎక్కడినుండి వచ్చిందీ తెలుసుకున్నది ఆమె.

ఫ్లోటింగ్ క్లబ్ 'సీ బర్డ్' హార్బర్ సమీపంలో వుంది. ఆధునిక పద్ధతులలో నిర్మింపబడిన పెద్ద లక్జరీ షిప్ అది—వివిధ రకాల ఎంటర్ టెయిన్ మెంట్స్‌తో, గాంబ్లింగ్స్‌తో, బార్స్‌తో కళకళలాడే మూవింగ్ క్లబ్ అది! సముద్రంలో అయిదు కిలోమీటర్ల రేడియస్‌లో అక్కడక్కడే కదులుతూ వుంటుంది. పాప్యులర్ నైట్ క్లబ్ అది. అన్ని రకాల యాక్టివిటీస్‌కీ ఆలవాలమది. ఖర్చు ఎక్కువయినా దాదాపు అన్ని తరగతులవారూ ఏదో ఒక సందర్భంలో ఆ క్లబ్‌ని దర్శించని వారుండరంటే అతిశయోక్తి కాదు.

కోటీశ్వరుడు రమేష్‌చంద్ర అదృశ్యానికి వెనుక పెద్ద 'షార్క్'లే వున్నాయని గ్రహించాడు ప్రాణ్. ఆ పరిశోధన కొనసాగించకుండా హెచ్చరించడానికే తన మీద ఆ సడన్ అటాక్ జరిగిందని నిర్ధారణ అయిపోయింది. అతనిలో పట్టుదల పెరిగింది. ఎలాగైనా ఆ కేసు అంతుచూడాలనుకున్నాడు. ఆ కేసుకు 'క్లూ' ఫ్లోటింగ్ క్లబ్‌లో వుండచ్చునన్న అనుమానం కలిగింది- ఆలస్యంచేస్తే పరిస్థితి చేయిదాటి పోవచ్చును. ఫాస్ట్‌గా పని చేయాలనుకున్నాడు.

ఆ రాత్రికి విశ్రాంతి తీసుకోమని గీత ఎంత మొత్తుకున్నా వినిపించుకోకుండా ఓ అరగంట తరువాత

'సీ బర్డు'కి బయలుదేరాడు ప్రాణ్.

రంగు రంగు లైట్లతో హార్బర్ కి మూడు కిలోమీటర్ల దూరంలో సముద్రంపైన తేలియాడుతున్న ఫ్లోటింగ్ 'సీ బర్డు' పెళ్ళికూతురులా వుంది.

లాంచ్ లలో ఎందరో ఆ క్లబ్ కి వెళుతున్నారు. ఎంట్రన్స్ టికెట్ తీసుకొని వారితోపాటు క్లబ్ లో ప్రవేశించాడు ప్రాణ్.

రూపంలో మార్పులు చేసుకున్నాడతను. మూతికి కోరమీసాలు పెట్టుకొని, గడ్డం అంటించుకున్నాడు. ఎడమ కంటికి క్రిందుగా పులిపిరికాయ అతికించుకున్నాడు. తలపైన కుచ్చుటోపీ పెట్టుకున్నాడు. ఓ ముస్లిమ్ యువకుడిలా తయారయ్యాడు.

సరాసరి బార్ లో ప్రవేశించాడు ప్రాణ్. సందడిగా వుంది. ఒకసారి అంతటా కలయజూసి మూలగా వున్న టేబిల్ దగ్గరకెళ్ళి కూర్చున్నాడు. అక్కడికి బార్ లో వున్నవాళ్ళందరినీ పరిశీలించడానికి అనువుగా వుంటుంది.

వెయిటర్ రావటంతో బీర్ కి ఆర్డరిచ్చి సిగరెట్ వెలిగించాడు. చూసీచూడనట్లు బార్ లోని సిబ్బందినీ, కస్టమర్సునీ జాగ్రత్తగా గమనించసాగాడు.

"హలో, పాల్!" అన్న పిలుపుతో ఆశ్చర్యంగా అటువైపు చూశాడు ప్రాణ్.

ఇరవై ఏళ్ళ ఓ అందమయిన యువతి అతనివద్దకొచ్చి ఎంతో పరిచయమున్నదానిలా పలకరించింది.

"ఒంటరిగా వున్నట్లున్నావ్, జంట కావాలా?" అంది ముద్దుముద్దుగా. ఒయ్యారంతో వొళ్ళు విరుచుకుంటూ చూపుల తూపుల్ని అతని ఎదలో గ్రుచ్చిందామె.

మందహాసంతో ఆమెను చూసి కన్నుకొట్టాడతను.

"థాంక్యూ డియర్!" అంటూ అతని కెదురుగా కూర్చుందామె.

"ఆర్డరిచ్చేశావా?"

"బీర్" అన్నాడు తలూపుతూ.

"ఇంతేనా!" చప్పరించేసిందామె.

"ప్రస్తుతానికింతే" అన్నాడు నవ్వుతూ.

వెయిటర్ బీర్ తెచ్చి అతని ముందుంచాడు.

"నాకు విస్కీ చెప్పు డియర్" అందామె.

ప్రాణ్ ఆర్డర్ తీసుకుని వెయిటర్ వెళ్ళిపోయాడు.

"నీ పేరేమిటి?" ప్రశ్నించాడు ప్రాణ్.

"లవ్ బర్డ్" అని నవ్వేసిందామె.

"బ్యూటిఫుల్ నేమ్!" అన్నాడు ప్రాణ్ నవ్వుతూ "నీ తల్లిదండ్రులు జ్యోతిష్కులయి వుండాలి!"

"అదేం కాదులే. నా అసలు పేరు సుబ్బలక్ష్మి. చప్పగా వుందని పేరు మార్చేసుకుని మోడర్న్ నేమ్ పెట్టుకున్నాను" అందామె, టేబిల్ క్రిందనుండి తన కాలితో అతని కాలు త్రొక్కుతూ.

'రసికురాలే!' అని మనసులో అనుకుంటూ, "ఇటీజ్ నైస్" అన్నాడు పైకి.

"ఏమిటి? పేరా—కాలా?" అంటూ నవ్వేసిందామె.

అతనూ శ్రుతి కలిపాడు.

వెయిటర్ విస్కీ తేవటంతో, "నువ్వు కూడా విస్కీ తీసుకోకూడదూ?" అందామె ప్రాణ్‌తో.

"నో.... డయెటింగ్" నవ్వాడతను.

'చీర్స్!' అంటూ గ్లాసులు తాకించి త్రాగటం ప్రారంభించిందామె.

ఆమెతో మాట్లాడుతున్నా ప్రాణ్ చూపులు పరి

సరాలను గమనిస్తూనే వున్నాయి.

"నీకీ చోటు క్రొత్తా?" హఠాత్తుగా ప్రశ్నించింది ఆమె.

తలూపాడతను.

"అనుకున్నాను" అందామె చిరునవ్వుతో. "నీ పేరేమిటి?"

"రహీం" అన్నాడు ప్రాణ్, వ్రేళ్ళతో గడ్డం దువ్వుకుంటూ.

డ్రింక్స్ పూర్తికాగానే బిల్లు చెల్లించి లేచాడతను. అతనితోపాటే ఆమె కూడా లేచింది.

"నీకు ఈ క్లబ్బంతా చూపిస్తాను పద....ఆ తరువాత స్వర్గం చూపిస్తాను" అంటూ నవ్వి, అతని చేయి పట్టుకుని అతనివైపే వొరిగిపోతూ నడవసాగిందామె.

అదెక్కడ దొరికిందా తనకు అనిపించిందతనికి. పాలోచనగా ఆమె ననుసరించాడు.

ఇద్దరూ ఒక పెద్ద హాల్లో ప్రవేశించారు. అక్కడ ఏదో గేమ్ జరుగుతోంది. హుషారుగా అరుస్తున్నారంతా. మరో గదిలోకి వెళ్ళారు. అక్కడ మరేదో గేమ్ సాగుతోంది. అలా నాలుగైదు గదులు తిరిగారు.

"ఒక్క గేమ్ లోనూ పాల్గొనడంలేదు నువ్వు? మరెందుకొచ్చినట్టు ఇక్కడికి?" అందామె ఆశ్చర్యంగా.

ప్రాణ్ నవ్వి, "లవ్ బర్డ్స్ కోసం....ఇంకేదో త్రిల్ కోసం" అన్నాడు.

"ఓఁ!" అందామె. "నీకు డాన్సింగ్ వచ్చా?"

"లవ్ బర్డు ప్రక్కనుంటే ఏమైనా చెయ్యగలను" అన్నాడు కొంటెగా.

"రసికుడివే నే!" అంటూ అతని బుగ్గపైన ముద్దు

పెట్టుకుందామె.

ఆమె నడుం చుట్టూ చేయివేసి నడుస్తున్నాడతను.

"మొదట డాన్సింగ్ ఫ్లోర్‌కి వెడదాం. ఆ తరువాత బ్లూ ఫిల్మ్ చూద్దాం" అందామె.

కాబరే డాన్స్ జరుగుతూన్న హాల్లో ప్రవేశించారిద్దరూ. ఓ పద్దెనిమిదేళ్ళ అందాల పడుచు దాదాపు నగ్నంగా డాన్స్ చేస్తోంది. కైపెక్కించే సంగీతానికి అనుగుణంగా వొళ్ళంతా త్రిప్పుతూ డాన్స్ చేస్తూ, ఆమె వొంటిపైనున్న ఒక్కో వలువా వొలిచి క్రింద పడేస్తూంటే ఈలలతో, కేకలతో హాలంతా సందడిగా వుంది.

లోపలికి ప్రవేశిస్తూన్న ప్రాణ్‌ని ఎవరో వ్యక్తి ఢీకొనడంతో అతనివంక తేరిపార జూశాడు ప్రాణ్. అతని వదనం ఒక్కసారిగా వెలిగింది.

ఆ వ్యక్తి—రాత్రి తన చేతిలో దెబ్బలుతిన్నవారిలో ఒకడు!

"సూరో డియర్! బాత్‌రూంకెళ్ళి వస్తాను" అని 'లవ్‌బర్డ్'తో చెప్పి హడావుడిగా బయటకు వెళ్ళిపోయాడు ప్రాణ్.

# 6

ఆ వ్యక్తి డాన్స్ హాల్ ప్రక్కనున్న పాసేజ్ గుండా ముందుకు సాగాడు. ప్రాణ్ అతన్ని వెంబడించాడు.

ఆ వ్యక్తి ద్వారా ఆ అటాక్‌కి వెనుకనున్న వ్యక్తుల్ని తెలుసుకోవాలనుకున్నాడు. కాని, అతన్ని అక్కడ అటాక్ చేయటం ప్రమాదభరితమని గ్రహించటంతో, అతను ఎక్కడికి వెళతాడోనని అనుసరించాడు.

ఆ వ్యక్తి రెండు, మూడు పాసేజెస్ దాటి మూడవ అంతస్తులో ప్రవేశించాడు.

ఒక గదిముందు ఆగాడా వ్యక్తి.

పాసేజ్ చివరలో ఆగిపోయాడు ప్రాణ్.

ఆ వ్యక్తి ఆ గదిలో ప్రవేశించాడు.

ప్రాణ్ పరుగున ఆ గదివద్దకు వెళ్ళాడు.

హఠాత్తుగా గదిలోనుండి బయటకొచ్చాడు ఆ వ్యక్తి.

చటుక్కున ప్రాణ్ షర్టు కాలర్ పట్టుకుని, "ఎవరు నువ్వు? నన్నెందుకు వెంబడిస్తున్నావ్?" అంటూ కోపంగా గద్దించాడు.

ఎదురుచూడని ఆ సంఘటనకు క్షణకాలం తెల్లబోయాడు ప్రాణ్. ఆ వ్యక్తి తనను గమనించాడన్న సంగతి తానెరుగడు. అందుకే దొరికిపోయాడు.

ప్రాణ్ తేరుకొని, "నిన్ను వెంబడిస్తున్నానని ఎవరన్నారు? ఈ క్లబ్‌కి నేను రావడం ఇదే మొదటిసారి. అందుకే క్లబ్బంతా తిరిగి చూస్తున్నాను" అన్నాడు తొణక్కుండా.

అనుమానంగా చూశాడు ఆ వ్యక్తి. అతని పలుకులు నమ్మాలో లేదో తెలియనట్లుంది. సంశయిస్తూనే కాలర్ విడిచిపెట్టాడు.

"కస్టమర్స్ ఇటుప్రక్క రాకూడదు. వెళ్ళిపో" అన్నాడు.

"నేను టికెట్ కొన్నాను. క్లబ్బంతా తిరిగి చూసే స్వేచ్ఛ నాకుంది" అన్నాడు ప్రాణ్.

తీక్షణంగా చూశాడు ఆ వ్యక్తి.

"ఇక్కడ గాంబ్లింగ్ రూమ్స్ ఏవీ లేవు. ఆఫీస్ ఫ్లోర్

ఇది. ఎంట్రీ నిషిద్ధం" అన్నాడు.

"ఆ విషయం మా నేజర్నే అడుగుతాను. అతని గది యెక్కడ?" అన్నాడు ప్రాణ్ మొండిగా.

కోపంగా చూశాడు ఆ వ్యక్తి. "ఒక నిమిషంలో నువ్వీ చోటు విడిచిపెట్టకపోయావంటే, నిన్ను ఎత్తి సముద్రంలోకి విసిరేస్తాను" అన్నాడు కఠినంగా.

"కస్టమర్సుతో ఇలా మిస్‌బిహేవ్ చేయడానికి నీలాంటి వాళ్ళను నియమించినట్లు కనిపిస్తోంది మా నేజర్. ఆ విషయం అతన్నే అడుగుతాను" అన్నాడు ప్రాణ్ విసురుగా అక్కడినుండి కదులుతూ.

ప్రక్కగది గోడపైన 'మా నేజర్' అన్న బోర్డువుంది. అటువైపు అడుగులు వేస్తూన్న ప్రాణ్‌ని అటకా యించాడు ఆ వ్యక్తి.

"అరె, బద్మాష్! నీకిప్పుడే బుద్ధి చెబుతాను" అంటూ ప్రాణ్ మీదకు చేయి విసిరాడు.

చటుక్కున వొంగి ఆ దెబ్బ తప్పించుకున్న ప్రాణ్, కాలితో అతని డొక్కలో తన్నాడు. ఆ వ్యక్తి ఎగిరి గోడకు గుద్దుకొని క్రిందపడిపోయాడు. చివాలున లేచొచ్చి ప్రాణ్ మీద కలియబడ్డాడు. అతని దెబ్బను కాచుకుంటూ, అర చేతిని చాకులా చేసి అతని మెడపైన నైఫ్ షాట్ ఇచ్చాడు ప్రాణ్. నేలమీద బోర్లా పడి పోయాడు ఆ వ్యక్తి. అతని ముఖంలో ఆశ్చర్యం, అయోమయం ద్యోతకమయ్యాయి. ప్రాణ్ ముఖంలోకి పరీక్షగా చూశాడు.

అతన్ని సమీపించి మెడపైన మరో నైఫ్ షాట్ ఇచ్చాడు ప్రాణ్. మెడవిరిగిన కోడిపిల్లలా గిలగిల లాడాడు, కదలలేకపోయాడు.

'అదే పాటూ!....అదే మనిషీ....!!' అంటూ తనలో తానే గొణుక్కుంటూ, మెడవాల్చేశాడు అతను.

చకచకా అక్కడినుండి కదిలాడు ప్రాణ్.

మానేజర్ అని రాసున్న గదిలో ప్రవేశించాడు.

ముందు ఓ చిన్న విజిటర్స్ రూం వుంది. చిన్న దయినా అందంగా అలంకరించబడివుంది.

కేవలం టెలిఫోన్ కాల్ని ఆధారంచేసుకుని బయలు దేరివచ్చాడు తాను. ఆ కాల్తో మానేజర్కి సంబంధం వుండాలన్న గ్యారంటీ లేదు. ఆ క్లబ్నుండి యెవరైనా ఫోన్ చేసి వుండొచ్చును. తనది కేవలం చీకట్లో తడుము లాటలాంటిది. మానేజర్తో యెలా మాట్లాడాలో ఆలోచించుకుంటూ, మెల్లగా తలుపు తెరుచుకొని లోపల అడుగుపెట్టాడు ప్రాణ్.

గదిలో ఎవరూ లేరు!

మానేజర్ కుర్చీ ఖాళీగా వుంది.

ఒక క్షణం గుమ్మంలోనే నిలుచుని గదంతా పరి శీలనగా చూశాడు ప్రాణ్.

మెర్క్యురీ లాంప్స్ తెల్లటి, చల్లటి కాంతులను వెద జల్లుతున్నాయి గదిలో. అత్యంత అధునాతనంగా అలంక రింపబడి వుంది గదంతా. మానేజర్ టేస్టుకి మెచ్చు కున్నాడు.

మానేజర్ టేబిల్ వద్దకు వెళ్లాడు ప్రాణ్. గబగబా టేబిల్ మీదున్న కాగితాలను చూశాడు. తరువాత టేబుల్ సొరుగులు లాగాడు.

అంతలో యెక్కడినుండో అడుగుల చప్పుడు వినిపిం చింది. చటుక్కున టేబిల్ మూసేసి గదిలో మూలగా వున్న మిర్రర్ స్టాండ్ వైపు గెంతి, వెనుక దాక్కున్నాడు.

ఓ వ్యక్తి గదిలో ప్రవేశించాడు. అతను గోడలో ఒకచోట వ్రేలితో రాశాడు. గదిలో ఒకమూల సర్రు మంటూ నేలచెక్క తప్పుకుంది. ప్రాణ్ చూస్తూండగానే అచ్చట అదృశ్యమయ్యాడతను! తా సేప టికి మళ్ళీ సర్రుమన్న శబ్దంతో నేల కప్పబడిపోయింది.

రెండు నిమిషాల తరువాత ప్రాణ్ అక్కడికి పరుగెత్తాడు. గోడలో చేతిలో తడిమి మీట నొక్కాడు. రహస్య మార్గం ఏర్పడింది.

ఆ స్థానంలో నేల మాళిగకు మెట్లు కనిపించాయి. లోపలినుండి సన్నని వెలుతురు వస్తోంది.

చప్పుడు చేయకుండా ఆ మెట్లుగుండా లోపలికు దిగాడు. రెండు, మూడు మెట్లు దిగేసరికి పైద్వారం మూసుకుపోయింది.

మెట్లు దిగుతూంటే యెక్కడినుండో మాటలు వినిపించసాగాయి.

ఓ పది, పదిహేను మెట్లు దిగాక ఓ చిన్న వరండా యెదురయింది. దాని వెనుక విశాలమైన గది వుంది.

వరండాలోనుండే గదిలోకి రహస్యంగా తొంగి చూశాడు ప్రాణ్.

లోపల ముగ్గురు వ్యక్తులు కూర్చున్నారు. ఒకతని వీపు మాత్రం కనిపిస్తోంది. మిగతా ఇద్దరిలో ఒకరు మేనక! వారికెదురుగా, అంతకుముందు ప్రవేశించిన వ్యక్తి నిలుచున్నాడు.

ఆశ్చర్యంతో జాగ్రత్తగా వారి మాటలు ఆలకించసాగాడు ప్రాణ్.

"నాన్సెన్స్! ఇంతవరకు వజ్రాలు ఎక్కడ వున్నాయో కనిపెట్టలేకపోవడం మీ చేతకానితనాన్ని చాటుతోంది"

అంటున్నాడొకతను.

ఆ గొంతు యెక్కడో ఆలకించినట్లనిపించింది ప్రాణ్ కి.

"అవి బ్రీఫ్ కేసులోనే వున్నాయంటున్నాడు రమేష్ చంద్ర. ఎంత హింసించినా అదే మాట చెబుతున్నాడు" అంది మేనక స్వరం.

"బ్రీఫ్ కేస్ లో వుంటే పెట్టె మింగేసిందా?" అంది మరో స్వరం. "వాటిని అతనెక్కడో దాచివుండాలి."

"యెక్కడ దాచాడంటావ్?" మొదటి గొంతు ప్రశ్న.

"ఇల్లంతా ఝల్లెడ పట్టేను. ఇప్పుడతను నాతో హోటల్ నుండి బయలుదేరకముందే యెక్కడో దాచయినా వుండాలి, లేదా, దాచమని యెవరికైనా ఇచ్చయినా వుండాలి" అంది మేనక.

"ఏదీ చెప్పడం కష్టంగా వుంది" అన్నదొక స్వరం.

"మేనకా! నువ్వు మమ్మల్ని డబుల్ క్రాస్ చేయడం లేదని ఖచ్చితంగా చెప్పగలవా?"

కరుకుగా వున్న ఆ గొంతు మేనకను చలింపజేసి వుండాలి.

"నిన్ను డబుల్ క్రాస్ చేసి బ్రతికినవాళ్ళు లేరని నేను ఎరగనా బాస్? నీకు అనుమానంగా వుంటే నన్నిప్పుడే చంపెయ్!" అందామె ఏడుపు స్వరంతో.

"ఆల్ రైట్, ఆల్ రైట్....ఊరికే అడిగానంతే..." అందా గొంతు అసహనంగా. "ఇరవై నాలుగ్గంటల లోపల ఎలాగైనా రమేష్ చంద్రచేత ఆ రహస్యం కక్కించాలి! ఇందులో ఏమాత్రం జాప్యం జరిగినా సహించేది లేదు."

కాసేపటికి వాళ్ళు లేస్తున్నట్లు గ్రహించిన ప్రాణ్, త్వరత్వరగా మెట్లవైపు నడిచాడు. పైమెట్టు దగ్గరకొచ్చే సరికి కాళ్ళతో, చేతులతో అంతా తడిమాడు. కొన్ని సెకనుల తరువాత కావలసిన మీట చేతికి తగలటంతో పై ద్వారం తెరుచుకుంది.

పైకి వెళ్ళబోతూన్న ప్రాణ్‌ని వెనుక వస్తూన్న వ్యక్తులు చూశారు హఠాత్తుగా.

"ఆగు!" అంటూ అరిచారు.

ప్రాణ్ ఆగలేదు. ఒక్క గెంతులో పైగదికి చేరుకుని ద్వారం మూసేశాడు. కంగారుగా మానేజర్ గదిలో నుండి బయటకు పరుగెత్తాడు.

ప్రాణ్ విజిటర్స్ రూంలో అడుగుపెట్టేసరికి, బయట నుండి ఎదురొచ్చాడు, అంతకుముందు ప్రాణ్ చేతిలో నైఫ్‌షాట్ తిని పడిపోయిన వ్యక్తి. మెడ, నరాలు స్వాధీనంలోకి వచ్చేసరికి ఆ సమయం పట్టింది.

ప్రాణ్‌ని చూడగానే పెద్దగా అరిచి మీద పడ్డాడతను.

అదే సమయంలో గదిలోపలినుండి పరుగెత్తుకొచ్చాడు ఒక వ్యక్తి.

ఇరరడు ప్రక్కలనుండీ ఇద్దరూ వచ్చి మీదపడటంతో తప్పుకోవడానికి వ్యవధిలేకపోయింది ప్రాణ్‌కి. రెండవ వ్యక్తి కొట్టిన దెబ్బకు ఎగిరి సోఫాలో పడిపోయాడు.

మళ్ళీ మీదకు వురుకుతూన్న ఆ వ్యక్తిని కాలితో ఓ పాటిచ్చాడు ప్రాణ్. అది ముఖంపైన కళ్ళ మధ్యగా తగలడంతో నక్షత్రాలు కనిపించాయతనికి. వెనక్కు పడిపోయాడు.

స్ప్రింగ్‌లా లేచి నిలుచున్నాడు ప్రాణ్. మీదకు

దూసుకొస్తూన్న మొదటి వ్యక్తిని అమాంతంగా చేతుల్లోకి దొరకబుచ్చుకొని పైకెత్తాడు. లేచి నిలుచూంటున్న రెండవ వ్యక్తి పైకి అతన్ని విసిరేశాడు. ఆ సమయంలో ఆధారంకోసం ప్రాణ్ గడ్డాన్ని పట్టుకున్న మొదటి వ్యక్తి చేతిలోకి వూడొచ్చిందది. ఆ వ్యక్తి వెళ్ళి రెండవ వ్యక్తిమీద పడటంతో ఇద్దరూ కలిసి చుట్టచుట్టుకొని పడిపోయారు.

మూతికున్న మీసం కూడా పీకేసి, టోపీతోసహా వారిపైకి విసిరేశాడు ప్రాణ్.

"డిటెక్టివ్ ప్రాణ్!" అంటూ కీచుగా అరిచాడు మొదటి వ్యక్తి. "ఆ నైఫ్‌షాట్ తిన్నప్పుడే అనుకున్నాను నువ్వే అయివుంటావని!"

వారితో కాసేపు బంతాట ఆడుకోవాలని వున్నా, అందుకు వ్యవధి లేదనిపించింది ప్రాణ్‌కి. ఒకప్రక్క తాను తెలుసుకున్న సమాచారాన్నిబట్టి మేనకను కలుసుకోవాలని ఆత్రుతగా వుంది. రెండవ ప్రక్క నేల మాళిగలోని వ్యక్తులు వచ్చి వారికి తోడవుతారన్న భయమూ వుంది.

ప్రాణ్ గుమ్మంవైపు వురకబోయేంతలోనే ఎక్కడినుండో యిద్దరు వ్యక్తులు పరుగెత్తుకొచ్చారక్కడికి.

"డిటెక్టివ్ ప్రాణ్ .... పారిపోతున్నాడు....పట్టుకోండి" అంటూ అరిచాడు పడిన వాళ్ళలో ఒకడు.

హఠాత్తుగా డిటెక్టివ్ పేరు ఆలకించటంతో కట్టెదుట బెబ్బులిని చూసినట్టు అదిరిపడ్డారంతా. అప్రయత్నంగా వారిచేతులు జేబుల్లోకి వెళ్ళాయి.

ప్రమాదాన్ని పసిగట్టిన ప్రాణ్, పిస్టల్స్ తీసే అవకాశం వారికివ్వకుండా మెరుపులా వారివైపు గెంతాడు.

ఒక కాలితో ఒకణ్నీ, మరో కాలితో ఇంకొకణ్నీ గడ్డాల క్రింద తన్నాడు. వెనక్కు పడిపోయారిద్దరూ.

చటుక్కున జేబులోనుండి రివాల్వర్ తీశాడు ప్రాణ్.

"ఎవరూ కదలొద్దు!" అంటూ హెచ్చరించి వెనక్కి అడుగులు వేసుకుంటూ గది బయటకు నడిచాడు. తలుపులు మూసేసి బయట గెడ పెట్టేసాడు.

ఒక క్షణం అనిశ్చయంగా వుండిపోయాడతను. మానేజర్ ఈపాటికి తక్కిన సిబ్బందిని హెచ్చరించి వుండొచ్చును. మామూలు మార్గాన ఆ క్లబ్ నుండి బయటపడటం ప్రమాదం.

ఎక్కడో, యెవరో పరుగెడుతున్నట్లు అడుగుల చప్పుళ్ళు వినిపించాయి.

గబగబా డెక్ పైకి పరుగెత్తాడు ప్రాణ్.

పాదాల చప్పుళ్ళు వెన్నంటాయి. తనను తరుముకొస్తున్నట్లు తెలిసిపోయింది.

రివాల్వర్ జేబులో పెట్టుకున్నాడు ఒకసారి వెనక్కు తిరిగిచూసి, అక్కడనుండి సముద్రంలోకి వురికేశాడు.

అప్పుడే అక్కడికి చేరుకున్న మానేజర్ అనుచరులు ప్రాణ్ నీటిలోకి దుమకడం చూశారు. డెక్ చివరకు పరుగెత్తారు. నీటిబుడగలుతప్ప మనిషి కనిపించలేదు. అయినా, అటువైపుకు పిస్టల్స్ ప్రేల్చారు.

## 7

ఆ రాత్రివేళ బంగాళాఖాతంలో అతి ప్రయాసతో ఈదుతూ ఫ్లోటింగ్ క్లబ్ కి దూరంగా రోడ్డువైపుకు పోగాడు ప్రాణ్.

వెనుకనుండి శత్రువులు పిస్టల్స్ గర్జిస్తూంటే, బులెట్స్ వెంట్రుకవాసిలో తప్పిపోతూంటే, ఘాస్తో

ఇబ్బందిగా వున్నా, అతికష్టంమీద ఈదుతున్నాడతను. సర్కిల్ చేస్తూన్న 'సీబర్డు' బారినుండి తప్పించుకునేందుకు డాడ్జి చేస్తూ ఈదసాగాడు.

కొంతదూరం వెళ్ళేసరికి ఫిషింగ్ బోట్ ఒకటి యెదురుపడింది. జాలరివాడు ప్రాణ్‌ని తన బోట్‌లోకి ఎక్కించుకున్నాడు.

బాగా అలసిపోయివున్న ప్రాణ్ ఏ క్షణంలోనో సొమ్మసిలబోతున్నట్లు కనిపించటంతో బోట్‌ను వొడ్డుకు మళ్ళించాడు జాలరిమనిషి. సమీపంలోవున్న తన గుడిసెకు తీసుకువెళ్ళి ప్రాణ్‌ని పడుకోబెట్టి వుపచారాలు చేశాడు.

'పొరబాటున షిప్ మీదనుండి నీళ్ళలో పడిపోయినట్టు' అతనితో చెప్పాడు ప్రాణ్ 'ఎక్జర్షన్ తప్ప మరేం కాదనీ కాసేపు విశ్రాంతి తీసుకుంటే సరిపోతుందనీ' అన్నాడు.

తడిసి ముద్దయిన ప్రాణ్ దుస్తులను మార్పించి తన పంచె, చొక్కా ఇచ్చాడు జాలరి. ప్రాణ్ దుస్తులు మార్చుకొని తల తుడుచుకునే లోపున, జాలరి పెళ్ళాం వేడివేడి టీ కాచి తెచ్చింది. దాన్ని త్రాగటంతో హుషారు కలిగింది అతనికి. పక్క శుభ్రంగా వేసి పడుకోమంది ఆమె.

ఎవరో శ్రీమంతుడు, చదువుకున్నవాడు ప్రమాదవశాత్తు నీళ్ళలో పడ్డాడనీ పెద్ద గండం గడిచి బయటపడ్డాడనీ భావించిన ఆ దంపతులు ఎంతో అణకువతో అతనికి అన్నీ అమర్చడంతో, వారి ఆప్యాయతకు కరిగిపోయాడు ప్రాణ్. టైమ్ చూసుకున్నాడు. అర్థ రాత్రి దాటింది. ఓ గంటసేపు విశ్రాంతి తీసుకోవచ్చునని పడు

కుంటే, అలసిపోయి వున్నాడేమో, తెలియకుండా నిద్ర పట్టేసింది.

మెలకువ వచ్చేసరికి నాలుగుగంటలయింది.

ఉలికిపడి లేచి కూర్చున్నాడు. నాలుగ్గంటలసేపు అక్కడ నిద్రపోయి సమయం వృథా చేసేసానుకుని విచారించాడు.

జాలరిని లేపి, తాను అర్జెంటుగా వెళ్ళాలనీ, తెల్లవారేక వచ్చి తన బట్టలు తీసుకుని అతని దుస్తులు వాపసు చేస్తానని చెప్పాడు. పర్సులోనుండి సగం తడిసిన నూర్రూపాయల నోటొకటి తీసి, వద్దంటున్నా సరే ఆ దంపతుల చేతుల్లో పెట్టాడు.

రోడ్డుమీదకొచ్చేసరికి ఖాళీగా వెళుతూన్న టాక్సీ ఒకటి కనిపించింది. దాని నాపి అందులో కూర్చున్నాడు ప్రాణ్. అడయారు పోనివ్వమని చెప్పాడు.

అతని వేషంవంక వింతగా చూశాడు టాక్సీ డ్రైవర్. అది గమనించి చిన్నగా నవ్వుతూ "ఫ్యాన్సీ డ్రెస్ కాంపిటీషన్లో పాల్గొని వస్తున్నానులే" అన్నాడు. టాక్సీ డ్రయివరు నవ్వి "మీరు డిటెక్టివ్ ప్రాణ్ అని నాకు తెలుసు" అన్నాడు.

మేనక ఇంటికి కొద్ది దూరంలో టాక్సీ దిగాడు ప్రాణ్. మేనక బంగళావద్ద వీధి ద్వారం వద్ద నిలుచుని డోర్ బెల్ మ్రోగించాడు. అలా రెండు నిమిషాలపాటు బెల్ కొట్టినా లోపలినుండి యెవరూ రాలేదు. మేనక గాఢ నిద్రలో వుంటుందనుకున్నాడు.

బంగళా ఒకసారి చుట్టివచ్చాడు. ఒక ప్రక్కవోరగా తెరచివున్న ఫ్రెంచ్ విండో ఒకటి కొంచెం ఎత్తులో కనిపించింది.

పంచె పైకి ఎగకట్టి, ప్రక్కనే వున్న డ్రయినేజ్ పైప్ గుండా పైకెగబ్రాకాడు. కిటికీ ఎత్తుకు వెళ్లాక జాగ్రత్తగా బ్యాలన్స్ కాచుకుంటూ కిటికీమీదకు చేరుకున్నాడు. చప్పుడు కాకుండా గ్లాస్ డోర్‌ను పూర్తిగా తెరిచి మెల్లగా లోపలికి వురికాడు—

మొదటి అంతస్తులో వున్న ఆ గదిలో చీకటిగా వుంది. కళ్ళు చీకటికి అలవాటు పడగానే గదిలోని వస్తువులు లీలగా కనిపించాయి. బెడ్‌రూం వున్న గది. గది తలుపు వోరగా తెరిచి వుండటంతో, మెల్లగా గది బయటకు నడిచి వరండాలో ప్రవేశించాడు.

ఎక్కడినుండో డిమ్‌లైట్ పడుతోంది అక్కడకు. అటువైపు నడిచాడు.

కాంతి వస్తూన్న గది తలుపు వోరగా తెరిచివుంది. లోపలినుండి అలికిడి వినవస్తుందేమోనని చెవులు రిక్కించాడు. నిశ్శబ్దంగా వుంది.

లోపలికి తొంగిచూశాడు. గదిలో ఫోమ్‌బెడ్.... దానిపైన పడుకుని మేనక....

లైటు వేసుకొని నిద్రపోతోందేమిటా అని ఆశ్చర్యపోతూ లోపల ప్రవేశించాడు.

బెడ్‌ని సమీపించిన ప్రాణ్ అదిరిపడ్డాడు.

బెడ్ మీద వెల్లకిలా పడివుంది మేనక శవం!

ఆమె వక్షంపైన కత్తిపోటు .... ముఖమంతా గుర్తు పట్టలేనంతగా చెక్కివేయబడింది!

ఎవరో మేనకను చంపేశారు.

అందమైన ఆమె వదనం వికృత భయంకరంగా వుంది.

మేనక గుప్పిట్లోంచి తొంగిచూస్తోన్న కాగితం తీసి ఆత్రుతగా చదివాడు ప్రాణ్.

అందులో ఒకే ఒక వాక్యం వుంది—'ఈ హత్య నీ కోసం!'

ఆశ్చర్యపోయాడు ప్రాణ్. ఆ వాక్యం ఎవరి నుద్దేశించబడింది? ఆ హత్య ఎవరికోసం?!

మేనకను అంత క్రూరంగా చంపిందెవరు? ఆమె డబుల్ క్రాస్ చేసిందన్న అనుమానంతో, రమేష్ చంద్రను బంధించిన వ్యక్తే ఆమెను చంపాడా?

రమేష్‌చంద్ర అదృశ్యంలో మేనక పాత్ర పెద్దదేనన్న విషయం గ్రహించడంతో వెంటనే ఆమెను కలుసుకోవాలనుకున్నాడు ప్రాణ్. కాని, సాగరం ఈదడంతో ఆలస్యం జ రి గి పో యి ం ది. తాను వెంటనే రాగలిగితే ఆమె చేయిదాటి పోయేదికాదేమోననిపించింది.

'ఈ హత్య నీ కోసం!'

ఎవరి కోసం? తన కోసమా?....ఆ చీటీరాసి ఆమె చేతిలో పెట్టిందెవరు?....

సాలోచనగా చీటీని యథాస్థానంలో వుంచి, హత్యాయుధంకాని, ఏమైనా క్లూస్ గాని కనిపిస్తాయేమోనని గదంతా కలయజూశాడు ప్రాణ్. ఏమీ కనిపించలేదు. అంతకుముందే ఎవరో గదంతా వెదికినట్లుంది.

ఉన్నట్లుండి గదిలో లైటారిపోవటంతో ఉలిక్కిపడ్డాడు ప్రాణ్.

గుమ్మం దగ్గర అలికిడి వినిపించింది. అటువైపు పరుగెత్తాడు.

ఆ చీకట్లో యెవరో హఠాత్తుగా మీదపడి కొట్టడంతో దూరంగా పడిపోయాడు ప్రాణ్. పైకి లేచేసరికి బయట వరండాలో యెవరో పరుగెడుతున్నట్లు అడుగుల

చప్పుడు వినిపించింది.

అటువైపు పరుగెత్తాడు. లాభంలేకపోయింది.

వీధి గుమ్మానికి బయట గెడపెట్టి అదృశ్యమయ్యాడు ఆగంతకుడు.

నిట్టూర్చి మేనక బెడ్ రూంకి తిరిగొచ్చాడు ప్రాణ్. దేనికోసం వెతుకుతున్నాడో తెలియకుండానే, మరోసారి ఆ గదంతా గాలించాడు. ఎక్కువసేపు అక్కడ ఉండటం మంచిదికాదని, వచ్చిన త్రోవనే బంగళా నుండి బయటపడ్డాడు.

# 8

అయిదుగంటల ప్రాంతంలో ఇంటికి చేరుకుని నిద్ర కుపక్రమించాడు ప్రాణ్. తెల్లవారుతూనే అరెస్టు వారెంట్ తో ప్రత్యక్షమైన ఇన్స్పెక్టర్ మాధవ్ ని చూసి విస్తుపోయాడు.

"నాన్సెన్స్ .... మాధవ్! మేనకను నేను హత్య చేయడమేమిటి?!" అన్నాడు ప్రాణ్ కోపంగా.

"రాత్రి నువ్వు మేనక ఇంట్లో ప్రవేశించి ఆమెను దారుణంగా హత్య చేసినట్లు మాకు ఫోన్ కాల్ వచ్చింది. మేనక ఇంటికి వెళితే ఆమె శవం కనిపించింది" అన్నాడు మాధవ్. "అంతేకాదు — బహుశా నన్ను ఏడిపించడానికి కావచ్చు—నువ్వు రాసిపెట్టిన చీటీ కూడా కనిపించింది."

"ఏమిటా చీటీ?" ఆశ్చర్యంతో ప్రశ్నించాడు ప్రాణ్.

"ఈ హత్య నీ కోసం! .... అది నువ్వు రాసింది కాదా?" సూటిగా ప్రశ్నించాడు మాధవ్.

"నేను రాశానని ఎందుకనుకుంటున్నావ్?"

"నీ దస్తూరీలాగే వుంది కనుక!" అన్నాడు మాధవ్.

"నా, లెటజ్ మూవ్."

"రాత్రంతా నాకు ఎలిబీ వుంది...."

"అదంతా తరువాత."

"నిజంగానే నా చేతులకు సంకెళ్ళు వేసి తీసుకు వెళ్ళాలనుకుంటున్నావా?"

"అది నా డ్యూటీ."

"ఆల్ రైట్" అన్నాడు ప్రాణ్. తెల్లబోయి చూస్తూన్న గీత నుద్దేశించి, "గీతా! ఐ.జి.కి ఫోన్ చెయ్" అన్నాడు.

కాస్సేపట్లో ఐ.జి. ఫోన్లో పలికారు. ప్రాణ్ ఆయనతో మాట్లాడాడు. తరువాత రిసీవరు ఇన్స్పెక్టర్ చేతిలోకి వచ్చింది.

ఐ.జి. పలుకులు వింటూన్న ఇన్స్పెక్టర్ వదనం పాలిపోయింది.

రిసీవరు పెట్టేసి, ప్రాణ్ వంక కొరకొరా చూశాడు. "ప్రాణ్! ఇంకొకటితో తప్పించుకున్నాననుకోకు. ఇప్పుడు కాకున్నా పూర్తి ఆధారాలు సేకరించిన తరువాతయినా నిన్ను అరెస్టు చేయక మానను" అంటూ బయటకు నడిచాడు మాధవ్.

## 9

మేనక బంగళాకు పోలీసులు తాళం పెట్టి సీలు వేశారు. అయినా, రాత్రి పదిగంటలకు ఫ్రెంచ్ విండోస్ గుండా ఆ బంగళాలో ప్రవేశించాడు ప్రాణ్ రహస్యంగా.

బంగళా అంతా నిశ్శబ్దంగా వుంది. జేబులోనుండి పెన్ టార్చి తీసి వెలిగించాడు ప్రాణ్. ఆ సన్నటి

కాంతిలో ఒక్కో కదిలో నే చకచకా కదులుతున్నా డతను .... వజ్రాలు రమేష్‌చంద్ర దాచినా, మేనక దాచినా అది అక్కడే వుండాలనిపించిందతనికి.

అంతకుముందే ఎవరో గాలించినట్లు కదులన్నీ చిందర వందరగా వున్నాయి....ఓ గంటసేపు బెడ్‌రూం మూల మూలలా వెదికాడు ప్రాణ్. ఫలితం కనిపించలేదు. కుర్చీలో కూలబడి సిగరెట్ కాలుస్తూ సాలోచనగా గదంతా చూపులతోనే సర్వే చేయసాగాడు.

అప్రయత్నంగా చూపులు స్విచ్‌బోర్డు మీద పడ టంతో సంశయిస్తూనే లేచి నిలుచున్నాడు. చిన్న స్క్రూడ్రయివర్‌తో ఎలక్ట్రిక్ స్విచ్‌బోర్డు నాలుగు ప్రక్కల నున్న స్క్రూలను విప్పి, కవర్‌ని జాగ్రత్తగా వూడదీసాడు.

ప్రాణ్ కళ్ళు మెరిశాయి.

లోపల ఓ చిన్న కలర్ ప్యాకెట్ వుంది!

ఆతృతగా దాన్ని తీసి చూశాడు. ఆ పొట్లంలో ధగధగాయమానంగా మెరిసిపోతూన్న వజ్రాలు!....కోటి రూపాయలు విలువచేసే మేలి వజ్రాలు!!

# 10

అర్థ రాత్రి—

కీల్పాక్‌లో వున్న ఓ పదంస్తుల భవనానికి చేరు కున్నాడు ప్రాణ్.

ఆ భవనంలోని ఏడవ అంతస్తులో 'సీబర్డు' మేనేజర్ విన్సెంట్ కాపురముంటున్నాడు. అతని నివాసాన్ని వెదికినట్లయితే ఆ కేసులో ఏదైనా ఆచూకీ దొరకవచ్చు నన్న ఆశతో అందుకు పూనుకున్నాడు ప్రాణ్. ఆ సమ యంలో విన్సెంట్ నైట్ క్లబ్‌లో వుంటాడు. పైగా

అతను ఒంటరిగాడు కావడంతో ఇంట్లో ఎవరూ వుండరు.

నిశ్శబ్దంగా వున్న పరిసరాలను మారంనుండే పరిశీలించాడు ప్రాణ్. కాపలా తిరుగుతూన్న ఘూర్కా బూట్ల చప్పుడు తప్ప మరే శబ్దమూ లేదు.

దూరంగా కారాపి క్రీనీడలో నడుస్తూ ఆ బిల్డింగ్‌ని చేరుకున్నాడు ప్రాణ్. సెల్ఫ్ ఆపరేటెడ్ లిఫ్ట్‌లో ఏడవ అంతస్తు చేరుకున్నాడు.

విన్సెంట్ అపార్టుమెంట్ ముందు నిలుచున్నాడు ప్రాణ్. జేబులోనుండి మాస్టర్ కీ తీసి తలుపు రంధ్రంలో మార్చాడు. పదినిమిషాలపాటు ప్రయత్నించినా తాళం తెరుచుకోలేదు. అది మామూలు తాళమయి వుండదని గ్రహించాడు.

ఎంత నిశ్శబ్దంగా వచ్చాడో, అంత నిశ్శబ్దంగానూ ఆ బిల్డింగ్ నుండి బయటపడ్డాడతను. బిల్డింగ్ వెనుకకు వెళ్ళి సాలోచనగా దానిని స్టడీ చేశాడు.

ఏడవ అంతస్తులో వెనుక ప్రక్కనున్న పెద్ద కిటికీ గాజు తలుపులు సగం తెరుచుకుని వున్నాయి.

కారు దగ్గరకు వెళ్ళి డిక్కీలోంచి ఓ తాటి చుట్టను బయటకు తీశాడు.

మళ్ళీ బిల్డింగ్‌లో ప్రవేశించి లిఫ్టులో ఈసారి పై అంతస్తుకు చేరుకుని అక్కడినుండి మెట్లద్వారా టెర్రస్ పైకి వెళ్ళాడు.

టెర్రేస్ పైన వాటర్‌టాంక్స్‌ని కలుపుతూ పైప్స్ వున్నాయి. వాటిలో ఒకదానికి త్రాటిని బలంగా ముడివేశాడు. రెండవ కొనను బిల్డింగ్ వెనుక భాగానికి నెమ్మదిగా క్రిందికి జారవిడిచాడు. దాని కొన సరిగా అరవ అంతస్తువరకు వెళ్ళింది.

ఆ త్రాటిమీదుగా క్రిందకు దిగి ఏడవ అంతస్తుకు చేరుకోవాలని ఫ్రాంక్ ఆలోచన. అది ఎంతటి ప్రమాద కరమైన పనో అతను ఎరుగకపోలేదు. కాని ఆ సాహసం చేయక తప్పలేదు.

షూస్, సాక్సు తీసి ఒక ప్రక్కకు పడేశాడు ఫ్రాంక్. సైడ్ పాకెట్‌లోనుండి రివాల్వర్ తీసి హిప్ పాకెట్‌లో దోపుకున్నాడు వీలుకోసం. ఆ తరువాత త్రాటిని పట్టుకుని నెమ్మదిగా క్రిందికి దిగనారంభించాడు.

అటుప్రక్క చీకటిగా వున్నా, మధ్యలో ఏ అంతస్థు లోనివారైనా మేలుకువవచ్చి లేచే ప్రమాదముంది. ఘూర్ఖా కూడా అటువైపు రావచ్చును. సాధ్యమయినంత త్వరగా తన పని ముగించుకోవాలనుకున్నాడు.

అప్రయత్నంగా క్రిందికి చూశాడు. కళ్ళు గిర్రున తిరిగాయి. చటుక్కున కళ్ళు మూసేసుకుని త్రాటిని గట్టిగా పట్టుకుని వుండిపోయాడు ఒక క్షణం. తరువాత నెమ్మదిగా దిగనారంభించాడు.

తొమ్మిదవ అంతస్థుదాటి ఎనిమిదవ అంతస్థుకు దిగే సరికి అరచేతులనుండి రక్తం రాసాగింది. వోర్చుకుంటూ, దృఢ నిశ్చయంతో తన పని కొనసాగించసాగాడు.

ఏడవ అంతస్థుకు చేరుకోగానే సగం తెరిచివున్న కిటికీ తలుపులు కాలితో పూర్తిగా తెరిచాడు ఫ్రాంక్. తరువాత వుయ్యాలలా గాలిలో ఊగుతూ కిటికీలోకి జంప్ చేశాడు. అదెంతటి భయంకరమైన ఫీటో ఎరిగి వుండే ఆ సాహసం చేశాడతను. అలా రెండు, మూడు సార్లు చేసేసరికి చివరకు కిటికీలోకి చేరుకోగలిగాడు. జాగ్రత్తగా కిటికీ మధ్య ఫ్రేమ్‌ని ఒక చేత్తో, త్రాటిని రెండవ చేత్తోనూ పట్టుకొని కిటికీపైన రెండు కాళ్ళూ

వేసి నిలుచున్నాను.

గదిలోపల చీకటిగా వుంది. కిటికీనుండి నేల ఎంత దూరం వున్నదీ సరిగా కనిపించలేదు. అయినా తెగించి గదిలోకి దుమికాడు.

నేలపైన దబ్బున పడ్డాడు ప్రాణ్. నేలమీద తివాసీ వున్నందున పెద్దగా దెబ్బ తగలలేదు.

ఎలాగో లోపల ప్రవేశించగలిగాడు తాను. బయట వ్రేలాడుతూన్న త్రాడు ఘూర్కా కంటిలో పడితే ప్రమాదం. త్వరత్వరగా పని పూర్తిచేసుకోవాలను కున్నాడు.

చీకట్లో తడుముకుంటూ స్విచ్ నొక్కి లైట్ వెలిగించాడు. బెడ్ రూం అది. కాని దానిసెవరూ ఉపయోగిస్తున్నట్లనిపించలేదు. గది తలుపు తెరిచివుంది. బయటకు నడిచాడు.

ఆ అపార్టుమెంటులో అయిదు గదులు, ఒక హాలు, బాత్ రూం, లావేటరీ వున్నాయి. ఇల్లంతా ఖరీదైన మాడర్న్ ఫర్నిచర్ తో చక్కగా అలంకరించబడివుంది.

చకచకా తిరుగుతూ ఒక్కొక్క గదే పరిశీలించసాగాడు ప్రాణ్....ఒక గదిలోనుండి సన్నటి మూలుగేదో వినిపించడంతో అటువైపు వెళ్లాడు.

హాల్లోని వెలుతురు ఆ గదిలో పడుతోంది. ఆ కాంతిలో లోపలి దృశ్యాన్ని తిలకించిన ప్రాణ్ నిటారుగా అయిపోయాడు.

లోపల ఒక వ్యక్తి నైలాన్ త్రాటితో కుర్చీకి బంధింపబడి వున్నాడు!

గదిలో ప్రవేశించి లైట్ వేశాడు ప్రాణ్.

హఠాత్తుగా లైట్ వెలగడంతో కళ్లు తెరిచిన

బంధితుడు ప్రాణ్ వంక ఆశ్చర్యంగా చూశాడు.

ఒక క్షణం ఒకరి వంక ఒకరు చూసుకుంటూ వుండి పోయారిద్దరూ.

అతని నోట్లో గుడ్డలు వూడదీశాడు ప్రాణ్. "ఎవరు నువ్వు?" అని ప్రశ్నించాడు.

జవాబివ్వకుండా, శూన్యంగా ప్రాణ్ వంక చూశాడతను. అతన్ని ఎక్కడో చూసినట్లనిపించింది ప్రాణ్ కి. అతని మెదడులో మెరుపు మెరిసింది. ఆ వ్యక్తి ఫోటోను చూశాడు తాను!

"నువ్వు రమేష్ చంద్రవి కదూ?" అని ప్రశ్నించాడు.

ఔనన్నట్లు తలూపాడతను.

హుషారుగా ఈల వేయబోయి మానుకున్నాడు ప్రాణ్. వెదకబోయిన తీగె కాలికి తగులుకున్నట్లయింది.

"నా పేరు ప్రాణ్. ప్రయివేట్ డిటెక్టివ్ ని" పరిచయం చేసుకున్నాడు. "కట్లు విప్పితే లేచి నడవగలవా?"

అతను జవాబిచ్చేంతలోనే, హాల్లో ఏదో అలికిడి వినిపించింది ప్రాణ్ కి.

రమేష్ చంద్రను చూసిన ఎక్సయిట్ మెంట్ లో ఇంటి తలుపు తెరుచుకోవడంగాని, ఇద్దరు వ్యక్తులు లోపల ప్రవేశించడంగాని గ్రహించలేకపోయాడతను. గ్రహించేసరికే ఆలస్యమయిపోయింది.

రమేష్ చంద్ర జవాబివ్వబోయి చటుక్కున ఆగిపోయాడు. అతని కళ్ళలో ప్రతిఫలించిన భయాందోళనలను చూసి ఆశ్చర్యంతో గిర్రున వెనక్కి తిరిగాడు ప్రాణ్.

# 11

ఉలిక్కిపడి రివాల్వర్ తీయబోయాడు ప్రాణ్.
కాని, హిప్ పాకెట్ ఖాళీగా వుంది!

ట్రాటిమీద ఫీట్స్ చేస్తున్నప్పుడెప్పుడో అది క్రిందికి జారిపోయి వుంటుందని గ్రహించాడు.

"హాండ్సప్ మిస్టర్, ప్రాణ్!" అన్నాడు 'సీబర్డు' మానేజర్ విన్సెంట్ గంభీరంగా.

విధిలేక చేతులు పైకెత్తుతూ, విన్సెంట్ ప్రక్కనున్న యువతిని చూసి త్రుళ్ళిపడ్డాడు ప్రాణ్.

ఆమె—మిస్ మేనక!!

ప్రాణ్ ముఖ భావాలను గమనించి, "చనిపోయిన మేనక దయ్యమై వచ్చిందనుకుంటున్నావా?" అంటూ పకపక నవ్వాడు విన్సెంట్.

"మేనక ఇంట్లో క్రూరంగా హత్య చేయబడిన యువతి యెవరు?" ఆశ్చర్యంగా ప్రశ్నించాడు ప్రాణ్.

"నీకు కుతూహలంగా వుంటే చెబుతాను విను" అన్నాడు విన్సెంట్. "సీబర్డు నైట్ క్లబ్‌లో మా రహస్యం తెలుసుకున్నావు నువ్వు. మేనక పైన అనుమానం కలగకుండా అదే రూపులో వున్న మరో యువతిని చంపి ఆనవాలు తెలియకుండా ముఖం చెక్కేశాము. వజ్రాలు దొరకగానే తన వాటాతో విదేశాలకుపోయి మరో పేరుతో నూతన చరిత్ర ప్రారంభిస్తుంది మేనక.. మరో నిమిషంలో నా పిస్టల్‌కి బలికాబోతున్నవాడివి. నీకు చెప్పడంవల్ల భయంలేదనే చెబుతున్నాను...."

"నన్ను చంపితే వజ్రాలు శాశ్వతంగా పోగొట్టుకుంటారు మీరు" అన్నాడు ప్రాణ్.

"వాట్ డూ యూ మీన్?"

"వజ్రాలు నా చేతిలో పడ్డాయి" అన్న ప్రాణ్ పలుకులకు చిన్నగా ఉలికిపడి ముఖాలు చూసుకున్నారు విన్సెంట్, మేనకలు.

అదే క్షణంలో—ఆ స్ప్లిట్ సెకండ్‌లో.... మెరుపులా పనిచేశాడు ప్రాణ్.

అతను తన్నిన తన్నుకు విన్సెంట్ చేతిలోని పిస్టల్ ఎగిరిపడింది.

మేనక కెవ్వున అరిచింది.

విన్సెంట్ కడుపులో గుద్దాడు ప్రాణ్. వెనక్కి పడిపోయాడతను.

పిస్టల్ పడినవైపు వెళ్ళబోయింది మేనక. అటువైపు గెంతి ఆమెను మరోవైపుకు బలంగా తోసేశాడు. బంతిలా పోలుమూలకు వెళ్ళి పడిందామె.

ప్రాణ్ పిస్టల్‌వైపు గెంతాడు. అప్పటికే లేచి నిలుచున్న విన్సెంట్, ప్రాణ్‌మీదపడ్డాడు. అతను కొట్టిన దెబ్బకు దూరంగా పడిపోయాడు ప్రాణ్.

మేనక లేచినిలబడింది. ప్రాణ్‌ని తిట్టుకుంటూ పిస్టల్ వైపు నడిచింది.

విన్సెంట్ ప్రాణ్‌మీద దురికాడు. కాని, ప్రాణ్ కాలితో ముఖంమీద తన్నడంతో వెనక్కి ఎగిరాడు. అలా ఎగరడంతో మేనకను గుద్దుకొని ఇద్దరూ క్రింద పడిపోయారు.

చటుక్కున లేచి నిలుచున్నాడు ప్రాణ్. పెద్దగా 'వార్ క్రై' చేస్తూ శరీరమంతా కరాటే భంగిమలోకి తెచ్చేశాడు.

లేవబోతున్న విన్సెంట్‌ని కాలితో ముఖంమీద తన్నాడు. ఎన్నో టన్నుల బరువైన దెబ్బ తగలడంతో

యెగిరి నేలపైన పడిపోయాడతను. ముఖం పచ్చడయింది. క్రింద పడటంతో తల టీపాయ్‌కి కొట్టుకొని స్పృహ తప్పి కూలిపోయాడు.

మేనక భయంతో వొణికిపోయింది.

పైకి లేవమని సైగచేశాడామెకు ప్రాణ్. బెదురుగానే లేచి నిలుచుంది.

"వంచకీ! అందమైన స్త్రీ మనసు కూడా అందంగానే వుంటుందంటారు. బహుశా నువ్వు తప్పుబుట్టి వుంటావు. నీ స్వార్థం కోసం నిన్ను నమ్మినవాణ్ని వంచించడమేకాక మరో అమాయకపు యువతిని కూడా బలిగొన్నావ్. నిన్నేంచేసినా పాపంలేదు" అంటూ కోపం పట్టలేక చెంప ఛెళ్ళుమనిపించాడు ప్రాణ్.

తరువాత ఆమె చేయిపట్టుకొని బరబరా లాక్కు వెళ్ళి బాత్‌రూంలో పెట్టి బయట గొళ్ళెం పెట్టాడు.

విన్సెంట్ వద్దకెళ్ళి నాడి చూశాడు. కొంతసేపటివరకు అతనికి మెలకువరాదని గ్రహించాడు. అతని జేబులు వెదికాడు. తనకు కావలసిందేమీ కనిపించలేదు.

రమేష్‌చంద్ర బంధాలను విప్పాడు. లేచి నిలుచోలేకపోయాడతను. ఒళ్ళంతా గాయాలతో, చిత్రవధ తాలూకు చిహ్నాలతో నీరసంగా వున్నాడతను. అతన్ని తీసుకువెళ్ళి సోఫాలో పరుండబెట్టాడు.

ప్రాణ్ ఇల్లంతా గాలించాడు. విన్సెంట్ బెడ్‌రూంలో అతనికవసరమైన కాగితాలు మూడు కనిపించాయి.

వాటిలో ఒక ఉత్తరం మేనక రాసింది. మిగతా రెండిటిలోనూ వున్న సంతకాలను చూసి ఆశ్చర్యపోయాడు ప్రాణ్. వాటిని జేబులో పెట్టుకున్నాడు.

హాల్లోకి వచ్చి టీపాయ్‌ని గోడ దగ్గరగా వేశాడు. లివింగ్ రూంలో వున్న మినీ టేప్ రికార్డర్‌ని తెచ్చి టీపాయ్‌మీదుంచి, ప్లగ్ చేశాడు. అది పైకి కనిపించకుండా పైన ఇలస్ట్రేటెడ్ వీక్లీని తెరిచి బోర్లించాడు.

తరువాత రికార్డర్‌కి ముందు రెండు కుర్చీలు తెచ్చి వేశాడు, వీపు రికార్డర్ వైపుకి వుండేలా.

విన్సెంట్‌ని ప్రయాసమీద మోసుకొచ్చి ఓ కుర్చీలో కూర్చుండబెట్టి త్రాళ్ళతో కుర్చీకి కట్టేశాడు. తరువాత మేనకను కూడా తీసుకొచ్చి రెండో కుర్చీకి కట్టేశాడు.

పిస్టల్ తీసి వారికి గురిపెట్టాడు.

"విన్సెంట్! మీ ఆటకట్టింది. మీ గేమ్ ఏమిటో, ఇందులో మీ పాత్రలు ఏమిటో వివరంగా చెప్పు" అన్నాడు ప్రాణ్.

"హుం .... నా యింట్లో చొరబడి నన్నే బెదిరిస్తున్నావ్. నీపైన పరువు నష్టపు దావా వేస్తాను. బర్గ్లరీ చార్జి పెట్టి నిన్ను జైలుకు పంపిస్తాను" అన్నాడు విన్సెంట్ హుంకరిస్తూ.

జేబులోనుండి ఉత్తరాలు తీసి చూపుతూ, "ఈ ఉత్తరాలు చూశాక కూడా నాపైన బర్గ్లరీ చార్జి పెట్టాలనుంటే చెప్పు, యిప్పుడే పోలీసులకు ఫోన్ చేస్తాను" అన్నాడు ప్రాణ్ మందహాసంతో.

వాటిని చూడటంతో బంధితుల ముఖాలు పాలిపోయాయి.

"స్పిల్ ఇట్ మాన్!" అంటూ పిస్టల్ పేల్చాడు ప్రాణ్, బులెట్ విన్సెంట్ తలపైనుండి దూసుకుపోయింది. అతని కన్నుల్లో మృత్యుభయం ద్యోతకమయింది.

"దిసీజ్ వోన్లీ ఎ వార్నింగ్ షాట్.." అన్నాడు ప్రాణ్. "రెండు సెకన్లలో నోరు తెరవకపోయా వంటే ఈసారి బుల్లెట్ నీ బుర్రలో దూరుతుంది. ఆ తరు వాత మేనక అందమైన వక్షాన్ని ముద్దు పెట్టుకుంటుంది."

అలా అంటూనే వారి వెనకగా వెళ్ళి టేప్ రికార్డర్ ఆన్ చేసి వచ్చాడు.

"ఎస్ ...." అంటూ వారికెదురుగా నిలుచుని ఏదో అనబోయాడు ప్రాణ్.

అదే సమయంలో వీధి తలుపు మెల్లగా తెరుచు కోవడంగాని, ఒక వ్యక్తి లోపలికి రావడంగాని గమ నించలేదతను.

ఉన్నట్టుండి మెడపైన ఏదో చల్లగా తగలడంతో చిన్నగా ఉలిక్కిపడ్డాడు.

"నీకు కావలసింది నేను చెబుతాను, ప్రాణ్! ముందు పిస్టల్ డ్రాప్ చేసి చేతులు పైకెత్తు!" అన్న గంభీర మైన పలుకులు వినిపించడంతో తప్పనిసరిగా పిస్టల్ నేలకు జారవిడిచాడు ప్రాణ్. తన ప్రమత్తతకు చింతిస్తూ.

విన్సెంట్, మేనకలు వచ్చినప్పుడు తెరిచిన తలుపు మూయలేదన్న విషయం అప్పుడే గుర్తొచ్చిందతనికి.

ఆ వ్యక్తి ఆదేశం ప్రకారం చేతులు పైకెత్తి గోడ వద్దకు వెళ్ళి నిలుచున్నాడు ప్రాణ్. ముఖం గోడవైపు వున్నందున ఆగంతకుడి ముఖం చూడలేకపోయాడు. కాని, ఆ స్వరం ఎక్కడో ఆలకించినట్టుంది.... 'సీజర్స్'లో విన్న స్వరమే అది!

"ఎవరు నువ్వు?" ప్రశ్నించాడు ప్రాణ్.

"నీ పాలిట మృత్యువును" అన్నాడు ఆగంతకుడు కఠినంగా. "నీ అంతిమ కోర్కె నెరవేర్చడం మానవ

ధర్మంగా భావించి చెబుతున్నాను విను ... మేనక సాయంతో రమేష్‌చంద్ర దగ్గరున్న వజ్రాలను దొంగిలించాలని ప్లాన్ వేశాము. రమేష్‌చంద్రను బంధించాము. వజ్రాలు దొరకగానే అతన్ని చంపి, వాటితో మేనక, నేను, విన్సెంట్ విదేశాలకు పారిపోవాలనుకున్నాం. కాని, అతను వజ్రాలను యెక్కడ దాచాడో చెప్పలేదు. అందువల్ల మా ప్లాన్ అప్ సెట్ అయింది. అంతలో నువ్వు మేనక పాత్రను గుర్తించడం జరిగింది. అందుకే ఆమె పోలికలున్న మరో యువతిని చంపి మేనకను మాయం చేశాము. ఆ హత్య జరిగింది నీ కోసమే కనుక శవం చేతిలోని చీటీ నిన్ను హెచ్చరించడంకోసమే పెట్టాము.... ఈ రాత్రి ఎలాగైనా రమేష్‌చంద్ర చేత వజ్రాలు దాచిన చోటు చెప్పించాలని దృఢ నిశ్చయంతో వచ్చాము. వజ్రాలు దొరగ్గానే వాటిని ముగ్గురమూ పంచుకొని తలో దేశము వెళ్ళిపోయి మిలియనీర్లమై కొత్త జీవితాలను గడపాలనుకున్నాము."

ఆగాడతను.

"యూ ట్రెయిటర్!" అంటూ పైకి లేవబోయాడు రమేష్‌చంద్ర.

"డోంట్ మూవ్ మాన్! అనవసరంగా చస్తావు" అంటూ తీక్షణంగా హెచ్చరించాడతను.

"ప్రాణ్! మధ్యలో నీ అడ్డంకి మూలంగా మా పని ఆలస్యమయేటట్లుంది. అందుకే ముందుగా నిన్ను యమలోకానికి పంపిస్తున్నాను. దేవుణ్ని తలుచుకో!" అంటూ పిస్టల్ పైకెత్తాడతను.

కళ్లు మూసుకుని ఊపిరి బిగబట్టాడు ప్రాణ్.

మరుక్షణంలో పిస్టల్ ప్రేలింది.

## 12

'అబ్బా' అంటూ చేయి పట్టుకుని ముందుకు వొంగి పోయాడు ఆగంతకుడు. అతని చేతిలోని పిస్టల్ నేల మీద పడింది.

ఆశ్చర్యంతో కళ్లు తెరిచి గిర్రున వెనక్కి తిరిగాడు ప్రాణ్.

గుమ్మంలో మిస్ గీత నిలుచుని వుంది. ఆమె చేతిలోని రివాల్వర్ పొగలు క్రక్కుతోంది. ఆగంతకుణ్ని కవర్ చేస్తోందది, ఏ క్షణంలోనైనా మళ్ళీ ప్రేల్చడానికి ఆతృతపడుతున్నట్లు.

"గీతా!" అన్నాడు ప్రాణ్ ఆనందంగా.

"చేతులు పైకెత్తి పిస్టల్‌కి దూరంగా జరుగు!" అంటూ ఆగంతకుణ్ని ఆదేశించింది గీత.

చెప్పినట్టు చేశాడతను.

ప్రాణ్ వెళ్ళి క్రిందపడిన ఆగంతకుడి పిస్టల్ని, అంతకుముందు తాను క్రిందపడేసిన పిస్టల్ని తీసి జేబులో పెట్టుకున్నాడు. ఆగంతకుణ్ని త్రాళ్ళతో ఒక కుర్చీకి కట్టేశాడు.

అతన్ని వుద్దేశించి, "సాధుసింగ్! నీవంటి క్రూక్‌ని నమ్మడం రమేష్‌చంద్ర చేసిన పెద్ద పొరపాటు. ఫైనాన్స్ బ్రోకర్‌గా వుంటూ పెద్ద గేమ్ ప్లాన్ చేశావు. రమేష్ చంద్ర సమయస్ఫూర్తితో ఆ వజ్రాలను మేనక స్నానం చేసి వచ్చేలోపున ఆమె బెడ్‌రూంలోని స్విచ్‌బోర్డులో దాచివుండకపోతే—ఈ పాటికి అతని శవం పోలీసులకు దొరకడమేకాక, వజ్రాలతో ఎవరికీ దొరకనంత దూరం

పారిపోయి వుండేవారు మీరు" అన్నాడు ప్రాణ్.

"అఁ! వజ్రాలు స్విచ్ బోర్డులో పెట్టాడా!?" అన్నారు సాధుసింగ్, విన్సెంట్, మేనకలు ఒక్కసారిగా.

"ప్రాణ్ జీ! మీరు వాటినెలా తెలుసుకోగలిగారు?!" ఆశ్చర్యంతో ప్రశ్నించాడు రమేష్‌చంద్ర.

మందహాసంతో, "డిటెక్టివ్‌ల వూహ కందని చోటంటూ వుండదు, మిస్టర్!" అని, "వజ్రాలు నా దగ్గర సురక్షితంగా వున్నాయి" అన్నాడు.

"బాస్! మీరు అనుమానంతో సాధుసింగ్ మూవ్‌మెంట్స్‌ను కనిపెట్టమని నన్ను పంపించారుగా. చీకటి పడినప్పటినుండీ అతనింటికెదురుగా కాపు కాశాను. ఇప్పటికి బయటకొచ్చాడు. కారులో వెంబడించాను. అతను ఈ బిల్డింగ్‌లో ప్రవేశించటంతో అనుసరించి వచ్చాను.... థాంక్ గాడ్! సమయానికి రాగలిగాను" అంది గీత, ప్రాణ్‌తో.

"నీట్ అండ్ ఫాస్ట్ వర్క్!" మెచ్చుకున్నాడు ప్రాణ్.

"ఇన్స్‌పెక్టర్ మాధవ్‌కి ఫోన్ చెయ్."

గీత టెలిఫోన్ చేస్తూంటే, ప్రాణ్ వెళ్ళి టేప్ రికార్డర్ ఆఫ్ చేసి వచ్చాడు. టేప్ తీసి బంధితులకు చూపుతూ, "రాక్షసుడి ప్రాణం చిలుకలో వున్నట్లు మీ ముగ్గురి ప్రాణాలు ఈ చిరుటేప్‌లో వున్నాయి! ఇప్పుడు నువ్వు చెప్పిందంతా ఇందులో రికార్డయింది" అన్నాడు సాధుసింగ్‌తో.

కత్తివేటుకు నెత్తురు చుక్కలేదు వారి ముఖాలలో.

84

మెల్లగా లేచొచ్చాడు రమేష్‌చంద్ర. ప్రాణ్ చేతులు పట్టుకుని ఆప్యాయంగా నొక్కుతూ, "ప్రాణ్ జీ! నా కృతజ్ఞతనెలా తెలుపుకోవాలో తెలియటంలేదు. నా ప్రాణాలు, సీతా కూడా కాపాడారు" అన్నాడు.

మందహాసంతో గీత వంక చూశాడు ప్రాణ్.

అందంగా నవ్విందామె.

—: ఐ పో యిం ది :—

# నడమంత్రపు సిరి

వాణిశ్రీ

రాత్రి ప్రొద్దుపోయేవరకూ వలలు కట్టి మళ్ళీ తెల్లవారు జామునే బయల్దేరిపోయాడు వెంకటేసు. ఈమధ్య అతను రోజూ ఆ విధంగానే కష్టపడుతున్నాడు. వలలో పడిన చేపలు అతని బ్రతుకు తెరువు.

నిజానికి వెంకటేసు అంతగా కష్టపడాల్సిన పనిలేదు. మొగుడు పెళ్ళాం ఇద్దరే. పెళ్ళయి మూడేళ్ళయింది. ఇంకా పిల్లలు లేరు. కాకపోతే చెల్లెలు పెళ్ళి అతనికి గుండెలమీద కుంపటిలా కూర్చుంది.

అతని చెల్లెలు రాధ పదోక్లాసు ప్యాసయింది. వాళ్ళ కుటుంబంలో ఆ మాత్రం చదువుకున్నవాళ్ళు ఎవరూ లేరు. రాధ మాత్రం తను కాలేజీలో చదువుకోవాలని తహతహలాడుతోంది. వెంకటేసుకే ఇష్టంలేదు.

పదోక్లాసు చదివినందుకే పెళ్ళి ఒక సమస్యయింది. తగిన వరుడు దొరకడం ఎంతో కష్టం. ఎంతో ప్రయత్నం చేసిన మీదట ఒక సంబంధం కుదిరింది. కుర్రవాడు

సేల్స్‌టాక్స్ డిపార్టుమెంటులో అటెండరు. కట్నం మూడు వేలు.

చెల్లెలు కేమాత్రం ఇష్టంలేదు పెళ్ళి. చెల్లెలు కిష్టంలేక పోయినా వెంకటేసు పెళ్ళి చెయ్యడానికి తొందరపడుతున్నాడు.

భూదేవి చేపల కంట్రాక్టరు. మొగుడుపోయి పదేళ్ళయింది. వయస్సు నలభై వుంటాయి. ఇద్దరు కూతుళ్ళకు పెళ్ళిళ్ళు చేసి పంపేసింది. భూదేవి వెంకటేసు అంటే పడిచస్తుంది. చెల్లెలి పెళ్ళికి తను డబ్బు అప్పుగా ఇస్తానంది వెంకటేసుకి.

ఇంకా తెల్లవారలేదు. వెంకటేసు వలలు విప్పుతూ పోతున్నాడు. ఎంతో బరువుగా వుంది. తన అదృష్టం అనుకున్నాడు. వల పైకిలాగాడు. చేపలతోపాటు నల్లటి సూట్‌కేస్. అతని కళ్ళు నమ్మలేదు కొన్ని క్షణాల పాటు.

నిజమే అది సూట్‌కేసే. చేపలను పక్కకునెట్టి సూట్‌కేస్ చేతిలోకి తీసుకున్నాడు. అది చాలా ఖరీదైనదిలాగా కనిపించింది. నున్నగా వుండి చెయ్యివేస్తే జారిపోతున్నది.

'ఇందులో ఏముందో?' అనే ప్రశ్నకు సమాధానం రాలేదు. తెరవడానికి ప్రయత్నించాడు. కాని రావటం లేదు.

దూరంగా పడవలు వస్తున్నాయి. మనవాళ్ళు వస్తున్నారు. దీని సంగతి ఎవరికీ చెప్పకూడదు అనుకున్నాడు.

సూట్‌కేస్‌లో ఏముందో తెలుసుకోవాలనే కుతూహలం అతన్ని ఎక్కువసేపు అక్కడ వుంచలేదు. ఎప్పుడు వెళ్ళిపోదామా? అనే ఆత్రుతతోనే వున్నాడు.

సూట్ కేస్ బుట్ట అడుగున పెట్టేశాడు పైన చేపలు సర్దాడు. ఇప్పుడు ఎవరికీ అది కనిపించదు. చేపలబుట్ట అనుకుంటారు.

చేపలు తీసుకుని రోజూ అయితే భూదేవి ఇంటికి వెళ్లేవాడు. భూదేవి వాటిని తూచి కిలోకి ఇంత అని రేటుకట్టి డబ్బు ఇస్తుంది. తర్వాత వాటిని ఐస్ పెట్టెల్లో ప్యాక్ చేసి కలకత్తాకు ఎగుమతి చేస్తుంది. అందులోనే సంపాదించి డాబా కట్టించింది. నగలు చేయించుకుంది. కూతుళ్ళకు మంచి సంబంధాలు చూసి అత్తారిళ్ళకు పంపేసి తను దర్జాగా కులాసాగా వుంటోంది.

ఆ రోజు వెంకటేసు సరాసరి తన ఇంటికి వెళ్ళాడు. అప్పటికి రాధ ఇంకా నిద్రలేవలేదు. చంద్ర వాకిలి వూడుస్తోంది. చేపల బుట్ట పట్టుకొని ఇంట్లోకి వస్తున్న భర్తని చూసి కొంచెం ఆశ్చర్యపోయింది.

"ఏంటి చేపలు తెచ్చావ్?" అంది.

"ష్! అరవకు" అన్నాడు వెంకటేసు.

బుట్ట అడుగునుంచి సూట్ కేస్ లాగి చెక్క పెట్టెలో పడేసి మూశాడు.

"ఎక్కడిది?" అంది చంద్ర.

"వల్లో పడింది. నేనొచ్చి తీస్తాను. ఎవరికీ చెప్పకు" అన్నాడు వెంకటేసు.

చేపలు భూదేవి ఇంటికి తీసుకెళ్ళాడు. భూదేవి తూకంవేసి డబ్బు ఇచ్చింది.

"ఏరా వెంకటేసూ! రాత్రి రాలేదేం?" అంది నవ్వుతూ.

"అది రానిస్తే కదా!" అన్నాడు వెంకటేసు.

"తెల్లార్లూ దాన్నే వాటేసుకుని పడుకున్నావా?

రాదలుచుకుంటే రావడానికి సందు దొరకదా!" అంది నిష్ఠూరంగా.

"ఇయ్యాల వస్తాలేలే!" అన్నాడు వెంకటేసు.

అతనికి ఎంతో ఆత్రంగా వుంది సూట్ కేస్ తెరిచి చూడాలని. అందులో ఏముందో? బంగారు నగలున్నా యేమో? ఒకవేళ తన అదృష్టం బాగుండి బంగారమే వుంటే దాన్ని ఎలా డబ్బుగా మార్చుకోవాలి? పోలీసులకు చిక్కకుండా కొంచెం కొంచెం బంగారమే అమ్ముకుని డబ్బు కూడేసుకుని భూదేవి బాబులా డాబా కట్టుకోవాలి.

ఇంటికి చేరుకున్నాడు వెంకటేసు. తలారా స్నానం చేశాడు.

"నువ్వు కూడా స్నానం చేసి రా!" అన్నాడు చంద్రతో.

"ఇంకా పనికాలేదు. అప్పుడేం తొందర?" అంది చంద్ర.

"ముందు చెప్పినట్లిను" అని గుడ్లురిమి చూశాడు వెంకటేసు కోపం ఆపుకుంటూ.

చంద్ర మారు మాట్లాడకుండా స్నానంచేసివచ్చింది.

తర్వాత పెక్క పెట్టె దగ్గర నిల్చుని తలుపు గొళ్ళెం పెట్టాడు. ఇంట్లో అంతా చీకటైపోయింది.

అది పూరిల్లు కావటంవల్ల తాటాకు సందుల్లోంచి సూర్యకిరణాలు అక్కడక్కడా పడి కొంచెం వెలుతురు వస్తోంది.

"ఇప్పుడేం చెయ్యాలి?" అంది చంద్ర.

"ఈ పెట్టె దేవుడి పటం ముందు పెట్టి పసుపు కుంకంబొట్లు పెట్టి పూజ చెయ్యాలి" అన్నాడు

వెంకటేసు.

"పెట్టెకు పూజెందుకు?" అయోమయంగా ప్రశ్నించింది చంద్ర.

"ఈ పెట్టెలో లక్ష్మివుంటాదే ఎర్రి మొగమా? పూజచెయ్యకపోతే కోపగించి మాయమైపోతది. పెద్ద పెద్ద సేట్లంతా ఇనప్పెట్టెలకి పూజచేస్తారు ఎప్పుడూ చూడలేదా?" అన్నాడు వెంకటేసు.

"ఇందులో డబ్బుంటాదా?" చంద్ర ఆశ్చర్యంగా అడిగింది.

"ఆఁ....వుంటాది. మన అదృష్టం బాగుంటే బంగారం వుంటాది" అన్నాడు వెంకటేసు.

వెంకటేసు భార్యకి ఏం చెయ్యాలో చెప్తూ చెక్క పెట్టె మూత తియ్యబోయాడు.

"ఒరేయ్ ఎంకటేసూ!....ఎంకటేసూ!" అనే కేక వినిపించింది బైటనుంచి.

'ఎవడ్రా వాడు ఏళాపాళా లేకుండా' అని గొణుక్కుంటూ గొళ్ళెంతీశాడు వెంకటేసు.

ప్రక్కింటి కాంతయ్య.

"సుట్టముక్కుంటే ఇట్టా పడెయ్యరా నాలిక పీకుతోంది" అన్నాడు కాంతయ్య.

వెంకటేసుకి కోపం ముంచుకొచ్చింది.

"పొద్దున్నే తగలడ్డావేంట్రా ముసల్నాకొడకా!" అని తిట్టాడు.

కాంతయ్య ఇంటిలోపలకి తొంగి చూశాడు. వెంకటేసు, చంద్ర ఇద్దరూ తలంటు స్నానాలు చేసి శుచిగా వుండటంచూసి ఆశ్చర్యం ప్రకటించాడు.

"ఏంట్రా ఎంకటేసూ! పొద్దున్నే తలుపులేసుకుని

ఏం జేస్తున్నార్రా! రాత్రిళ్ళు కుదరటంలేదట్రా! సెల్ల లడ్డంగా వుంటుందా!" అని కాంతయ్య పకపకా నవ్వాడు.

"ఛీ....మావా!...." అని సిగ్గుపడింది చంద్ర.

"ముసలోడికి బుద్ధి లేకుండా పోయింది" అని గొణుక్కొని వెంకటేసు చుట్ట తీసి అతని మీదకి విసిరాడు.

కాంతయ్య నవ్వుకుంటూ చుట్ట అందుకొని అగ్గిపెట్టె అడిగి తీసుకొని ముట్టించుకున్నాడు.

"నాకంతా తెల్సులేరా!" అనుకుంటూ నెమ్మదిగా నడిచిపోయాడు కాంతయ్య.

వెంకటేసు తలుపుమూసి గొళ్ళెం పెట్టాడు.

"ఎవరన్నా వస్తే ఏమనుకుంటారు" అంది చంద్ర సిగ్గుపడుతూ.

"నీ మొకం అనుకుంటారు" అని మండిపడ్డాడు వెంకటేసు.

చెక్కపెట్టె తెరిచి అందులోనుంచి సూట్ కేస్ తీసి చంద్రకు అందించాడు. చంద్ర ఆ పెట్టెకు పసుపు, కుంకుమ బొట్లుపెట్టి దేవుడి పటం ముందు పెట్టింది. ఇద్దరూ పూజచేశారు. సాష్టాంగపడ్డారు. లెంపలేసుకున్నారు. గుంజీళ్ళుతీశారు.

వెంకటేసు దేవుణ్ని తలుచుకుంటూ మడ్డుకత్తితో సూట్ కేసుని పగలకొట్టాడు. సూట్ కేస్ రెండుగా విచ్చుకుంది.

వెంకటేసు సంభ్రమాశ్చర్యాలతో చూస్తుండిపోయాడు. కలా నిజమా? అన్నట్లు అచేతనంగా వున్నాడు. చంద్రకు గుండె దడ హెచ్చింది. ఇద్దరూ

శిలాప్రతిమలై నోట మాటరానివాళ్ళలా నిలబడి పోయారు.

సూట్ కేస్ లోనుంచి పడిన నోట్లకట్టలు చిందర వందరగా ఇంటినిండా పరుచుకున్నాయి.

వెంకటేసుకి సంతోషంతో గుండె ఆగిపోతుందేమో అనిపించింది.

"చంద్రా! లక్ష్మొందేవే!" అన్నాడు వెర్రికేక పెట్టి.

## 2

ఆరుబైట మంచం వేసుకుని పడుకున్నాడు వెంకటేసు. అప్పుడే చీకటిపడుతోంది. టైమ్ ఏడు కావొచ్చింది.

వెంకటేసు మనసులో ఆలోచనలు సముద్రంలో తుఫాన్‌లా అల్లకల్లోలంగా చెలరేగుతున్నాయి.

అతని కళ్ళముందు నోట్లకట్టలు మెరుస్తున్నాయి. అంత డబ్బు అతని జీవితంలో ఎన్నడూ చూళ్ళేదు. అంతెందుకూ వందరూపాయిల కాగితమే ముట్టుకొని ఎరగడు. అటువంటి వాడికి అంత డబ్బు చూసేసరికి మతిపోయినట్లుయింది. ఆ డబ్బు విలువ ఎంత వుంటుందో అర్థమే కావటంలేదు. అతనికి లెక్కలు రానేరావు. చిల్లర కాగితాలు మాత్రం ఎలాగో గుణించుకుంటాడు. చంద్ర అతనికంటే అయోమయం.

సూట్ కేసులో వున్న డబ్బు ఎంత వుందో దాన్ని ఎలా తెల్సుకోవాలో వెంకటేసుకి అర్థమే కావటం లేదు. పోనీ చెల్లెలు రాధకి చూపించి లెక్కించమంటే? అనుకున్నాడు. కాని ఆ ఆలోచనగూడా అతనికి నచ్చలేదు. చిన్నపిల్ల పొరపాటున ఎవరి చెవిలోనైనా వేస్తే కొంప మునుగుతుంది అనుకున్నాడు.

వెంకటేసుకి చదువు రాకపోయినా తెలివి తక్కువ వాడు మాత్రం కాదు. అందుకే అతను డబ్బు లెక్క తేల్చుకోకపోయినా చాలా విలువైె వుంటుందని గ్రహించి చెక్కపెట్టె అడుగున సూట్ కేస్‌ని డబ్బుతో సహా అలాగే వుంచేశాడు.

పగలంతా అతనికి ఏం తోచలేదు. కాలుకాలిన పిల్లిలా ఇంట్లోకీ బైటికీ తెగ తిరిగాడు. చీకటిపడ్డాక అరుబైట పడుకుని ఆ డబ్బుని ఏం చెయ్యాలా అనే ఆలోచనలో పడిపోయాడు.

కాకినాడనుంచి అతని చెల్లెలు కాబోయే మామ రావటం చూసి వెంకటేసు మంచం దిగి నిల్చున్నాడు.

"బాగున్నావా వెంకటేసూ!" అన్నాడు నూకాలు వస్తూనే.

వెంకటేసు పొడిగా దగ్గి "ఆఁ...." అన్నాడు. అప్పుడతనికి జ్ఞాపకం వచ్చింది. చెల్లెలు పెళ్ళికివ్వాల్సిన కట్నం ఆ రోజు ఇస్తానని అనడం.

భూదేవి అప్పు ఇస్తానని ఒప్పుకుంది. కాని నూటికి ఐదు రూపాయలు వడ్డీ. ఆ లెక్కన ఆ బాకీ ఎన్నాళ్ళకి తీరుతుందోనని వెంకటేసుకి లోలోపల భయంగానే వుంది. అటువంటి బాకీలు అసలు జన్మలో తీరకపోవటం భూదేవి వాళ్ళ ఇళ్ళు రాయించుకోవటం అన్నీ గుర్తు వచ్చాయి.

మామూలుగా అయితే నూకాలుకి వెంకటేసు ఎంతో మర్యాదచేసి వుండేవాడు. నాటుసారా తెచ్చీ, వేట మాంసం వండించీ తృప్తిపరచడానికి నానాపాట్లు పడేవాడు. కాని అప్పుడు పరిస్థితి వేరుకదా! నూకాలుకి ఆ విషయం ఏం తెల్సు. మామూలుగానే వియ్యంకుడి

దర్జా చూపించాడు.

"డబ్బు రెడీయేనా?" అన్నాడు నూకాలు.

వెంక టేసుకి ఆ అడిగే పద్ధతి చూసి చుర్రెక్కింది.

"వుహూఁ...." అన్నాడు తల అడ్డంగా వూపుతూ.

నూకాలు ముఖం నల్లగా మాడిపోయింది. అంతలో నే కోపంతో ఎర్రబడింది.

"ఏటీ! పైకం అందలేదా?"

"నూటికి రెండు వడ్డీ అడుగుతున్నారు. నావల్లకాదని వచ్చేశాను" అన్నాడు వెంక టేసు.

వెంక టేసు వైఖరి నూకాలికి నచ్చటంలేదు. పెళ్ళి కొడుకు తండ్రిననే అహంకారం అతన్ని వూపిరి సలప నీడంలేదు.

"ఏటంటావు తే?" తీవ్రంగా అన్నాడు నూకాలు.

"అనేదేటి?"

"నీ చెల్లెలికి పెళ్ళి చెయ్యాలనుందా లేదా?"

"వుంది కాని డబ్బులేదు."

"అంతకాడి కీ బేరాలెందుకు?"

"బేరం ఏంలేదు. కట్నం సొమ్ము ఒక ఏడాది తర్వాత ఇస్తా! పెళ్ళి జరగనీ" అన్నాడు వెంక టేసు.

నూకాలు లెయ్!....మని ఇంతెత్తు ఎగిరాడు. వెంక టేసుని దులపడం మొదలెట్టాడు. ఆ గొడవ చెవినపడి కులంవాళ్ళంతా చుట్టుముట్టారు.

వెంక టేసు దృఢ వైఖరితో నే వున్నాడు. పూనకం వచ్చిన వాడిలా వూగిపోతున్నాడు.

కట్నం డబ్బు ఇవ్వలేననీ, సంవత్సరం తర్వాత ఇస్తానని పెద్దలముందు చెప్పాడు వెంక టేసు.

నూకాలు చచ్చినా ఒప్పుకోనన్నాడు. అసలా మూడు

వేలకి ఒప్పుకుంటే గొప్పన్నాడు. పదివేలిస్తామనీ ఇంటి చుట్టూ తిరుగుతున్నారనీ, కాని పిల్ల అందం చూసి, చదువు చూసి మూడు వేలకే ఒప్పుకున్నాననీ తన వుదార స్వభావం వెల్లడించాడు నూకాలు.

పెద్దలు ఇద్దరికీ రాజీ చెయ్యబోయారు. సగం కట్నం ఇప్పుడివ్వమన్నారు. వెంకటేసు ఒప్పుకోలేదు.

పెళ్లి సంబంధం చెడిపోయింది. నూకాలు కారాలూ మిరియాలూ నూరుతూ పరువులేని వెధవని వెంకటేసుని తిడుతూ పోయాడు.

"బంగారంలాంటి సంబంధం పోయింది గదరా! కుర్రోడు ఉద్యోగం చేస్తున్నాడు" అని వాపోయారు కొందరు బంధువులు.

వెంకటేసు నవ్వి "అది తాతలాంటి సంబంధం తెచ్చి నా చెల్లెలు పెళ్ళిచేస్తా!" అన్నాడు.

"మూడేలు ఇవ్వలేక నోరెళ్ళబెట్టిన ఎదవ్వి! రాజా సంబంధం, తాతలాంటి సంబంధం తెస్తావా!" అని ఎగతాళిచేశారు.

"రోజులన్నీ ఒకలా వుండవొరేయ్!"అన్నాడు వెంకటేసు. ఇంతలోకి వెంకటేసు చెల్లెలు రాధ కుట్టుపని నేర్చుకుంటానకి వెళ్ళి తిరిగివచ్చింది.

ఇంటి ముందు జనం వుండటం చూసి మొదట బెదిరిపోయింది. తర్వాత విషయం తెలిసి సంతోషించింది.

"నువ్వేం దిగులుపడకే! ఎదవ సంబంధం పోతే పోయింది" అన్నాడు వెంకటేసు చెల్లెల్ని వుద్దేశించి.

"నాకేం దిగులు" అంది రాధ.

"హాయిగా చదువుకో. కాలేజీలో చేర్పిస్తా!" అన్నాడు వెంకటేసు.

ఆ మాట విని రాధ నివ్వెరపోయింది. అన్న ముఖం లోకి చూసింది కొంపతీసి సారా తాగివున్నాడేమోనని. కాని అలాంటి సూచనలేవీ కనిపించలేదు. అతని ముఖం నిర్మలంగా వుంది.

## 3

మూడు రోజుల్నుంచి చేపల వేటకి పోవడంలేదు వెంకటేసు. మామూలుగా అయితే మూడు రోజుల్లో కొంప దివాళా తీసి వుండేది. పొయ్యిలో పిల్లి లేచేది కాదు. గంజినీళ్ళక్కూడా గతిలేకుండా పోయేది. గిద్దెడు నూకలకోసం ఇల్లిల్లూ తిరిగేది ఆ ఇంటి ఇల్లాలు.

'ఏరా ఏటకి రాటంలేదే' అని ఎవరైనా అడిగితే 'ఒంట్లో బాగోలేదురా' అనేవాడు వెంకటేసు.

కాని మనిషి ఆకారమే మారిపోయింది. పెళ్ళానికి, చెల్లెలికి కొత్తబట్టలు కొన్నాడు. తను మల్లు పంచెల్లోకి మారిపోయాడు. ఇంట్లోనుంచి వేట, కోడికూరల ఘుమ ఘుమలు వ్యాపించి చుట్టుప్రక్కలవాళ్ళు బిత్తరపోయారు. చెల్లెలి పెళ్ళి ఆగిపోయినా ఇంటిల్లపాదీ బట్టలు కొనుక్కొని టింగ్ రంగా అని తిరుగుతుంటే ముక్కున వేలేసుకున్నారు జనం.

'వీడి దగ్గర డబ్బుంచుకునే లేదని నాటకం ఆడు తున్నాడు' అని ప్రచారం మొదలైంది.

చంద్రకి ఇరుగు పొరుగుల ఈర్ష్యా, అసూయలు అర్థ మయ్యాయి. ఎవరైనా పచ్చగా వుంటే ఓర్వలేరని ఆమెకు తెలిసింది.

"మనం కూర్చుని తింటుంటే అందరికీ అనుమానం వస్తుంది. లేనిపోని గొడవ రాకుండానే జాగ్రత్తపడు" అంది చంద్ర.

"ఏం జెయ్యమంటావే?" అన్నాడు వెంకటేసు.

"ఏదైనా చెయ్యి. అందాకా చేప వేటకి మామూలుగా వెళ్ళు" అంది చంద్ర.

"వ్హూం—" అన్నాడే గాని వెంకటేసుకి మళ్ళీ చేపలు పట్టడానికి ఇష్టంలేదు.

తన దగ్గర కట్టలు కట్టలు డబ్బుంచుకుని ముష్టి చేపల వేటకి వెళ్ళడం ఏమిటి? అనిపించింది అతనికి.

ఏదైనా వ్యాపారం చెయ్యాలి అనుకున్నాడు. కాని ఏది చెయ్యాలన్నా అతనికి ఓనమాలు గూడా రావు. ఏం చెయ్యాలో తోచక చస్తుండగా చేపల మార్కెట్లో ఎండుచేపల స్టాల్ ఒకటి అమ్మకానికి వచ్చింది. ముందూ వెనకా చూడకుండా రెండు వేలు గుడ్విల్ ఇచ్చి ఆ స్టాల్ కొనేశాడు వెంకటేసు.

వెంకటేసు చేపల వేటకి వెళ్ళకుండానే దర్జాగా తిరుగుతుంటే చూసి ఏడుస్తున్న జనానికి నిజంగా షాక్ కొట్టినట్లయింది. ఓర్నీ! ఈడికాడ అంత డబ్బెక్కడిది? చెల్లెలు పెళ్ళికి కట్నం ఇయ్యలేక సంబంధం వదులుకున్నోడి దగ్గర డబ్బు ఎక్కడిది? అందరి మనసుల్లోనూ అనుమాన పిశాచం కుమ్మరి పురుగులా తొలిచింది. కాని ఏమీ అంతుబట్టటంలేదు.

ఒకళ్ళిద్దరు డబ్బు విషయం ఎత్తితే వెంకటేసు బూతులు తిట్టాడు. ఎవడన్నా కాస్త బాగుపడిపోతుంటే చూసి ఏడుస్తారని ఆవేశం వెళ్ళకక్కాడు. అతని నోటికి దడిసి ఎవరూ డబ్బు సంగతి ఎత్తడం మానేశారు.

ఒక వారం రోజులు ఎండుచేపల స్టాల్లో కూర్చునేసరికి వెంకటేసుకి బోర్ కొట్టింది. వెంటనే బామ్మర్దికి

వుత్తరం రాయించి పిలిపించి కోట్లో కూర్చోబెట్టాడు.

ఆ పేటలో భూదేవికంటే తెలివైన వాళ్ళు ఎవరూ లేరు. వెంకటేసు నడమంత్రపుసిరి గురించి నలుగురూ నాలుగు రకాలుగా అనుకుని వూరుకున్నారుగాని, భూదేవికి నిద్రపట్టటంలేదు. ఇప్పుడు వెంకటేసు అటు చాయలకు గూడా రాకపోవడం ఆవిడకు ఎంతో బాధగా వుంది.

ఇదివరకు చేపలు తెచ్చి ఇవ్వడానికి వచ్చినట్టు రోజూ వచ్చేవాడు. ఒకరోజు రాకపోయినా, మరొక రోజు రాత్రిళ్ళు వచ్చి ఆమె కోరిక తీర్చేవాడు. ఇప్పుడసలు కంటికే కానరావటంలేదు. అసలు వాడి దగ్గర డబ్బు ఎక్కడిది అని ఆమె తీవ్రంగా ఆలోచించింది.

చెల్లెలు పెళ్లికి డబ్బు అప్పు అడిగితే నూటికి ఐదు రూపాయల వడ్డీకి ఇస్తానని హామీ ఇచ్చింది. మొత్తం ఐదువేలు కావాలని ప్రాధేయపడ్డాడు. ఇవ్వడానికి ఒప్పుకుంది. నెలకు రెండువందలయాభై వడ్డీ అవుతుంది. ఆ లెక్కన వాడు తన కబంధ హస్తాల్లోనుంచి బైట పడలేడు. తన చేతిలో కీలుబొమ్మలా ఆడతాడు. రోజూ తన దగ్గరికి రప్పించుకుని అనందించవచ్చు అని భూదేవి ప్లాన్ వేసింది. కాని అవన్నీ తల్లకిందులై పోవటంతో ఆమె బుర్ర ఖరాబైపోయింది.

వెంకటేసు చేపల మార్కెట్ లో ఎండుచేపల స్టాల్ కొన్నాడంటే దాదాపు జీవితంలో స్థిరపడినట్లే. నెల నెలా ఖర్చుకి పోగా డబ్బు మిగులుతుంది. దాంతో వాడు మరింత బాగుపడిపోతాడు. ఇక పూర్తిగా తన చేతిల్లోంచి జారిపోయినట్లే. అసలు వాడి కా మాత్రం

పెట్టుబడి ఎక్కడిది? వాడికి ఎవరు డబ్బు మదుపు పెట్టారు? కొంపతీసి తనలాంటి వెధవ ముండ ఎవతైనా వాడిని వలలో వేసుకుని డబ్బు పెట్టుబడి పెట్టలేదుగదా!

అటువంటి ఆలోచనరాగానే భూదేవి గుండె మండి పోయింది. ఇక ఏమాత్రం ఆలస్యం చెయ్యరాదు. సంగతేమిటో తెలుసుకుని తీరాలి, అనుకుంది. వెంకటేసు బలహీనతలు ఆమెకు బాగా తెలుసు.

భూదేవి చిన్న కూతురు సరోజ అంటే వాడికిష్టం. పడి చచ్చిపోతాడు. దాన్ని పెళ్లి చేసుకోవాలని ఎంతో ఇదైపోయాడు. కాని తనే పడనివ్వలేదు. తన కూతుర్ని చేసుకుంటే తన కామం ఎట్లా తీరుతుంది? అని ఆలోచించి పెళ్లి కాకుండా జాగ్రత్తపడింది.

సరోజ వచ్చిందనీ రమ్మని పిలిచిందనీ వెంకటేసుకి కబురు చేసింది భూదేవి. వాడితో నిజం ఎట్లా చెప్పించాలా అని ఆలోచిస్తూ కూర్చుంది.

## 4

సరోజ తనను రమ్మంది అనే కబురు అందగానే వెంకటేసు సంబరపడిపోయాడు. ఒకప్పుడు పెళ్లి చేసుకోవాలని సరోజని ఆరాధించాడు. కాని ఆ భూదేవి పడనివ్వలేదు. తర్వాత విధిలేక చంద్రతో పెళ్ళికి ఒప్పుకున్నాడు.

అయినా అతనికి సరోజ గుర్తుకు వస్తూనే వుంటుంది. ఆమెతో చెప్పుకున్న కబుర్లు, సినిమాలకని, షికార్లకనీ తిరిగిన తిరుగుళ్ళూ, దొంగచాటుగా పొందిన అనుభవాలు అన్నీ జ్ఞాపకంవచ్చి అతన్ని వుక్కిరి బిక్కిరి చేస్తాయి. ఇద్దరు పిల్లలు పుట్టినా దాని అందం చెక్కుచెదరలేదు అనుకుంటూ వెంకటేసు సరోజ కోసం బయల్దేరాడు.

భూదేవి ఇంటికి చేరుకునేసరికి బాగా చీకటిపడింది. ఏడు దాటింది. వెంకటేసు కళ్లు సరోజకోసం వెతికాయి. గుమ్మంలో నిల్చుని లోపలకు చూశాడు. ఇంట్లో ఎవరూ వున్న అలికిడిలేదు. నిశ్శబ్దంగా వుంది. తలుపు గొళ్ళెం చప్పుడు చేశాడు.

"ఎవర్రా!...." లోపలనుంచి భూదేవి గొంతు వినిపించింది.

"వెంకటేసు నే...."

"లోపలకు రా....రా...." అంది భూదేవి.

వెంకటేసు ఇంట్లోకి వెళ్లాడు. బెడ్ రూంలో పట్టె మంచంమీద కూర్చుని వుంది భూదేవి. బెడ్ పైన సీలింగ్ ఫ్యాన్ గిర్రున తిరుగుతోంది. కిటికీలోనుంచి చల్లటి గాలి వీస్తోంది. ఆ ఇంటి చుట్టుప్రక్కల అన్నీ పొలాలే. పొలాల మీదనుంచి గాలి ధారాళంగా వీస్తుంది.

"సరోజ ఏది?" వెంకటేసు ఆత్రంగా అడిగాడు.

భూదేవి చిన్నగా నవ్వింది. కొంటెగా చూసింది అతని కళ్ళలోకి. వెంకటేసుకి అర్థమైంది భూదేవి తనను సరోజ పేరు చెప్పి రప్పించిందని.

"నవ్వుతావేం?" చిరాకుగా అన్నాడు వెంకటేసు.

"అదెక్కడుందిరా! నువ్వు రావడంలేదని నేనే పిలిపించా!" అని పకపక నవ్వింది భూదేవి.

వెంకటేసు సీరియస్ గా చూసి బూతులు తిట్టాడు. వెంటనే వెళ్లిపోవాలని అనుకున్నాడు గాని భూదేవి పరుపుక్రిందనుంచి తీసిన హాఫ్ బాటిల్ బ్రాందీసీసా చూసి చల్లబడ్డాడు.

"కూర్చోరా వెధవా! .... నీకోసం తెప్పించాను. రెండ్రోజులకోసారన్నా నువ్వు రాకపోతే నాకు

పిచ్చెక్కిపోద్ది....” అంది భూదేవి పైటజారుస్తూ.

వెంకటేసు భూదేవి గుండె వంక చూసి నవ్వు తున్నాడు. అతనికి భూదేవి జాణాతనం బాగా తెలుసు. ఆమెకు నలభై ఏళ్ళొచ్చినా పాతికేళ్ళ పడుచులా వుంటుంది. శరీరం పెరగకుండా జాగ్రత్తపడటంవల్ల వయసు కనిపించదు. ఆమెకు పెళ్ళయిన ఇద్దరాడపిల్ల లున్నారంటే తెలీనివాళ్ళు నమ్మటం కష్టం. పండగలకు వచ్చిన కూతుళ్ళను వెంటేసుకొని బయల్దేరితే వాళ్ళు ముగ్గురూ అక్కా చెల్లెళ్ళనుకోవాల్సిందే తప్ప తల్లీ కూతుళ్ళని ఎవరూ అనుకోరు.

భూదేవి రెండు గ్లాసులు తెచ్చి బ్రాందీ పోసింది. వెంకటేసు ఆమ్లెట్లు తింటూ గ్లాసు ఖాళీచేశాడు. పథకం ప్రకారం వెంకటేసుకి మూడౌంతులు పోసి తను ఒకవంతు మాత్రమే త్రాగింది భూదేవి.

వెంకటేసుకిప్పుడు స్వర్గం అంచులు కనిపిస్తున్నాయి. శరీరం వుద్రేకంతో చలిస్తోంది. నరాలు జివ్వున లాగుతున్నాయి. రక్తం వరద గోదారిలా దూకుతోంది. మామూలు రోజుల్లో నలభైఏళ్ళ దానిలా కనిపించే భూదేవి అతని కళ్ళ కిప్పుడు పదహారేళ్ళ పడుచులా కనిపిస్తూ వెర్రిక్కిస్తోంది.

వెంకటేసుకి పిచ్చెక్కించాలనే భూదేవి ఆ రాత్రి అతిగా అలంకరించుకుంది. పల్చటి నైలెక్స్ చీర కట్టుకుంది. బ్రాసరీ బిగించి వంపులన్నీ స్పష్టంగా కనిపించేటట్లు జాగ్రత్తపడింది. శేరు మల్లెలు మాల కట్టి తలలో నిండుగా తురిమింది. ముఖానికి దట్టంగా పౌడరు పట్టించింది. రాళ్ళ నెక్లెస్‌తో సహా బంగారు నగలన్నీ అలంకరించుకుంది.

ఆమె అనుకున్నట్లే వెంకటేసుకి పిచ్చెక్కినట్లయింది. భూదేవి పొందుకోసం ఆత్రుతపడసాగాడు. రెండు చేతులతో భూదేవిని బంధించి వెంకటేసు ఆమెను పట్టి మంచంమీదకు నెట్టాడు. భూదేవి అతని పట్టు విడిపించుకొని దూరంగా నెట్టింది.

"చచ్చినోడా! ఇప్పుడు కావాల్సి వచ్చానా! ఇన్నాళ్ళూ ఎక్కడకు పోయిందీ ప్రేమ...." అంటూ తిట్టింది.

వెంకటేసు ఆమెను బ్రతిమాలుతూ దగ్గరకు రావాలని ప్రయత్నిస్తున్నాడు.

"అయితే నా మాట వింటావా?" అని షరతు పెట్టింది భూదేవి.

"వూఁ ... చెప్పు. నువ్వేం చెప్తే అది చేస్తా!" అన్నాడు వెంకటేసు మత్తులో తూగుతూ.

"నా దగ్గరికి రోజూ వస్తావా?"

"వూఁ....ఎందుకు రాను? రోజూ ఇటువంటి మజా చూపిస్తే....తప్పకుండా వస్తానే!"

భూదేవి నవ్వి, "రోజూ నీకు మందు మాకూ, కోడి కూర, ఆమ్లెట్లు కావాలంటే ఏభై రూపాయలు ఖర్చు" అంది.

"బోడి ఏభై" అన్నాడు వెంకటేసు.

"నీకిప్పుడు డబ్బంటే లెక్కలేదులేరా! నాకు తెలిసిందిలే! మార్కెట్లో కొట్టు కొన్నావు. చెల్లెల్ని కాలేజీలో జేర్పిస్తున్నావంట. వేటకి పోకుండానే ఇంట్లో జోరు జోరుగా తింటున్నారు. కొత్త బట్టలు కొంటున్నారు. ఏం నడమంత్రం సిరిరా నీది."

వెంకటేసు నవ్వాడు. తన అదృష్టానికి భూదేవి ఏడ్చి

చ సున్నదని అతనికి అర్థమైపోతోంది.

"అవున్రా వెంకటేసూ! నీకింత డబ్బు ఎక్కడిదిరా?" అంది భూదేవి గోముగా. అతని తలలోకి వ్రేళ్ళుపోనిచ్చి గిలిగింతలు పెడుతూ.

"ఎక్కడిదేంటే! మార్కెట్లో కొట్టుందిగా. దాని మీద లాభం వస్తుంది" అన్నాడు.

"అది సరే! కొట్టు పెట్టడానికి డబ్బెక్కడిది?"

"ఓస్....అదా నీ అనుమానం. అది అప్పుచేశా!" అన్నాడు వెంకటేసు. మత్తులో గూడా అతను జాగ్రత్తగా మాట్లాడుతున్నాడు. రహస్యం ఎక్కడా పొక్కనియ్యటంలేదు.

"నీ కెవర్రా అప్పిచ్చింది?" అంది భూదేవి అసహనంతో.

"ఎవడంటే .... ఎవడో—!" అన్నాడు నవ్వుతూ.

"వాడా? అదా?....నిజం చెప్పు. నీకు మగాడెవడు అప్పిస్తాడు! దేన్నో పట్టివుంటావ్? నిజం చెప్పరా ఎదవా! అందుకేగా నా దగ్గరికి రాడంలేదు," అంది భూదేవి కోపంతో.

వెంకటేసు పిచ్చెక్కినట్లు నవ్వాడు.

"నీయమ్మ! నీ ఆడబుద్ధి పోనిచ్చుకున్నావు కాదే! నీతో పోతుంటేనే నా పెళ్ళాం ఏడ్చి మొత్తుకుంటోంది. నీకు తోడు మరొకటా?" అన్నాడు.

"మరి డబ్బు ఎక్కడిది?"

"చెప్తే నమ్మవేంటే! అప్పుచేశా!"

"అప్పిచ్చినోడిని చూపించు" అంది భూదేవి అతనికి దూరంగా జరిగి.

వెంకటేసుకి తిక్క రేగింది. భూదేవిని పట్టుకుని

"రేపు చూపిస్తాలే. రా ముందు" అన్నాడు.

వాడు రహస్యం దాస్తున్నాడని ఆమెకు అర్థమైంది. ఎంత తాగించినా నిజం చెప్పకపోవటంతో ఆమె అహం దెబ్బతింది. నిజం చెప్పనివాడికి లొంగిపోవటం ఆమెకు ఓడిపోయినట్లనిపించింది.

"ఛీ... వదల్రా తప్పుడు నా కొడకా! నీ రంకు వేషాలు నాకు తెలుసు" అని అతిన్ని తిడుతూ వదిలించుకొని దూరంగా పోయింది భూదేవి.

కాని వెంకటేసు వదల్లేదు. చీర లాగిపారేశాడు. జాకెట్టు పర్రున చించేశాడు. వాడి పశుబలంముందు ఆమె శక్తి చాలలేదు. కేకలు పెట్టి నలుగుర్నీ పిలవడానికి వీల్లేని పరిస్థితి. వెంకటేసుతో ఆమెకు సంబంధం వుందని అందరికీ తెలుసు. అటువంటి వాడు తనని బలవంతం చేస్తున్నాడని అంటే నవ్విపోతారు. దిక్కు తోచని భూదేవి గింజుకోసాగింది.

## 5

తెల్లవారుతోంది.

తూర్పు ఎర్రబడింది.

నాగి అంట్లుతోమి, ఇల్లు వూడ్చిపోవడానికి భూదేవి ఇంటికి వచ్చింది. ప్రహరీ గోడ తలుపు చెయ్యి పెట్టగానే తెరుచుకుంది. మామూలుగా అయితే లోపల గడియపెట్టి వుండేది. ఇదేమిటబ్బా తలుపు తీసేవుంది. అనుకుంటూ ఇంటివైపు చూసింది. అవి బార్లా తీసివున్నాయి. ఈ రోజు అమ్మగారు పెందరాళే లేచి వుంటుందిలే అనుకుంది నాగి.

ఇంటిముందు వూడ్చి, కళ్ళాపు చల్లి ముగ్గుపెట్టింది. తర్వాత ఇల్లు వూడవడానికి వుపక్రమించింది. వరండా,

హాలు దాటి బెడ్ రూమ్‌లోకి ప్రవేశించింది నాగి.

ఆ దృశ్యం చూసి కెవ్వున కేక పెట్టింది నాగి. బెడ్ మీద భూదేవి చచ్చిపడివుంది.

నాగి గజగజ వణికిపోతూ భయంతో కేకలు పెడుతూ ఆ ఇంట్లోనుంచి బైటపడింది. నాగి పరిగెత్తుతూ కేకలు పెడుతుంటే మేలుకున్న వాళ్ళతోపాటు, నిద్రపోతున్న వాళ్ళు కూడా హడలిపోయి లేచారు.

"ఏంటే నాగి?... ఏం జరిగిందే?" అని అడిగారు.

నాగికి మనుష్యుల్ని చూడగానే కొంత ధైర్యం వచ్చింది. అయినా కొంచెంసేపటివరకూ మాట్లాడలేక రొప్పుతూ ఆయాసపడింది. ఆమె ముఖం చెమటపట్టింది.

"అమ్మగార్ని ఎవరో చంపేశారు...." అంది వగరుస్తూ.

అంతా ఆశ్చర్యపోయారు. కొందరు భయంతో చూశారు.

"భూదేవినే...."

నాగికి నోట మాటలురాక తల వూపింది. భయపడుతూనే. ఆమెకు గుండె దడ తగ్గలేదు.

ఒక కుర్రాడు రసూల్ పేట పోలీస్ స్టేషన్‌కి సైకిల్ మీద వెళ్ళి భూదేవి హత్యచేయబడిందని రిపోర్టుచేసి వచ్చాడు.

జనం భూదేవి ఇంటిముందు మూగారు. పోలీసులు వచ్చేవరకూ అక్కడే నిలబడి మాట్లాడుకోసాగారు. ఎవరూ లోపలకు వెళ్ళడానికి సాహసించలేదు.

# 6

ఇన్‌స్పెక్టర్ రాజకుమార్, యస్. ఐ. శ్రీనివాస్ తమ బలగంతో వ్యాన్‌లో వచ్చేశారు.

అప్పుడు సమయం ఉదయం ఎనిమిది.

"శవాన్ని మొదటిసారిగా చూసింది ఎవరు?" ప్రశ్నించాడు ఇన్‌స్పెక్టర్ జనంవైపు చూసి.

"ఇదేనండి. శవం చూసి భయపడి పారొచ్చిందండి" అన్నాడొక ముసలాయన నాగిని చూపిస్తూ.

బిత్తర చూపులు చూస్తూ నిల్చుంది నాగి.

"నువ్వేనా?" అన్నాడు ఇన్‌స్పెక్టర్ నాగిని పరీక్షగా చూస్తూ.

నాగికి నోట మాటలు రాక తల వూపింది అవునన్నట్టుగా.

"ఆ ఇంట్లోకి నువ్వెందుకు కెళ్ళావ్ ప్రొద్దున్నే?" ప్రశ్నించాడు ఇన్‌స్పెక్టర్.

"అదా ఇంట్లో పనిచేస్తుందండి" అన్నాడు ముసలాయన.

ఇన్‌స్పెక్టర్ ముసలాయన వంక తీవ్రంగా చూసి "ఆమెకు మాటలు రావా? మూగదా?" అన్నాడు.

"కాదండి ..." అన్నాడు ముసలాయన ముఖం చిన్నబుచ్చుకొని.

"మరికనేం? నువ్వు మాట్లాడకు" అని వార్నింగ్ ఇచ్చాడు.

"చెప్పమ్మా! నీ పేరేంటి?"

"నాగి."

"నువ్వీ ఇంట్లో పనిచేస్తున్నావా?"

నాగి తల వూపింది.

"పద. శవం ఎక్కడవుందో చూపించు" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

నాగి బెడ్‌రూమ్‌లోకి దారితీసింది. ఇన్‌స్పెక్టర్,

యస్.ఐ. ఆమె వెనుకే వెళ్ళారు.

శవం వెల్లకిలా పడివుంది. కళ్ళు తెరుచుకుని చూస్తున్నాయి. నోట్లో బ్రాసరీ ముక్క వుంది. జాకెట్టు చిరిగిపోయి ఒక ప్రక్కగా పడివుంది. చీర వుండచుట్టి మంచానికి ఒక మూలగా వుంది. లోలంగా కాళ్ళక్రింద వుంది.

ఇన్‌స్పెక్టర్ రాజకుమార్ భూదేవి నగ్న దేహాన్ని నఖశిఖ పర్యంతం జాగ్రత్తగా పరీక్షించి చూశాడు.

గొంతు దగ్గర కమిలిపోయి, వుబ్బివుండటంవల్ల ఆమెను ఎవరో గొంతు నులిమి చంపినట్లు గ్రహించాడు. గొంతు పిసుకుతున్నప్పుడు ఆమె పెనుగులాడిందని స్పష్టంగా తెలుస్తూనే వుంది. ఆమె మెడలో ఆభరణాలేమీ లేవు. చెవులకున్న దుద్దులు తీసుకున్నట్లు బోసిగా కనిపిస్తున్న చెవులే సాక్ష్యం చెప్తున్నాయి.

బ్రాందీ సీసా, గ్లాసులు, పదార్థాలు తినేసిన ఖాళీ ప్లేట్లు టీపాయ్‌మీద వున్నాయి. కొంచెం దూరంలో రెండు ఐరన్ కుర్చీలున్నాయి.

గదంతా కలయచూసేసరికి ఇనుప బీరువాకి తాళాలు వ్రేలాడుతూ కనిపించాయి. హంతకుడు బీరువాతీసి అందులో డబ్బు, నగలు వగైరా దొంగిలించాడన్నమాట.

రాత్రి హంతకుడు, హతురాలు ఇద్దరూ మద్యం సేవించారు. కాబట్టి హతురాలికి హంతకుడు సన్నిహితుడై వుండాలి.

వేలిముద్రల నిపుణుడు వేలిముద్రలు తీస్తున్నాడు.

ఇన్‌స్పెక్టర్ రాజ్‌కుమార్, యస్.ఐ. శ్రీనివాస్‌తో తన అభిప్రాయం చెప్పాడు.

"నేనూ అదే అనుకుంటున్నాను సార్!" అన్నాడు

యస్. ఐ.

"నేను నాగినుంచి సమాచారం రాబట్టుతుంటాను. నువ్వీలోగా జనంలోకి వెళ్ళి భూదేవికి ఎవరితో కాంటాక్టు వుందో ఆరాతియ్యి" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

యస్. ఐ. శ్రీనివాస్ జనంలోకి వెళ్ళాడు.

ఇన్‌స్పెక్టర్ రాజ్‌కుమార్ వరండాలోకి వెళ్ళి కుర్చీ తెప్పించుకుని కూర్చున్నాడు. నాగిని పిలిపించాడు. నాగి వచ్చి స్థంభానికి ఆనుకొని నిల్చుంది. ఆమె ముఖంలో భయాందోళనలు తగ్గలేదు.

"నాగీ!...."

"అయ్యా!...."

"నువ్వు ఎంతకాలం నుంచి ఇక్కడ పని చేస్తున్నావు?"

"ఏడేళ్ళయిందయ్యా!"

"వూఁ .... అంటే చాలా కాలంగా నీకు ఈవిడ గురించి తెలుసున్నమాట."

నాగి దానికి సమాధానం ఏమీ చెప్పలేదు. ఆమెకు లోలోపల ఎంతో భయంగా వుంది. తనని ఎక్కడ పోలీస్ స్టేషన్‌కి తీసుకెళ్తారోనని ఆమె భయం. అక్కడ అసహ్యకరంగా ప్రవర్తిస్తారనీ, బట్టలు విప్పదీసి మరీ కొడతారనీ ఆమె వింది. ఆ దుర్గతి తనకెక్కడ పడుతుందోనని ఆమెకు ఆందోళనగా వుంది. భూదేవి చచ్చిపోయిందన్న విచారంకన్నా ఇందులో తన నెక్కడ ఇరికించి చంపుతారోనన్న భయమే ఎక్కువగా వుంది.

"అయితే భూదేవి గురించి అన్ని సంగతులూ నీకు తెలిసివుండాలి. భయపడకుండా చెప్పు. అంతా నిజం చెప్పాలి. అబద్ధం చెప్పావో! నీకు జైలు తప్పదు."

అన్నాడు.

"అయ్యో బాబోయ్!....అబద్ధం చెప్పనండి. అంతా నిజమే చెప్తా!" అని నాగి ఏడ్చింది.

"ఏడవకు. ఎందుకేడుస్తావు? నిన్నేం చేశానని" అన్నాడు.

నాగి కళ్ళు తుడుచుకుంది.

"నువ్వు నిన్న ఆఖరిసారి భూదేవిని ఎప్పుడు చూశావు?"

"ఆరింటికి వచ్చి అంట్లుతోమి పోయానంది. ఇంకా చీకటి పడలేదయ్యా!" అంది నాగి.

"ఆ తర్వాత మళ్ళీ రావటం ఈ రోజు ప్రొద్దున్నే."

"అవునయ్యా!"

"రాత్రి ఎవరొచ్చారో నీకు తెలీదు."

"వుహూ!" అంది నాగి.

"భూదేవి తాగుతుందా?"

"ఆఁ...."

"రాత్రి ఆవిడ ఎవరితోనో కలిసి తాగింది. ఎవరో నువ్వు వూహించగలవా చెప్పు? భూదేవికి ఎవరితో సంబంధం వుంది?" నెమ్మదిగా అడిగాడు ఇన్‌స్పెక్టర్.

నాగి తటపటాయించసాగింది.

"చెప్పు ఫరవాలేదు. నువ్వు చెప్పినట్లు ఎవరికీ తెలియనియ్యం. నువ్వేం భయపడకు" బుజ్జగించాడు ఇన్స్పెక్టర్.

"వెంకటేసు అని ఒకడున్నాడయ్యా!" అంది నాగి.

"ఓహోఁ...." అని తల వూపాడు.

"ఏం చేస్తాడు వాడు?" ప్రశ్నించాడు.

"చేపలు పట్టి భూదేకి అమ్ముతాడు" అంది నాగి.

"వాడికి పెళ్ళయిందా?"

"ఆఁ.... చంద్ర అని ఆడి పెళ్ళాం పేరు."

"అలాగా!....మరి భూదేవికి మొగుడు లేడు సరే! పిల్లలు కూడా లేరా?"

"ఇద్దరాడపిల్లలు."

"ఏరి కనిపించరే?"

"ఇద్దరికీ పెళ్ళిళ్ళయిపోయాయి...."

ఇన్స్పెక్టర్ ఆశ్చర్యపోయాడు. భూదేవి బిగువు సడలని శరీరం చూసి ఆమెకు పెళ్ళయిన ఇద్దరు కూతుళ్ళున్నారని వూహించలేకపోయాడు.

నాగిని మరి కొన్ని ప్రశ్నలు అడిగి పంపేశాడు.

కొంచెంసేపటికి యస్.ఐ. శ్రీనివాస్ వచ్చాడు.

"సార్! ఈ భూదేవికి వెంకటేసు అనేవాడితో సంబంధం వుందట సార్! రాత్రి పది దాటాక తూలుతూ పోతుంటే చూసినవాళ్ళున్నారు" అన్నాడు.

"దట్సాల్ రైట్. వెంకటేసు ఎవడో తెలుసుకుని స్టేషన్ కి పట్టుకురా! క్విక్. వాడు ఇంట్లో లేకపోతే ఇంటికి కాపలా పెట్టు" అని మళ్ళీ ఏదో ఆలోచన వచ్చి "వుండు. నేనూ వస్తాను. శవం పోస్టుమార్టమ్ కి పంపి వెళ్దాం" అన్నాడు.

కొంచెంసేపటికి అంబులెన్స్ వచ్చింది. శవాన్ని హాస్పిటల్ కి పంపించారు.

## 7

వెంకటేసు నిద్రలేచేటప్పటికి ఎనిమిదైంది.

రాత్రి తాగి తందానాలాడటంవల్ల బద్ధకం ఎక్కువై పక్కమీదనుంచి లేవలేకపోయాడు. తీరా లేచి వేపపుల్ల నోట్లో పెట్టుకొని పళ్ళు తోముకుంటుంటే నీళ్ళబిందె నెత్తిన పెట్టుకుని వస్తున్న చంద్ర గుమ్మంముందు ఆగి

"భూదేవి చచ్చిపోయిందంట" అంది.

ఆ మాట విని బాంబు ప్రేలినట్లు అదిరిపడ్డాడు వెంకటేసు.

"ఏంటే ....?" అన్నాడు బిత్తరపోతూ.

"చెప్తే వినపడలా? భూదేవి చచ్చిపోయిందంట" అంది చంద్ర విసుక్కుంటూ.

"ఎప్పుడే?"

"ఏమో? పొద్దునే నాగి ఇల్లూడవడానికి పోతే చచ్చిపడుందట మంచంమీద."

నీళ్ళ బావి దగ్గర జనం చెప్పుకుంటున్న మాటలు విన్నవన్నీ వెంకటేసుకి చెప్పింది చంద్ర.

వెంకటేసుకి మతి పోయింది. భూదేవి చచ్చిపోవటం ఏమిటి? రాత్రి బాగానే వుందిగా? రాత్రి జరిగిన సంఘటన అంతా గుర్తుకొచ్చి అతని గుండెలో రాయి పడింది.

తనకు భూదేవితో సంబంధం వున్న సంగతి అందరికీ తెలిసిందే. తనా కొంపనుంచి వస్తుంటే రాత్రి ఎవరైనా చూసివుండొచ్చు.

భూదేవిని ఎవడో గొంతు పిసికి చంపారని వీధంతా గోలగోలగా చెప్పుకుంటున్నారంటే అతనికి వణుకు పుట్టింది. పోలీసులు వచ్చారనీ అందర్నీ ప్రశ్నలు అడుగుతున్నారనీ తెలిసి నీరసం ముంచుకొచ్చింది.

వెంకటేసు ఇంకా భయంనుంచి తేరుకోక ముందే ఇంటిముందు పోలీస్ వ్యాన్ వచ్చి ఆగింది.

వెంకటేసు శవంలా మారిపోయాడు వ్యాన్ దిగి వస్తున్న పోలీసు బలగాన్ని చూసి. వాళ్ళు అతని కంటికి యమకింకరుల్లా కనిపిస్తున్నారు.

"నువ్వేనా వెంకటేసంటే?" ఇన్‌స్పెక్టర్ కంఠం కర్కశంగా పలికింది.

"నేనే సార్!" అన్నాడు వెంకటేసు.

"వీడికి సంకెళ్ళు వేసి వ్యాన్‌లో పడెయ్యండి" అని ఆజ్ఞాపించాడు.

కానిస్టేబుల్స్ అతనికి సంకెళ్ళు బిగిస్తుంటే వెంకటేసు ఒకటే గోల చేశాడు.

"సార్! నాకేం తెలీదు సార్! నేనేం పాపం ఎరగను."

అతని మాటలు ఎవరూ వినిపించుకోలేదు. వ్యాన్‌లోకి నెట్టారు.

చంద్ర గోడుగోడున ఏడుస్తోంది తన భర్తని వదిలి పెట్టమని.

"ఇల్లంతా సెర్చి చెయ్యండి. నగలు దొరుకుతాయి" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

ఇంట్లో నగలు దొరకలేదు గాని చెక్కపెట్టె అడుగున నల్లటి సూట్‌కేసు, అందులో వందరూపాయల కట్టలూ బైటపడ్డాయి.

ఇన్‌స్పెక్టర్ రాజకుమార్‌కి మతిపోయినంత పని జరిగింది. భూదేవి నగలు దొరుకుతాయేమోనని వెతికితే ఇంత డబ్బు బైటపడిందేమిటి? అన్నీ వంద కట్టలు. దాదాపు తొంభై వేల పైన వుంది. ఇదంతా భూదేవి డబ్బేనా? ఎంత చేపల వ్యాపారం చేస్తున్నా ఆమె దగ్గర ఇంత డబ్బు ఎందుకు వుంటుంది? వ్యాపారం చేస్తున్న మనిషికి బ్యాంకి లావాదేవీలు తెలియవా అంత డబ్బు ఇంట్లో ఎందుకు వుంచుకుంటుంది.

అసలా డబ్బు భూదేవిదేనా? కాకపోతే వీడిదగ్గర

ఎక్కడిది?

స్టేషన్లో వెంకటేసుకి పోలీసు లాఠీల రుచి చూపించాక అసలు సంగతి బైట పెట్టాడు.

"నన్ను కొట్టకండి సార్! నిజం చెప్తాను" అని గోల పెట్టాడు.

"చెప్పు! ఆ డబ్బు నీ ఇంట్లోకి ఎలా వచ్చింది?" హూంకరించాడు ఇన్స్పెక్టర్.

ప్రక్కనే కాన్స్టేబుల్స్ యమభటుల్లా లాఠీలు పట్టుకొని నిల్చున్నారు.

"ఆ డబ్బు నా వలలో పడిన సూట్ కేసులో వుంది సార్! నిజం సార్! దేవుడి తోడు...." అంటూ వెంకటేసు తనకి ఆ రోజు సూట్ కేసు ఎలా దొరికిందీ వివరంగా చెప్పాడు.

"మరి భూదేవి నగల సంగతి ఏమిటి?"

"అయ్యో బాబోయ్! నేను భూదేవిని చంపలేదు. నా కా నగల సంగతి తెలీదు సార్! నన్ను నమ్మండి సార్!" అని వెంకటేసు ఏడవసాగాడు. పోలీసుల లాఠీలు తన వంటిమీద ఎక్కడ నాట్యం చేస్తాయోనని అతనికి హడలుగా వుంది.

"నువ్వు రాత్రి భూదేవి ఇంటికి వెళ్ళావా?"

"వెళ్ళాను సార్!...." అని రాత్రి తమ మధ్య జరిగిన కథంతా చెప్పాడు.

వెంకటేసు ముఖం చూస్తుంటే అబద్ధం చెపుతున్న వాడిలా కన్పించలేదు.

"సరే! నిజం బైటపడక తప్పదు అందాకా కట కటాలు లెక్కబెడుతూ కూర్చో!" అని వెంకటేసుని లాకప్ లో పడేశారు.

"వెంకటేసు ఏడుస్తూ నిజం చెప్తే వదిలేస్తానని అన్నారుగా సార్!" అన్నాడు.

"నువ్వు చెప్పింది నిజం అని రుజువు కావాలిగా! భూదేవిని ఎవడు చంపాడో తేలవద్దా! అందాకా ఆగు" అని నవ్వాడు ఇన్స్పెక్టర్ రాజకుమార్.

# 8

ఇన్స్పెక్టర్ రాజకుమార్ భూదేవి పోస్టుమార్టమ్ రిపోర్టు ముందేసుకుని చూస్తున్నాడు.

యస్.ఐ. శ్రీనివాస్ భూతద్దంలోనుంచి వేలిముద్రలు పరీక్షిస్తున్నాడు, పాత నేరస్థులెవరివైనా టాలీ అవుతాయేమోనని.

భూదేవి రాత్రి పదకొండుకి చనిపోయిందని డాక్టర్ నిర్ధారించాడు. గొంతు పిసకడం వల్ల ఊపిరాడక ప్రాణాలు పోయాయి. ఆమె నోటినుంచి శబ్దం రాకుండా వుండాలని హంతకుడు ఆమె బ్రాసరీని నోట్లో కుక్కాడు. ఆమె గొంతుమీద వేలిముద్రలు బీరువామీద దొరికిన వేలిముద్రలూ ఒకరివే. కాని అవి వెంకటేసువి కావు.

భూదేవి, వెంకటేసుల వేలిముద్రలు గ్లాసులమీద దొరికాయి.

వేలిముద్రలను బట్టి వెంకటేసు భూదేవిని చంపలేదనేది స్పష్టమైపోతున్నది. వెంకటేసు నిర్దోషి. అయితే హంతకుడు ఎవడు?

ఇన్స్పెక్టర్ మనసులో తొలుస్తున్న ప్రశ్న అదే.

తల్లి చనిపోయిన టెలిగ్రామ్స్ చూసుకొని భూదేవి కూతుళ్ళిద్దరూ చేరుకున్నారు. తల్లి చనిపోయినందుకు బాధపడినా, ఆమె హత్య చేయబడటం, నగ్నంగా

వుండటం, వెంకటేసుతో అక్రమ సంబంధం అవన్నీ ఊరంతా తెలిసిపోవటం మరింత బాధ కలుగజేసింది వాళ్ళని. కాని అల్లుళ్ళిద్దరికీ సంబరంగానే వుంది అత్త పోయినా ఆస్తి దక్కినందుకు.

భూదేవి చిన్న కూతురు సరోజ తన తల్లికి వున్న నగల వివరాలన్నీ తెలియజేసింది. ఆమె మామూలుగా మూడు పేటల చంద్రహారం ధరిస్తుందనీ దానిమీద భూదేవి అని తెలుగులోనే అక్షరాలు చెక్కి వున్నాయనీ చెప్పింది. మధ్యలో ఎర్ర రాయి, అన్నీ తెల్లరాళ్ళుగల నెక్లస్ అప్పుడప్పుడూ వేసుకుంటుందని తెలియజేసింది. చెవులకు ముత్యాలు పొదిగిన దుద్దులు వుండాలంది.

"భూదేవిని యెవరు చంపి వుంటారంటావు?" ప్రశ్నించాడు ఇన్‌స్పెక్టర్. యస్.ఐ. శ్రీనివాస్‌ని.

"వెంకటేసు మాత్రం కాదు" అన్నాడు యస్. ఐ. మందహాసం చేస్తూ.

"దటీజ్ క్లియర్" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"సార్! ఇది ఎవడో భూదేవికి తెలిసినవాడే చేసి వుంటాడని నాకు అనిపిస్తూ వుంది. వాడికి వెంకటేసు, భూదేవిల సంబంధం గురించి తెలిసివుండాలి. సమయం కోసం చూసి ఈ అఘాయిత్యం చేశాడని నా నమ్మకం."

"అదీ పాయింటే. డబ్బున్న ఒంటరి ఆడది భూదేవి. ఎందరికో ఆమెపై ఆశ వుండొచ్చు. కాని ఆమెకు వెంకటేసు మీదే మోజు వుంది. ఆ జెలసీతో ఎవరో చంపి వుండొచ్చు" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"భూదేవి సన్నిహితులైన వాళ్ళ వేలిముద్రలు సంపాదిస్తే హంతకుడు దొరికిపోతాడు సార్!"

"దటీజ్ ఆల్సో ఒన్ పాయింట్. ఆ చుట్టుప్రక్కల

మనవాళ్ళని త్రిప్పుతూ వుండు. ఏదైనా బైటపడొచ్చు. అదీగాక బంగారం కొనే మార్వాడీలకు భూదేవి నగల వివరాలు అందజెయ్యి. ఎవడైనా అమ్మడానికి రావచ్చు. అలాగే బ్యాంకులకు గూడా! తాకట్టు పెట్టి పబ్బం గడుపుకోవడానికి ప్రయత్నించవచ్చు."

యస్. ఐ. శ్రీనివాస్ తల వూపాడు ఇన్‌స్పెక్టర్ సూచనలు వింటూ.

"నేను యస్పీ సాబ్‌ని కలుసుకోవడానికి వెళుతున్నాను. వెంటనే రమ్మని మెసేజ్ వచ్చింది. నేను వచ్చేలోపల ఈ కేసు ఒక దారికి తీసుకురా!"

"యస్సార్!" అని యస్. ఐ. గేటువరకూ ఇన్‌స్పెక్టర్ వెంట నడిచాడు.

భూదేవి కేసు గురించి మాట్లాడుతూనే జీప్ ఎక్కాడు ఇన్‌స్పెక్టర్.

జీప్ కదలగానే యస్. ఐ.తో పాటు హెడ్, కానిస్టేబుల్స్ సెల్యూట్ కొట్టారు.

## 9

యస్పీ చాంబర్‌లో అంతా నిశ్శబ్దంగా వుంది. యస్పీగారు తన సీట్లో కూర్చుని మాట్లాడుతున్నాడు.

"రోజు రోజుకీ నేరాలు పెరిగిపోతున్నాయి. హత్యలు, మానభంగాలు సరేసరి. రికార్డు స్థాయిలో జరుగుతున్నాయి. అందులో దొంగతనాలు, దోపిడీలు ఎన్నో కొత్త తరహాలో చేస్తున్నారు. జరిగేవరకూ అది దొంగతనం అని ఎవరూ తెలుసుకోలేరు. అటువంటి గమ్మత్తు కేసు గురించి ఇప్పుడు వివరిస్తాను" అని యస్పీ ఒక కేసు చెప్పసాగాడు.

"క. క. ఫైనాన్స్ కార్పొరేషన్ గురించి మీకు

అందరికీ తెలుసు. దాని హెడ్ క్వార్టర్స్ కొచ్చిన్‌లో వుంది. సౌత్ ఇండియా లో అన్ని టౌన్స్‌లోనూ బ్రాంచీలు వున్నాయి. నార్తులోగూడా ముఖ్యమైన పట్టణాలలో బ్రాంచీలు నడుస్తున్నాయి.

ప్రజల దగ్గర్నుంచి డిపాజిట్స్ తీసుకుని బ్యాంకుల కన్నా ఎక్కువ వడ్డీ చెల్లించటం కె.కె. ఫైనాన్స్ కార్పొరేషన్ ప్రత్యేకత. బాగా ప్రచారమూ, పేరూ వున్న కంపెనీ అవడం వల్ల ప్రజలు నిర్భయంగా డిపాజిట్స్ చేస్తుంటారు. ప్రతి బ్రాంచిలోనూ రోజూ లక్షకు తక్కువకాకుండా డిపాజిట్స్ వస్తున్నాయంటే ఆ కంపెనీ పలుకుబడి అంచనా వేసుకోవచ్చు.

కె.కె. ఫైనాన్స్ కార్పొరేషన్ బ్రాంచి మన టౌన్ లోనూ వుంది. దీని మేనేజర్ ముత్తురామన్ అసాధ్యుడు. అతను కొన్ని నిధులు స్వాహాచేస్తున్నాడనీ, లంచాలు తిని తగిన సెక్యూరిటీ లేని ఫ్యాక్టరీలు వగైరాలకు అప్పులు మంజూరు చేస్తున్నాడనీ పుకారు వుంది.

ఒకరోజు సాయంకాలం నాలుగు ప్రాంతంలో అంటే బిజినెస్ అవర్స్ ముగుస్తూ వున్న టైంలో ఆఫీసు ముందు ఒక అంబాసిడర్ కారు ఆగింది. అందులోనుంచి ఫుల్ సూట్‌లో వున్న ఒక వ్యక్తి దిగాడు. ఆరడుగుల ఎత్తు, ఎత్తుకు తగ్గ లావు వున్న ఆ వ్యక్తే స్వయంగా డ్రైవ్ చేసుకుంటూ రావడం గేటు దగ్గర వాచ్‌మాన్ చూశాడు.

జేబులోనుంచి విజిటింగ్ కార్డు తీసి మేనేజర్ గదిలోకి పంపాడు. అది చూసి మేనేజర్ చెమటలు కక్కుకుంటూ వచ్చాడు, "సార్!.... వెల్‌కమ్ సార్!" అంటూను.

ఇంతకీ ఆ విజిటింగ్ కార్డులో ఏమి వున్నది? 'యమ్. యన్. నాయుడు, ఇన్‌స్పెక్టింగ్ ఆఫీసర్, కె. కె. ఫైనాన్స్ కార్పొరేషన్, కొచ్చిన్.'

లైన్ ఇన్‌స్పెక్టరైతే ఫరవాలేదు. రికార్డులు తనిఖీ చేసి రిమార్క్స్ వుంటే రాసుకొని పోతాడు. కాని ఇన్‌స్పెక్టింగ్ ఆఫీసర్‌కి తిరుగులేని అధికారాలు కట్టబెట్టింది కంపెనీ. అతను అవసరం అనుకుంటే రికార్డు సీజ్ చేసి వెంటతీసుకొని పోవచ్చును. మేనేజర్ని అయినా వెంటనే సస్పెండ్ చేసి అసిస్టెంట్‌కి చార్జి ఇప్పించి పోవచ్చును. అందుకే మేనేజర్ వణుక్కుంటూ వచ్చి నాయుడికి స్వాగతం పలికాడు.

అతిథి సత్కారాలు అయ్యాక నాయుడు ఇలా అన్నాడు.

"ఐ వాంట్ ఆల్ ది రికార్డ్స్ ఫర్ ఇన్‌స్పెక్షన్. విత్ ఇన్ హాఫెనవర్ దే మస్ట్ బి టూ మై హేండ్స్."

ఆ మాటలు విని మేనేజర్ వణుక్కుంటూ సెక్షన్ లోకి పోయాడు. స్టాఫ్ మొత్తానికి తెలిసిపోయింది ఇన్‌స్పెక్టింగ్ ఆఫీసర్ వచ్చాడని.

ముఖ్యంగా ఎక్కౌంటెంట్‌కి మతిపోయింది. వారం రోజుల్నుంచి ఎక్కౌంట్ క్లోజ్ చేసిన పాపానపోలేదు. ఆ సంగతి మేనేజర్‌కి తెలుసు. చెయ్యవలసిన సర్దుబాట్లు పూర్తికాలేదు గనుక ఎక్కౌంట్ క్లోజ్ చెయ్యలేదు. అరగంటలో పూర్తిచెయ్యటం, దానికి క్యాష్ బేలన్స్ సరిపోవటం జరిగే పనికాదు.

మేనేజర్ వెనుకే ఇన్‌స్పెక్టింగ్ ఆఫీసర్ నాయుడు సెక్షన్‌లోకి వచ్చాడు స్టాఫ్ అంతా నిటారుగా నిలబడి పోయి వెర్రి మొఖాలేసుకొని చూస్తుండిపోయారు.

నాయుడు అన్ని సెక్షన్స్‌లోకి వెళ్ళి ఎకౌంట్స్ రెడీ చెయ్యమన్నాడు. లోపల గదిలో కూర్చున్న క్యాషియర్‌ని డబ్బు ఎంతవుందో అరగంటలో తేల్చి చెప్పాలని హెచ్చరించాడు.

తర్వాత మేనేజర్ రూమ్‌లో కూర్చుని అతన్ని రకరకాల ప్రశ్నలతో చిత్రహింస పెట్టసాగాడు.

ఇటువంటి కఠోర పరీక్షలు ఎలా ప్యాసవ్వాలో మేనేజర్‌కి తెలుసు. పై అధికార్లకి ఎటువంటి మర్యాదలు చేసి గండం గడిచేటట్లు చెయ్యాలో ఆమాత్రం అనుభవం వుంది మేనేజర్‌కి. కాని ఆ వ్యక్తి శ్రీరామచంద్రుడయితే బెడిసికొడుతుంది. గ్రంథసాంగుడైతే ఏ గొడవలూ రావు.

"సార్ తవరెక్కడ బసచేశారు?" వినయంగా ప్రశ్నించాడు మేనేజర్.

"బసతో పని ఏముంది? నేను రికార్డులు తనిఖీ చేసి వెళ్ళిపోతాను. రేపు మరొక స్టేషన్‌లో ఇన్‌స్పెక్షన్ చేయాలి. వెళ్ళిన ఊళ్ళో బసచేస్తూ కూర్చుంటే ఎలా?" అని నాయుడు మందహాసం చేశాడు.

అప్పటివరకూ సీరియస్‌లో మండిపోతున్న నాయుడి ముఖం ప్రసన్నం అవడం గమనించి మేనేజర్ పుంజుకున్నాడు.

"అమ్మమ్మా!....తమరలా సెలవియ్యకండి. ఎక్కడ బస చెయ్యకపోయినా ఇక్కడ ఒక్క రాత్రి బసచేసి తీరాలి. మేనక హోటల్లో తమకి రూమ్ రిజర్వు చేస్తాను, సరికొత్త హోటల్ సార్! ఏ. సి. సూట్స్ అన్ని మర్యాదలూ వుంటాయి. అంతా ఏ వన్ క్లాస్ సార్. ఒక్క రాత్రి తమరా హోటల్లో గడిపితే జన్మలో

మర్చిపోరు" అన్నాడు మేనేజర్.

నాయుడు ముందు ముగమాట పడిన తర్వాత ఆ రాత్రికి మేనక హోటల్లో బస చెయ్యడానికి ఒప్పుకున్నాడు

ఇక మేనేజర్ బయల్దేరాడు మేనక హోటల్ కి తను స్వయంగా నాయుడికి మర్యాదల ఏర్పాట్లు చెయ్యడానికి. ఆ సంగతి అసిస్టెంట్ కి చెప్పి వెళ్ళాడు.

మేనేజర్ ఆఫీసులోనుంచి బైటపడిన పావుగంటకి నాయుడు రుద్రావతారం ఎత్తి సెక్షన్ లోకి వచ్చాడు.

"ఎక్కౌంటెంట్ క్లోజయిందా?" అని ఎక్కౌంటెంట్ ని అడిగాడు. ఎక్కౌంటెంట్ నీళ్ళు నమిలాడు.

చూసే ఏముంది? వారం నుంచి ఎక్కౌంట్ క్లోజ్ చెయ్యనే లేదు.

నాయుడు రెచ్చిపోయాడు. అందర్నీ డిస్మిస్ చేసి పారేస్తానని ఎగిరాడు. ఎకౌంట్ బుక్స్ సీజ్ చేశాడు. వాటిని సూట్ కేసులో పెట్టాడు.

అదంతా చూసి అసిస్టెంట్ మేనేజర్ కి గుండె దడ హెచ్చింది. మేనక హోటల్ కి ఫోన్ చేసి మేనేజర్ ని పట్టుకుని జరిగినదంతా చెప్పాడు. తను వెంటనే వస్తున్నానని మేనేజర్ సమాధానం చెప్పాడు.

నాయుడు ఆఫీసులోనుంచి బైటపడి అంబాసిడర్ కారులో డ్రైవింగ్ సీట్లో కూర్చున్నాడు. సూట్ కేస్ అతని ప్రక్కనే పెట్టుకున్నాడు. కారు స్టార్టు చేసి శర వేగంతో వూరి చివరకు చేరుకున్నాడు.

నడిమీద వంతెన దాటుతూ వుండగా నాయుడు వీపుమీద కత్తి గుచ్చుకుంది. మరుక్షణం "హేండ్స్ అప్" అనే మాటలు వినిపించాయి.

నాయుడు సడన్ బ్రేక్‌తో కారు ఆపి చేతులు ఎత్తి తిరిగిచూశాడు. వెనుక సీట్లో మేనేజర్ వున్నాడు. అతని చేతిలో కత్తి వుంది.

"యూఁ.... ఫూల్...." అని నాయుడు ఏదో అన బోయాడు.

మేనేజర్ పకపక నవ్వి, అతని ప్రక్కనే వున్న సూట్‌కేస్ అందుకొని వంతెన పైనుంచి నదిలోకి విసిరేశాడు. తర్వాత నాయుడు నెత్తిమీద దుడ్డుకర్రతో ఒక్కటి ఇచ్చుకున్నాడు. నాయుడికి స్పృహ తప్పింది. మేనేజర్ కారు దిగిపోయాడు. నాయుడు ఆఫీసు రికార్డు తీసుకొని పోతే తనతోపాటు కొందరి వుద్యోగాలు పోతాయనీ, జైలుకి గూడా పోవాల్సి వస్తుందనీ తెలిసి మేనేజర్ ఆ సాహసం చేశాడు. కాని అక్కడే పప్పులో కాలేశాడు."

యస్పీ చెప్పడం ఆపి, అందరి ముఖాల్లోకి చూశాడు. ఎవరూ మాట్లాడలేదు.

"ఆ సూట్‌కేసులో రికార్డ్సు లేవు. నాయుడు ఆ సూట్‌కేస్ క్యాషియర్ దగ్గర పడేసి, క్యాషియర్ దగ్గరున్న సూట్‌కేస్‌లో డబ్బు సర్దుకున్నాడు. క్యాషియర్‌కి క్లోరోఫామ్‌తో తెలివి తప్పేట్లు చేశాడు. క్యాషియర్ గదిలో జరిగిందేమిటో స్టాఫ్ ఎవరికీ తెలియదు. రికార్డ్సుకోసమే నాయుడు వెళ్ళాడని అనుకున్నారు. సో.... జరిగిందేమిటంటే లక్ష రూపాయలున్న సూట్‌కేసుని మేనేజర్ నదిలోకి స్వయంగా విసిరేశాడు. ఆ నాయుడొక దొంగని ఆ తర్వాత అందరికీ తెలిసింది." యస్పీ చెప్పటం ముగించాడు.

ఇన్‌స్పెక్టర్ రాజకుమార్ లేచి నిల్చుని "సర్ ...."

అంటూ ఏదో అడగబోయాడు.

"నువ్వు అడగబోయేది ఏమిటో నాకు తెలుసు. ఆ నూట్ కేసే చేపల వలలోపడి వెంకటేసుకి దొరికింది" అని చిరునవ్వు నవ్వాడు యస్పీ.

• • •

ఇన్ స్పెక్టర్ రాజకుమార్ తిరిగి వచ్చేసరికి స్టేషన్ లో సందడిగా వుంది.

"సార్! భూదేవిని మర్డర్ చేసిన హంతకుడు దొరికాడు. ఆమె దగ్గర లెక్కలు చూసే గుమస్తా యోగయ్య అనేవాడే హత్యచేశాడు" సంతోషంతో చెప్పాడు యస్. ఐ.

"వెరీ గుడ్! అట్లాగే వెంకటేసు వలలో పడిన డబ్బు కూడా ఎవరిదో తెలిసిపోయింది. కె.కె. ఫైనాన్స్ కార్పొరేషన్ వాళ్ళది" అంటూ నవ్వాడు ఇన్ స్పెక్టర్ రాజకుమార్.

—:ఐ పో యిం ది:—

# జరుగవలసిన హత్య

## సికిందర్

లాల్ ఆఫీసులోకి అడుగు పెడుతూ, విసుక్కుంటున్న జాన్‌ని చూసి, "వాట్ హేపెండ్? ఏమిటీ అవతారం?" అన్నాడు.

"నాకో కోపం వస్తోంది, లాల్!"

"ఎందుకొస్తోంది?"

"ఇతను— ఈ పార్టీ ఎవరో వేధిస్తున్నాడు నన్ను? నిమిషానికోమారు ఫోన్ చేస్తూ చంపుతున్నాడు! పేరు చెప్పడు, పని చెప్పడు, నువ్వే కావాలట, నీతో తప్ప మాట్లాడడట. అయితే నువ్వొచ్చేవరకూ ఆగమంటే వినడు. నువ్వొచ్చాక నేనే పిలుస్తాను నెంబరివ్వమంటే ఇవ్వడు. అరగంటలో తొమ్మిదిసార్లు పిలిచాడు— నువ్విప్పుడు రాకపోతే— నేనేం చేసే...."

"ఎలా వున్నాడతను?"

"నాకేం తెలుసు? నాకు దివ్యదృష్టి వుందా?"

"ముందు ముఖం దివ్యంగా వుంటేగా? నేననేది

కంగారుగా వున్నాడా అని—"

"ఉన్నట్లే తోచాడు."

"గొంతెలా వుంది?"

"బర్ర గొంతు, కరకరలాడాడు, మరమరాలు తింటున్నట్టు."

"ఎక్కణ్నుంచి పిలుస్తున్నాడు — ఇంటినుంచా? ఆఫీసు—"

"ఇంటినుంచే."

"ఎలా అంటున్నావు?"

"నాలుగోసారి, ఆ తర్వాత ఆరోసారి ఫోన్ చేసినప్పుడు ప్రక్కనుంచి మరో గొంతు కూడా విన్పించింది. ఆడ గొంతు. అతని భార్య గొంతు. అంటే ఇంటినుంచే కదా? ఆమె అభ్యంతరం పెడుతోంది? వద్దండీ, మనకీ పోలీసులూ, డిటెక్టివ్‌లూ వద్దు, నా మాట వినండి.... అంటూ. కానీ అతను విన్పించుకోవటంలేదు, మొండిగా చేస్తూనే వున్నాడు ఫోన్."

లాల్ కూర్చుంటూ అన్నాడు. "వెల్, భార్యకిష్టంలేని పని చేస్తున్నాడన్నమాట!"

జాన్ తలవూపాడు, "చాలామంది చేస్తారు."

"కొన్నిసార్లు చింతిస్తారు."

"చింతించే హక్కు ఎవరికైనా వుంది లోకంలో."

"నీకు లేదు ఈ ఆఫీసులో! ముఖం తిన్నగా పెట్టుకో! మన ఏజన్సీ బాగుపడాలంటే శాంతం, సహనం అవసరం యూ ఫూల్!"

ఫోన్ మోగింది.

లాల్ ఫోన్ ఎత్తి, "యస్, లాల్ హియర్" అన్నాడు మృదువుగా, "నా పార్టనర్‌ని విసిగిస్తున్నది

మీ రేనా?"

"అవును. అయాం సారీ, మిస్టర్ లాల్...."

"నెవర్ మైండ్. మీరు మరొక్కసారి పిలిచివుంటే నా పార్ట్నర్ పారిపోయేవాడు. ఆ తర్వాత పేపర్లో ప్రకటన వేయించవలసి వచ్చేది...."

"షటప్!" కసిరాడు జాన్.

"మిస్టర్ లాల్, నేను డాక్టర్ సురేష్ని. మీతో మాట్లాడాలి...."

"మాట్లాడండి."

"ఇలా కాదు. మీతో పర్సనల్ గా...."

"ఇక్కడకొచ్చేయండయితే."

"అక్కడెవరూ ఉండరుకదా?"

"నా పార్ట్నర్ వుంటాడు. అతను నాతో అన్నీ ఫిఫ్టీ-ఫిఫ్టీ పంచుకుంటాడు. మీరేమీ వెనుకాడనవసరం లేదు.

"అయితే వెంటనే వచ్చేస్తున్నాను...." క్లిక్ మంది అవతల.

లాల్ రిసీవర్ పెట్టేస్తూ, "సురేష్ వస్తున్నాడు, డాక్టర్ సురేష్" అన్నాడు.

"డాక్టర్ సురేష్?" అడిగాడు జాన్.

"యస్, పార్ట్నర్. యంగ్ డాక్టర్. కొత్తగా ప్రాక్టీసు పెట్టివుంటాడు, లేదా ఉద్యోగంలో చేరి వుంటాడు. అప్పుడే మొదలయ్యాయి కష్టాలు....అవి వృత్తిపరమైనవో, గృహ సంబంధమైనవో తెలియదు. ఇంట్లో అందమైన భార్య వుందన్నావు కదూ?"

"అవును, నీకెందుకు?"

"అపార్థం, పార్ట్నర్, అపార్థం జేసుకోకు. ఆమె

అభ్యంతరం పెడుతుందన్నావు. అంటే కష్టాలు ఆమెవల్ల కాకపోవచ్చు. లేక ఆమె ఏదైనా ఆపదలో ఇరుక్కుని ఇప్పుడిప్పుడే ఇంటికి వచ్చి వుండొచ్చు. ఆ ప్రతీకారంతో శత్రువుమీద అత నిప్పుడు ..."

"ఆమె కేమిటి ఆపద, పార్టనర్?"

"వెల్, ఈ కాంపిటీషన్ కైపులో పడి కొందరు కాని పనులు చేస్తుంటారు. ఇప్పుడు డాక్టర్లమధ్య పోటీ ఎంతగా పెరిగిపోయిందో చూస్తూనే వున్నావు. ఎదుటి వాడు బాగుపడుతోంటే కొందరు చూసి ఓర్వలేరు. ఆ ఓర్వలేని తనంతో ఓ మహానుభావుడైన డాక్టర్, తన కాంపిటీటర్ని దెబ్బతీయాలనే తలంపుతో, అతని భార్యని అపహరించి—తిరిగి కొన్నాళ్ళ తర్వాత ఇంటికి పంపి ఆ కాంపిటీటర్ వృత్తినీ, పరువునీ మంటగలిపిన కేసు ఒకటి నేను ప్రత్యక్షంగా చూశాను."

"ఇది అలాంటి కేసంటావా?"

లాల్ ఏదో అనబోయాడు.

తలుపు దగ్గర అలికిడైంది.

ఇద్దరూ అటువైపు చూశారు. ఓ ముప్ఫై ఏళ్ళ యువకుడు వేగంగా లోనికొస్తూ అన్నాడు, "హలో, గుడ్ మార్నింగ్. నేనే డాక్టర్ సురేష్ని. మిష్టర్ లాల్, మీరు సుభాష్ని అరెస్టు చేయాలి!"

"మీరు కూర్చోండి" అన్నాడు లాల్.

అతను కూర్చున్నాడు. లాల్ అతన్ని తేరిపార చూశాడు. "సుభాష్ ఎవరు?"

"వాడొక రౌడీ, క్రూక్, క్రిమినల్! వాడ్ని అరెస్టు చేయండి మీరు!"

"అరెస్టు మేం చెయ్యం. పోలీసులు చేస్తారు."

"వాళ్ళతోనే చేయించండి! వాడ్ని తక్షణం పట్టుకోండి!"

"ఏం చేశా డతను? ఎక్కడుంటాడు?"

"ఎక్కడుంటాడో తెలియదు. వాడు మా బాబుని కిడ్నాప్ చేశాడు."

"ఐ.సీ....మీ బాబు కెన్నేళ్ళు?"

"ఎనిమిది నెలల పసివాడు!"

"ఓహ్, ఎప్పుడు జరిగింది కిడ్నాప్?"

"నిన్న సాయంత్రం! బాబు క్షేమంగా దొరికాడు నిన్న రాత్రి!"

"అయితే శుభాంతమైందన్నమాట! మళ్ళీ ఈ కవ్వింపు లెందుకు?"

"తిరిగి నా డబ్బుని రాబట్టుకు నేందుకు!"

"ఎంత పోయింది?"

"పది వేలు!"

"కాని ఇది మీ మిసెస్ కిష్టంలేదనుకుంటాను?"

"దాని మొహం, ఆమెకు భయం. ఆమెకు బిడ్డ కావాలి. దక్కాడు. నా కిప్పుడు నా డబ్బు దక్కాలి. ఆమె భయాలు అర్థంలేనివి. బిడ్డ ప్రాణాలకి మోసం లేదిప్పుడు...."

"అసలెలా జరిగింది?"

సురేష్ అన్నాడు. "నిన్న సాయంత్రం నేను క్లినిక్‌లో వున్నాను, మిస్టర్ లాల్. రేవతి ఫోన్ చేసింది అయిదు గంటలకి. విశాల్ — మా బాబు కన్పించటం లేదంది కంగారుపడిపోతూ. మా ఇల్లు అశోక్‌నగర్‌లో వుంది, మిస్టర్ లాల్, క్లినిక్ కవాడిగూడలో. పది నిమిషాల ప్రయాణం నా స్కూటరుమీద. రెండేళ్ళగా

నేనిక్కడ ప్రాక్టీసు చేస్తున్నాను. వివాహమై కూడా రెండేళ్ళే అయింది. ఇక్కడ మేమిద్దరమే ఉంటున్నాం, మా బాబుతో. ఆమె వాళ్ళూ, నావాళ్ళూ అంతా వరంగల్‌లోనే వుంటున్నారు. ఈ సిటీలో మాకెవరూ బంధువులు లేరు."

లాల్ చెప్పమన్నట్టు తలూపాడు.

"నిన్న సాయంత్రం ఫోన్ చేసింది రేవతి, బాబు కన్పించటంలేదని. అప్పుడామె పరిస్థితి ఏడుపాక్కటే తక్కువగా వుంది. వాడ్ని బెడ్‌రూంలో పడుకోబెట్టి కిచెన్‌లో వుందట తను. కాస్సేపటికి వెళ్ళి చూస్తే అక్కడ లేడట! ఇంట్లో ఎక్కడా లేడంది. ఇల్లు సపరేట్ పోర్షన్, మిస్టర్ లాల్. పొరుగువాళ్ళు వచ్చే అవకాశంలేదు తెలియకుండా. అసలామెకు ఇరుగుపొరుగు పరిచయాలు లేవు. ఇంట్రోవర్టు, మిస్టర్ లాల్. తనేమిటో, తన పనేమిటో, ఆమె తత్వమే అంత.

"విశాల్ కింకా ప్రాకటంరాదు. కాస్త మొద్దురకం. నాలాగే బద్ధకస్తుడవుతాడని బెంగగావుంది. ఇంట్లోకిలా ఎవరొచ్చి వాడ్ని తీసుకుపోతారు చెప్పకుండా? ఇంటికెవరూ రారు రేవతి వున్నప్పుడు. నేనున్నప్పుడు మాత్రం పక్కింటాయన వస్తూంటాడు. మరి బాబుని ఎవరు తీసుకుపోతారు? ముందు తలుపు లోపలినుంచి గడియపెట్టిందట. అయితే బెడ్‌రూంకి తోటలోకి తెరుచుకునే కిటికీవుంది. అది తీసే వుంటుంది. దానికి వూచల్లేవు. మనిషి రావచ్చు. ఆ కిటికీ తప్ప బాబు పోయే మార్గమేలేదు!"

"అప్పుడు మీరేం చేశారు?" అడిగాడు లాల్.

"రేవతి మాటలు విని నేను వెంటనే వెళ్ళడానికి సిద్ధమయ్యాను. ఇంతలో మళ్ళీ ఫోన్ మోగింది. చేసిం

డెవరనుకున్నారు—బాబు నెత్తుకుపోయిన వాడే!"

"ఎవడా రోగ్?"

"మాటలమధ్య తన పేరు సుభాష్ అని చెప్పాడు. నాకు బాగా కావలసినవాడేనని కూడా చెప్పాడు. నాకు మండుకొచ్చింది. వాడి పరిహాసానికి. ఆ పేరుతో నా కెవరూ తెలియదు. బాబు క్షేమంగా తిరిగిరావాలంటే తను కోరిన డబ్బివ్వమన్నాడు. పదివేలు కావాలన్నాడు. రాత్రి పదిగంటలకల్లా ముట్టజెప్పాలన్నాడు.

"డబ్బు బ్రీఫ్ కేసులో పెట్టుకొని—అన్నీ వందనోట్లు కోఠి బస్ టెర్మినస్‌కు రమ్మన్నాడు. బ్రీఫ్ కేసుని బుకింగ్ కౌంటర్ దగ్గర కింద పెట్టేసి, అక్కడే కిందపడుందే ఒక ఖాళీ చార్మినార్ సిగరెట్ పెట్టె అందుకోమన్నాడు. దానిలో సిగరెట్టుండే అట్టమీద బాబు ఎక్కడుంటాడో తెలిపే ఇన్ఫర్మేషన్ వ్రాసి వుంటుందన్నాడు. దాన్ని చదువుకొని చించేసి, వెంటనే బయల్దేరితే, ఆ బ్రీఫ్ కేసులో డబ్బు సరిగ్గా వుంటే, అప్పుడు బాబు దొరుకుతాడన్నాడు. లేకపోతే లేదట."

"వెల్, మీరేం చేశారు?"

"అలాగే చేశాను. బ్యాంకుకు వెళ్ళి డబ్బు డ్రా చేసుకుని ఇంటికెళ్ళాను. ఆ నోట్ల నెంబర్లన్నీ వ్రాసుకున్నాను. ఆ లిస్టు ఇదుగో తెచ్చాను....పది గంటలకి అక్కడకెళ్ళాను. బ్రీఫ్ కేసు అక్కడే పెట్టేసి, సిగరెట్ పెట్టె అందుకున్నాను. దానిమీద 'కాచిగూడ రైల్వే స్టేషన్-వెయిటింగ్ రూం' అని వ్రాసి వుంది తెలుగులో. ఇంకా అక్కడ బాబు ప్రక్కనే ఒక సూట్ కేసు వుంటుందని, దాన్నీ బాబునీ తీసుకుని బయటకొచ్చేసి నేను స్కూటర్ నిలిపిన చోటులో ఆ సూట్ కేసును

వదిలేసి, బాబుతో వెళ్ళిపొమ్మన్నాడు.

"కానీ బాబు సెత్తుకొని స్కూటర్ నడపలేనని వాడికి తోచివుండదు.

"నే నాటోలో వెళ్ళి పని పూర్తిచేసుకొచ్చాను. ఆ ఆటో సెంబర్లు నోట్ చేసుకున్నాను, ముమ్ముందు నాకు సాక్ష్యానికి పనికొస్తాయని. మొత్తం మూడు ఆటోలు మారాను. ఆ సెంబర్లు ఇవిగో....అక్కడ వెయిటింగ్ రూంలో బాబు సోఫామీద నిద్రపోతున్నాడు. వాడికి నిద్రమాత్ర వేశారు. వాణ్ని తీసుకుని నేను వాడు కోరినట్టే చేసి వచ్చేశాను."

"ఆ తర్వాత ఏం జరిగింది.

"ఏమీ లేదు. ఇంటికొచ్చేశాను. బాబుని చూసి రేవతి తేలికపడింది. కానీ నా మనసు మనసులో లేదు. అంత డబ్బు పోయింది! నే కష్టపడి సంపాదించింది...."

ఫోన్ మోగింది అంతలో.

జాన్ రిసీవర్ ఎత్తి రెస్పాన్స్ ఇచ్చి, అవతలి మాటలు ఆశ్చర్యంగా విని, "అలాగే!" అని పెట్టేశాడు. లాల్ ఏమిటన్నట్టు చూశాడు.

జాన్ చెప్పాడు. "మిసెస్ సురేష్‌నుంచి ఫోన్ వచ్చింది. ఆమెకు కిడ్నాపర్ ఫోన్ చేశాడట. వాడు మిస్టర్ సురేష్‌ని కనిపెడుతున్నాడట. తక్షణం ఆయన తన ప్రయత్నాలు మానుకోకపోతే ప్రాణాలతో వుండడట...."

## 2

లాల్ సిగరెట్ వెలిగించి గట్టిగా నాలుగు దమ్ములు లాగాడు. "ఓహో, అయితే నా వూహ తప్పయిందన్న

మాట!"

"ఏమిటి మీ వ్యూహం?" వెంటనే అడిగాడు సురేష్.

"వాళ్ళెప్పుడో రాత్రికే రైలెక్కి చెక్కేశారను కున్నాను."

"వాళ్ళంటున్నారు—అంటే కిడ్నాపర్స్ ఇంకొందరున్నారా?"

"ఉండాలి, తప్పదు. కనీసం ఇద్దరు. అప్పుడే నెర వేరుతుంది. నెంబర్ వన్ — కోఠి బస్ టెర్మినస్ దగ్గర మీనుంచి డబ్బు రిసీవ్ చేసుకుంటాడు. నెంబర్ టూ— కాచిగూడ రైల్వేస్టేషన్‌లో మీ బాబుని మీకు డెలివరీ ఇస్తాడు. బాబుని మీరు ఫలానాచోట పొందవచ్చునని మీకు ముందే చెప్పలేదు. అలా చెప్తే మీకు ఆలోచనలు రావచ్చు. కాబట్టి డబ్బు మీరు డెలివరీ చేసేవరకూ అది మీకు తెలియకుండా వుంచారు. ఆ బస్ టెర్మినస్ దగ్గర మాత్రమే మీ కా సిగరెట్ పెట్టిలో ఇన్ఫర్మేషన్ దొరికింది. కాబట్టి ఆ క్షణంలో మీరు వాళ్ళకి వ్యతిరేకంగా ఏం చేయడానికీ వీలుండదు. డబ్బక్కడ పడేసి బాబుకోసం తిన్నగా వెళ్ళటమే.

"వెల్, అక్కడ డబ్బుకోసం వేచివున్న నెంబర్ వన్ అది సరిగ్గా వుందో లేదో చూసుకొని, అప్పుడు నెంబర్ టూకి ఫోన్ చేస్తాడు; బాబుని డెలివరీ ఇవ్వచ్చనీ, డబ్బు సక్రమంగా వుందనీ. అప్పుడా నెంబర్ టూ బాబుని మీకు చెప్పినచోట వదిలి తప్పుకుంటాడు. కానీ మిమ్మల్ని గమనిస్తూనే వుంటాడు. మిమ్మల్ని సూట్‌కేసుతో బయటికి వెళ్ళమనడంలోని అంతర్యం, ఎవరికీ అనుమానాలు రాకుండా మిమ్మల్నొక ప్రయాణికుడుగా కన్పింపజేయడం.

"ఆఫ్‌కోర్స్, తనకి కూడా వెయిటింగ్ రూంలో ప్రవేశానికి ప్రయాణీకుడిగా అగుపించే అగత్యం ఏర్పడి వుంటుంది, సూట్ కేసుతో వచ్చాడు. లేక అక్కడ్నుంచే తమ పలాయనానికి దాన్ని తెచ్చుకొని వుంటాడు. వెల్, మీ రా సూట్ కేసు, మీ బాబుతో బయటికొచ్చేశారు. సూట్ కేసు అక్కడ పడేసి ఆటో ఎక్కేశారు. అప్పుడా సూట్ కేసును నెంబర్ టూ స్వాధీనం చేసుకున్నాడు. అందులో ఏముందనుకున్నారు?"

"ఏమో.... అది మాత్రం బరువుగా వుంది."

"వాళ్ళ సామాను ప్రయాణానికి. కోతినుండి డబ్బుతో నెంబర్ వన్ రాగానే నెంబర్ టూతో కలిసి ట్రైన్ ఎక్కేశారనుకున్నాను. కానీ వాళ్ళిద్దరు—లేదా వాళ్ళలో ఒక్కడు — ఇంకా యిక్కడే వున్నాడని ఈ ఫోన్ కాల్ వల్ల తెలుస్తోంది.... నెంబర్ టూ ఇక్కడే రైలు ఎక్కేసి వుంటాడు రాత్రి ...."

"ఇప్పుడు నన్నేం చేయమంటున్నారు?"

"కిడ్నాపర్ హెచ్చరిక విన్నారు. ఇప్పటికీ మీకా డబ్బు కావాలా?"

"కావాలి! ఆ డబ్బు నా కష్టార్జితం! నేనింత తేలిగ్గా డబ్బు పోగొట్టుకొనే ఫూల్‌ని కాను!"

"మీ ప్రాణం సమస్య—మీవాళ్ళు సఫరవుతారు."

"నీ ప్రాణానికేం ఢోకాలేదు!"

"అయితే మీరు ఇంటికి బయల్దేరండి."

"బయల్దేరి—?"

"రాత్రి మీరు స్టేషన్ కే డ్రస్సులో వెళ్ళారో అదే డ్రస్సు వేసుకోండి. బాబుని ఇంటికి తెచ్చినప్పుడు అతడే దుస్తుల్లో వున్నాడో సరిగ్గా అవే తొడిగించండి. అప్పుడు

వెంటనే మీ మిసెస్‌నీ, బాబునీ తీసుకొని ఆటోలో ఆ స్టేషన్‌కి చేరుకోండి. వెంట ఓ సూట్ కేసు వుంచుకోండి."

"ఎందుకు? ఇదంతా ఎందుకు?"

"చెప్తాను. స్టేషన్ కెళ్ళి మీకు తోచిన ఏదైనా దగ్గరి ఊరికి టికెట్లు తీసుకోండి. అప్పుడు వెయిటింగ్ రూంలో నాకోసం ఎదురుచూస్తూండండి. నేనొస్తాను. మీ రెంత సమయం తీసుకుంటారు దీనికి?"

"అర—ముప్పావుగంట!"

"గుడ్, మీకంటే ముందే నేనక్కడుంటాను. మీరిక బయల్దేరండి. మీరేం భయపడకండి. కొంచెం రిస్కు తీసుకోవాలంతే."

సురేష్ లేచాడు. "నాకేం భయంలేదు, అలాగే చేస్తాను."

"జాగ్రత్త, బయట మీకోసం కనిపెట్టుకునుండవచ్చు. మీరు భయపడుతున్నట్లు, బెదిరిపోయినట్లు కనిపించాలి. మిమ్మల్ని చూస్తే తన హెచ్చరిక విని ప్రయత్నం మానుకొని ఇంటి ముఖం పడుతున్నట్లు అనిపించాలి. మీరు స్టేషన్‌కి వెళ్తోంటే తన హెచ్చరిక అప్పైటయి పోయి ఊరికెళ్ళి పోతున్నట్లు అనుకోవాలి. మిమ్మల్ని వెంటాడిరావచ్చు. ఏదైనా వాహనం వెంటాడుతున్నట్లు తోస్తే దాని నెంబరు గుర్తుపెట్టుకోండి—ఓ.కే?"

సురేష్ తలూపి బయటికి దారితీశాడు. అతను వెళ్ళి పోయాక లాల్ సిగరెట్ తాగుతూ నిశ్శబ్దంగా వుండి పోయాడు కొన్ని క్షణాలు.

ఆ తర్వాత జాన్‌వైపు తిరిగి అన్నాడు. "నువ్వెళ్ళి బస్ టెర్మినస్‌కి."

జాన్ లేచాడు. "అలాగే, సర్. తమరు సీక్రెట్

మిషన్ మీద పోతున్నారు కాబట్టి, కారు నేను తోలుకు పోతాను. ఏమంటారు, సర్?" అన్నా డతను వంగి వినయంగా.

## 3

లాల్ ఆటోలోనే ఫేర్ చెల్లించేసి, కిందకి దూకి పరుగెత్తాడు బ్రీఫ్ కేసుతో స్టేషన్ లోకి.

కౌంటర్ లో ప్లాట్ ఫాం టికెట్ కొనుక్కుని, గబగబా వెళ్ళాడు ప్లాట్ ఫాం మీదకి. జనంతో కిటకిటలాడిపోతోంది. అతను వెనుకా ముందూ చూడకుండా, జనాన్ని తోసుకుంటూ తిన్నగా వెయిటింగ్ రూంలోకెళ్ళిపోయాడు.

అక్కడా జనంతో నిండుగా వుంది. సీట్లన్నీ ఆక్రమించుకున్నారు. లాల్ ఆ సమూహాన్ని జాగ్రత్తగా కలయజూస్తూ, తెలిసిన ముఖాలు లేకపోయేసరికి, సిగరెట్ వెల్గించుకు తిరిగి బయటికొచ్చేశాడు.

గబగబా ఎంట్రెన్స్ దగ్గరకొచ్చి నిలబడి బయట ఆవరణలోకి చూడసాగాడు. ఎన్నో వాహనాలు వచ్చి ఆగుతున్నాయి, పోతున్నాయి. అయిదు నిమిషాలు ఎదురుచూశాక ఒక ఆటోలోంచి దిగారు సురేష్ వాళ్ళు. లాల్ వెంటనే చాటుకి నక్కి నిలబడి చూడసాగాడు. ఆ ఆటో వెనుక మరే వాహనమూ రాలేదు. వాళ్ళు లోపలకొస్తున్నారు.... కౌంటర్ లో కెళ్ళి సురేష్ టికెట్లు తీసుకున్నాడు. ఆ తర్వాత వాళ్ళు ప్లాట్ ఫాంమీదకి వెళ్ళిపోయారు.

కాస్సేపాగి లాల్ వెళ్ళాడు. వెళ్తూనే వెయిటింగ్ రూంలోంచి అప్పుడే వస్తున్న ఆ టెండర్ ని ఢీకొన్నాడు. తూలి నిలదొక్కుకున్నాడు. ఆ టెండర్ నొచ్చుకుంటూ

చూశాడు. అతనికి ఇరవై ఏళ్ళుంటాయి.

"క్షమించాలి సార్. మాఫ్ కర్ దేనా...."

లాల్ తలూపాడు. "నీతో మాట్లాడాలి పేరేమిటి?"

"నాగరాజ్ సార్, ఏం మాట్లాడాలి?"

"రాత్రి డ్యూటీలో ఎవరున్నారు?"

"నేనే, సార్. పన్నెండుకి దిగిపోయాను. తిరిగి ఆరు కొచ్చాను."

"గుడ్, నువ్వు మనుషుల్ని గుర్తుపట్టగలవా?"

"మనుషులా—ఎవర్ని సార్? మీరెవరు, సార్?"

"డిటెక్టివ్ ని."

"డిటెక్టివ్! డిటెక్టివ్ యుగంధర్!"

"ఎప్పుడూ ఆయన్ని కలవరిస్తూ వుంటావా?"

"ఆయన కేసులు తెగ చదివాను, సార్. మరెవరివీ అంత చదవలేదు."

"ఎందుకు?"

"ఈ సైన్స్ హీరోలొచ్చాక సాహిత్యం చచ్చుబడి పోయింది, సార్. బుర్రకు పదును పెట్టేవి కావాలి."

"మరో కాయన — పడక్కుర్చీలో పైపు కాలుస్తూ. ఎప్పుడూ ఊసుపోక విస్కీ గ్లాసులో ఐస్ క్యూబ్స్ నింపే ఆయన తెలియదా?"

"ఎవరు సార్, ఆయన?"

"వాలి."

"తెలుసు. సార్. ఆయన్నెలా మరిచిపోతాను? ఆయన చెంపమీద కొట్టి రక్తం కక్కిస్తుంటారు...."

"గుడ్, అయితే నువ్వు చాలా గుర్తుపెట్టుకోగలవు, పద!"

లాల్ అతన్ని తీసుకొని లోపలికి నడిచాడు.

హాలులో కుడివైపు ఒక సోఫా దగ్గర నిల్చుని చూస్తున్నారు సురేష్, రేవతి ఆతృతగా. లాల్‌ను చూడగానే సురేష్ గబుక్కున ముందుకొచ్చాడు. లాల్ అతని భుజం తట్టాడు. "డోంట్ వర్రీ, ఇక్కడ మిమ్మల్నెవరూ కనిపెట్టడం లేదు. దార్లో ఎవరైనా వెంటాడారా?"

అతను తల అడ్డంగా వూపాడు. "లేదు, ఎవరూ వెంటాడలేదు!"

"నేను చూశాను" అంది రేవతి ముందుకొచ్చి.

ఆమె వైపు చూశాడు లాల్. పాతికేళ్ళుంటాయి. తెల్లని శరీరచ్ఛాయతో ఆకర్షణీయంగా వుంది. భుజాన పిల్లవాడున్నాడు.

అటెండర్ నాగరాజ్ ఆమెవైపే కన్నార్పకుండా చూస్తున్నాడు. లాల్ అది గమనించి, "ఏం చేశారు?" అనడిగాడు ఆమెని.

"ఒక కారు మమ్మల్ని వెంటాడి వచ్చింది!" అందామె ఉద్రేకంగా.

"ఎక్కడ్నుంచి__ఎందాక?"

"ఇంటి దగ్గర్నుంచి స్టేషన్ వరకూ వచ్చింది. మా ఆటో స్టేషన్ వైపు మలుపు తిరగ్గానే అదలాగే తిన్నగా వెళ్ళిపోయింది...."

సురేష్ అయోమయంగా చూస్తున్నాడు.

"ఏ కారది? నెంబర్ చూశారా?"

"చూశాను. యం.జి.యం. 6385. నల్ల అంబాసిడర్."

"ఏమిటి నువ్వనేది రేవతీ, నువ్వెప్పుడు చూశావు?" సురేష్ అన్నాడు అసహనంగా.

ఆమె ఉరిమిచూసింతదనివైపు. "నేను చూశాను.

కానీ మీకు చెప్పాలనిపించలేదు. లేకపోతే నడిరోడ్డు మీద గొడవచేస్తారు. అసలీ గొడవంతా మనకొద్దని చెప్పాను? వెధవ డబ్బు పోతే పోయింది! బాబు దక్కాడు చాలదా? మనకింకేం కావాలి వీడికంటే? వాడు ఫోన్‌లో హెచ్చరిక చేసినా మీరు లక్ష్య పెట్టడంలేదు. బాబు క్షేమంగా ఉండాలనుందా లేదా మీకు?"

సురేష్ ముఖం ఎర్రబడింది. "నీ పిచ్చి భయాలతో నన్ను విసిగించకు, రేవతీ! నేనేం చేస్తున్నానో నాకు తెలుసు! నీ బాబు నీ దగ్గరే లక్షణంగా వుంటాడు—"

లాల్ అన్నాడు మధ్యలో. "ఇక్కడ మనం వాదించు కోవడానికి రాలేదు. కొన్ని విషయాలు తెలుసు కోవాలి. వాళ్ళు మిమ్మల్ని వెంటాడివుంటే స్టేషన్ వరకూ వచ్చి మీ ప్రయాణాన్ని నిర్ధారించుకొని వెళ్ళి పోయివుంటారు."

"కానీ మీ ఆఫీసునుంచి ఇంటికెళ్ళినప్పుడు ఎవరూ వెంటాడలేదు!"

"సరిగ్గా చూశావా?"

"సరిగ్గా నే చూశాను, నన్నెవరూ వెంటాడలేదు!"

"కానీ మన ఆటోని ఆ కారు వెంటాడింది!" అంది రేవతి.

నాగరాజ్ ఇప్పుడామెని ఇంకా కుతూహలంగా చూస్తున్నాడు.

లాల్ అన్నాడు శాంతంగా. "ఆల్ రైట్ మీరది చూసి వుంటే మీరు చెప్పిన వివరాలు ఉపయోగ పడతాయి. ఇప్పుడసలు విషయంలోకొద్దాం...."

లాల్ ఆమెనుంచి బాబుని తీసుకున్నాడు. అతని

బుగ్గలు నిమిరి, మెరిసే చిన్న కళ్ళలోకి చూస్తూ, "నైస్ కిడ్!" అన్నాడు.

విశాల్ తన బుల్లి పిడికిళ్ళతో లాల్ గడ్డంమీద ఫట్ — చిట్‌మని కొట్టి, చేతులు పైకి విసిరి కేరింతలు కొట్టాడు.

"కొత్తలేసు వాడికెవరి దగ్గరా!" సురేష్ అన్నాడు నవ్వుతూ.

రేవతి ఆందోళనగా చూడసాగింది లాల్ వైపు.

లాల్ విశాల్‌ని పరిశీలించాడు. బ్లూ షెడ్డీ, పసుపు బనియన్‌లో వున్నాడు. లాల్ నాగరాజ్‌కి అతన్ని చూపించాడు.

"చూడు, ఈ బాబుని నువ్వెప్పుడైనా చూశావా?"

అతను వెంటనే తలూపాడు. "చూశాను, సార్. ఈ బాబునీ, వీరిద్దరినీ నిన్న రాత్రి ఇక్కడే చూశాను!"

సురేష్ కలవరపడ్డాడు. రేవతి ముఖం చిట్లించింది. లాల్ విస్తుపోయి చూశాడు. "ఏమిటి నువ్వనేది?"

"అవును, సార్. సరిగ్గా అంటున్నాను. మీరిందాకా మనుషుల్ని గుర్తించాలన్నప్పట్నుంచీ అది వీళ్లే అయియుంటారని పరీక్షగా చూస్తున్నాను. వీళ్ళని ఇదివరకు చూసినట్టే అనిపించింది. వీళ్ళనిప్పుడు గుర్తుపట్టాను సార్, నిన్న రాత్రి ఇక్కడకొచ్చారు."

"ఏమిటి నువ్వనేది?" రేవతి అంది కోపంగా.

నాగరాజ్ చటుక్కున లాల్ వైపు తిరిగాడు. "అవును, సార్. నిన్న రాత్రి పదిగంటలప్పుడు ఈమె ఈ బాబు నెత్తుకొని వచ్చారు. బాబు ఇదే డ్రెస్సులో వున్నాడు. కానీ ఆమె ఆకుపచ్చ చీరలో వున్నారు. చేతిల్లో ఒక సూట్‌కేసు కూడా వుంది, ఆకుపచ్చ

రంగుది. ఆమె గబగబా లోనికొచ్చి ఇక్కడే, ఈ సోఫామీదే బాబుని పడుకోబెట్టి, సూట్ కేసు కింద పెట్టి, టాయ్ లెట్ లోకి వెళ్ళిపోయారు, సార్. బాబు అప్పుడు నిద్రపోతున్నాడు."

"అప్పుడు?"

"అప్పుడు కాస్సేపటికి ఈయన వచ్చారు. ఈయన ఇదే డ్రస్సులో వున్నారు. చాలా ఆందోళనగా వున్నారు. లోపలికొచ్చి అటూ ఇటూ చూసి, ఈ సోఫామీద బాబుని చూడగానే వెంటనే వచ్చి, ఎత్తుకొని, సూట్ కేసు కూడా తీసుకొని బయటికెళ్ళి పోయారు."

"అప్పుడు?"

"అప్పుడు సార్ — అదే క్షణంలో టాయ్ లెట్ లోంచి ఈమె వచ్చారు. వచ్చి, ఆయన వెనకనే గబగబా నడిచారు. అంతే, అలా ఇద్దరూ బయటికెళ్ళిపోయారు. అప్పుడేదో బండి వచ్చింది — అందులో వెళ్ళిపోలేదా సార్, మీరు?"

సురేష్ తికమకగా చూశాడు రేవతివైపు.

ఆమె నాగరాజ్ వైపు తిరిగి అర్చింది. "అబద్ధం! ఏమంటున్నావు నువ్వు? పిచ్చిగా వాగావంటే పళ్ళూడ గొడ్తాను, జాగ్రత్త!"

నాగరాజ్ గాభరాగా లాల్ వైపు తిరిగాడు. "ఇదేమిటి సార్, ఆమె నన్నెందుకు తిడుతున్నారు? మీరు మనుషుల్ని గుర్తించమన్నారు, గుర్తించారు. అది వీళ్ళే! ప్రమాణపూర్వకంగా చెప్పగలను—"

లాల్ అతన్ని జాగ్రత్తగా పంపేసి ఆమెకేసి తిరిగాడు. ఆమె తలవంచుకుంది. సురేష్ అనుమానంగా, అసహ

నంగా చూడసాగాడు.

"వెల్, ఎక్కడో పొరపాటు జరిగింది. మీరు దీన్ని గురించి ఆలోచించకండి. అసలేం జరిగిందో నేను తెలుసుకుంటాను. మీరింటికి వెళ్ళండి—"

"కానీ అటెండర్ — వాడలా ఎందుకు చెప్తాడు? వాడిమాటల్లో ఆత్మవిశ్వాసం వుంది. ఎందుకు చెప్తాడు? యెవరైనా చెప్పిస్తున్నారా?" అడిగాడు సురేష్, రేవతిని తదేకంగా చూస్తూ.

"అలా కూడా జరుగవచ్చు" అన్నాడు లాల్, "నిదానంమీద అన్నీ తెలుస్తాయి, మీరు వెళ్ళండి!"

వాళ్ళు కదిలి వెళ్తూంటే లాల్ సాలోచనగా చూడసాగాడు ఆమెని.

## 4

మధ్యాహ్నం రెండు గంటలకి తిరిగి వచ్చాడు జాన్.

"సర్, మీకోసం విలువైన సమాచారం తెచ్చాను."

"ముందు తిన్నగా మాట్లాడు నువ్వు!" అరిచాడు

"ఓ.కే. పార్ట్నర్, ఓ.కే!" జాన్ కూర్చుని సిగరెట్ వెలిగించుకున్నాడు తాపీగా. "నువ్వరిచి గొంతు పాడు చేసుకోకు, జంతువులు అరుస్తాయి. ఆల్ రైట్ కోఠి బస్ టెర్మినస్. అక్కడి కెళ్ళమన్నావు. నువ్వన్నట్టు నెంబర్ వన్ అక్కడ మనీ కలెక్ట్ చేసుకొని, అది సరిగా వుంటే అప్పుడు నెంబర్ టూకి ఫోన్ చేయాలి. కనుక అతనెక్కువ దూరం పోకుండా ఆ సమీపంనుంచే ఫోన్ చేస్తాడు తక్షణం. కానీ ఆ సమయంలో — రాత్రి పదిగంటల వేళలో—అక్కడ షాపులూ, హోటళ్లూ అన్నీ మూసివుంటాయి. కనుక అతను ఫోన్ చేయడానికి ఇక ఒక్కటే చోటుంది—"

"ఏమిటది?"

"టెలిగ్రాఫ్ ఆఫీసు, మెడికల్ కాలేజి ప్రక్కన అక్కడ్నుంచి మాత్రమే చేయగలదు. అది వందగజాల దూరంలో వుంది. రాత్రి పది గంటలవేళ అంత రష్ వుండదు. అక్కడి టెలిగ్రామ్ క్లర్క్ నిన్న రాత్రి పదీపదికి ఒక వ్యక్తి టెలిఫోన్ బాక్స్ దగ్గరికి నడిచి వెళ్ళటం చూశాడు—"

లాల్ ఉత్సాహంగా చూశాడు, "వెల్?"

"ఆ మనిషి చామన ఛాయ రంగులో వున్నాడు. తెల్లటి డ్రస్సు వేసుకున్నాడు. నల్లకళ్ళద్దాలు పెట్టుకున్నాడు, రాత్రి అయినప్పటికీ. రింగుల జుట్టు. అయిదూ ఎనిమిదీ ఎత్తు. మెడలో బంగారు గొలుసు, చేతిలో బ్రౌన్ బ్రీఫ్‌కేసు, అతనేదో నెంబర్ తిప్పి, కొన్ని క్షణాలు తగ్గు స్వరంలో మాట్లాడాడు తెలుగులో. తర్వాత వెంటనే వెళ్ళిపోయాడు."

"మళ్ళీ చూస్తే గుర్తుపట్టగలడా క్లర్క్?"

"ఆ భరోసా ఇచ్చాడు. అక్కడ్నుంచి నేను తిరిగి బస్ టెర్మినెస్‌కి వచ్చాను. అక్కడ బుకింగ్ కౌంటర్ దగ్గర.... చూశాను. స్వీపర్ ఇంకా ఊడ్చనట్టుంది, ఇవి దొరికాయి చూడు...."

జాన్ చిన్న పొట్లం విప్పి, పసుపు రంగులో వున్న నాలుగు అట్టముక్కలు లాల్ ముందుంచాడు.

లాల్ ఆ ముక్కల్ని వరుసక్రమంలో పేర్చి, వాటి మీద అక్షరాల్ని చదవసాగాడు.

"సురేష్ చింపి పడేసినవి...." చెప్పసాగాడు జాన్. "ఈ మెసేజ్ చదువుకుని చింపేశాడు. దీనిమీద దస్తూరీ వే ఆఫ్ రైటింగ్ చూస్తే, వ్రాసిన వాడి స్వభావం

తెలుసుకోవచ్చు. అక్షరాలు వంకరటింకరగా, గజిబిజిగా దీర్ఘాలూ, కొమ్ములూ ఎగ్గొట్టి, గందరగోళంగా రాశాడు. లైన్లు ఒకదానితో ఒకటి కలిసిపోయాయి. ఇతనికి చదువు రాదనిపిస్తోంది. ఉద్యోగం లేదనిపిస్తోంది. థర్డ్ రేట్ థగ్‌లా వున్నాడు. అంతే, ఈ సిగరెట్ పెట్టెనిబట్టి చార్మినార్ తాగుతాడనిపిస్తోంది. ”

“వెరీ వెల్ జాన్, ప్రొసీడ్!”

“పార్ట్‌నర్, అక్కడ్నుంచి నేను సురేష్ ఇంటి కెళ్ళాను. ఆ కిడ్నాప్ బిజినెస్ నాకు అబ్సర్డ్‌గా తోచింది. పట్టపగలు పిల్లవాడెలా మాయమయ్యాడూ నడివీధిలోంచీ అనే డౌటు నా కొచ్చింది. కిడ్నాపర్ ఎవరూ చూడకుండా గేటు దూకి వచ్చి, బెడ్‌రూం కిటికీలోంచి బాబుని అందుకోవచ్చు. కానీ వీధిలో ఎవరి కంటబడకుండా ఎలా తీసుకుపోతాడు? అఫ్‌కోర్స్, పిల్లవాడు ఏడ్వకుండా స్పృహ పోగొట్టవచ్చు. కానీ ఎత్తుకుపోతూ బయట తిరిగే జనం దృష్టినుంచి తప్పించుకోలేడు. ఒట్టి చేతులతో రావటం లేదు. పిల్లాడ్ని ఎత్తుకొని పోవడం లేదు. ఎంక్వయిరీ జరిగితే మామూలుగా నడిచే జనం ఎందరో వుంటారు. కానీ, ఆ సమయంలో పిల్లాడ్నెత్తుకు పోయినవాడు తానొక్కడే స్ఫురిస్తాడు- అప్పుడు తన ఆనవాలు వెల్లడికావటం ఎంతో సులువు!”

“అవును, అయితే మారువేషంలో వచ్చాడంటావా?”

“నో. తన సొంత ఆనవాలతోనే, సొంత వేషంలోనే అందరూ చూస్తూండగా, బిడ్డని భుజానవేసుకు వెళ్లాడు.”

“వాట్!”

“ఆ వీధిలో కతను పలుమార్లు వచ్చాడట.”

“వాట్!”

"సురేష్ ఇంట్లోకి చాలా సార్లు పోతూ కనిపించాడట."

"వా...."

"పెళ్ళిళ్ళేగిపోకు, పార్ట్‌నర్. కళ్ళు పేలిపోతాయ్. ఆ వీధిలోవాళ్ళకి అతని రాకపోకలు ఇప్పుడిప్పుడే అర్థమవుతోన్నాయట. వాళ్ళంతా సురేష్ భార్య రేవతి గురించి చెడుగా అనుకుంటున్నారు...."

లాల్ ముఖం ఇంకా ఎర్రబడి వుంది. కళ్ళు మూసుకుని భారంగా వూపిరి పీల్చి వదిలాడు.

"వెల్, జాన్. నేనిలాటిదే వూహించాను స్టేషన్‌లో. రేవతి పైకి కనిపించేటంత అమాయకురాలేం కాదు. ఆమె తనని రక్షించుకునేందుకు రాని ఫోన్ కాల్ గురించి భయపెట్టి భర్త ప్రయత్నాలు మాన్పిస్తుంది. తమని వెంటాడని కారు గుర్తుల్ని చెప్పి మనల్ని ఏమారుస్తుంది. ఆమె చాలా తెలివైనది....నువ్వు చెప్పు, ఇంకా ఏం తెలుసుకున్నావు?"

చెప్పాడు జాన్. "ఆ కిడ్నాపర్ ఆనవాలు మన టెలిగ్రామ్ క్లర్క్ చెప్పిన మొగాడి ఆనవాలతో కలుస్తున్నాయి. సురేష్ వీధిలో అలాగే వర్ణించారు. పేరెవరికి తెలియదు. సురేష్ మనకి చెప్పినట్లు సుభాష్ నిజం పేరు అవునో కాదో మనకు తెలియదు. నిన్న సాయంత్రం నాలుగున్నరకి అతను గేటు తీసుకుని లోపలి కెళ్ళాడు యెప్పటిలాగే...."

"అగు జాన్, అతనెంతకాలంనుంచి వస్తున్నాడట ఇంటికి?"

"సుమారు రెండు నెలలనుంచి యెక్కువగా సాయంత్రాలే వస్తాడట. వచ్చి అరగంట వుండి

వెళ్ళాడట. అయితే అతను వచ్చినప్పుడూ, వెళ్తున్నప్పుడూ కూడా ఆమె ఆహ్వానిస్తూగానీ, సాగనంపుతూగానీ బయటికి రాదట.

"మన ఫ్రెండ్ నిన్న అలాగే వచ్చాడు. ఇంట్లో కళ్ళుండగా చూశాడట. తర్వాత వెంటనే పిల్లాడ్నెత్తుకొస్తూ కన్పించాడు ఇంటి వెనుకనుంచి — వీధిలోకొచ్చి గబగబా వెళ్ళిపోయాడట. అలా బజారుకు తీసుకు పోతున్నాడేమో అనుకున్నారట వాళ్ళు. వీధి చివర ఏదో ఆటో ఎక్కేసి వుంటారు. ఆ ఆటో వివరాలు తెలియలేదు.

"బెడ్‌రూం కిటికీ దగ్గర ఈ బట్ దొరికింది— చార్మినార్ సిగరెట్, సగం కాలింది. యెవరో కిటికీ లోంచి నీళ్ళు పారబోసి వుంటారు, ఇది తడిసిపోయింది. వేలిముద్రల క్వశ్చన్ లేదు. దట్సాల్ పార్టనర్. ఇక ముందుకు సాగలేక వెనక్కొచ్చేశాను."

లాల్ సిగరెట్ వెలిగించుకున్నాడు. లేచి కిటికీ దగ్గర కెళ్ళి కిందకి చూడసాగాడు. కాస్సేపయ్యాక చెప్ప సాగాడు....

"వెల్ —ఇప్పుడు కిడ్నాపర్‌ని పట్టుకోవటం తేలిక! కిడ్నాపర్ అని ఏకవచనంలో యెందుకన్నానంటే, ఇందులో ఒక్కడే బయటి వ్యక్తి! నువ్వు చెప్పే మనిషి—సుభాష్ అనుకుందాం. మరో వ్యక్తి మనకు తెలిసిందే—మన క్లయంట్ తరపు మనిషి. అసలిదంతా ఆమె అవసరం గడవడానికి, ఆమె సహకారంతోనే జరిగిందన్పిస్తోంది....

"పార్టనర్, ఇందులో ఆమె పాత్ర ప్రస్ఫుటంగా వుంది. ప్రవర్తన అది స్పష్టం చేస్తోంది. కాబట్టి ఆమె

ద్వారా కిడ్నాపర్ ని పట్టుకోవటం కష్టం కాదంటున్నాను. కానీ మన కాన్ షస్ని ఒప్పించటం కష్టం, జాన్ ఇది ఫ్యామిలీ కేసు. ఆమె గండం గడవడానికి పన్నాయించ బడిన నకిలీ కిడ్నాప్. ఇది వెల్లడైతే ఆమె సంసారం విచ్ఛిన్నమవుతుంది. జీవితం నరకమవుతుంది. ఆఫ్టరాల్ ఆమె ఎవరు? మన క్లయింట్ భార్య. గతంలో చేసిన తప్పులకి ఇప్పుడు గుట్టుగా పరిష్కారం చెల్లించుకుంటే మన అభ్యంతరం దేనికి? ఎవరి గతంతో మనకి పనిలేదు. కావాలని మనం యెవరి క్యారెక్టర్ని నల్గురిలో పెట్టం. మనమిక్కడ ఆఫీసు పెట్టింది కాపురాలు చెడగొట్టడానికి కాదు—

"కాబట్టి జాన్, మనం ఈ కేసును డ్రాప్ చేస్తే మంచిదనిపిస్తోంది."

"కానీ లాల్, ఇందులో కొన్ని కలుపు ముక్క లున్నాయి."

"కలుపు ముక్కలా? ఇదెక్కడి భాష!"

"నా టర్మినాలజీ అంతే. లాల్, ఆమె యెందుకీ పని చేస్తుంది? తన గతాన్ని కప్పిపుచ్చుకోవడాని కను కుందాం. ఎలాటి గతం? ఆమె గతంలో చేసిన తప్పులు అనే కొటేషను ఆధారంగా ఏదో లవ్ ఎఫైర్ అను కుందాం. అప్పుడతను యెవరవుతాడు? ఆమె లవర్. ఇప్పుడు బ్లాక్ మెయిలర్. తరచు ఆమె ఇంటికి అతని రాకపోకల్లోని ఆంతర్యం ఇదే ననుకుంటాను. బెదిరించి డబ్బు గుంజుతున్నాడు. ఈసారి యెక్కువ మొత్తానికి వేధించి వుంటాడు. విధిలేక ఆమె ఈ కిడ్నాప్ ఉపాయం చెప్పి వుంటుంది—ఆ మొత్తాన్ని భర్తనుంచి పొందేందుకు.

"బాగానే వుంది. అవును, అతడ్ని బ్లాక్ మెయిలర్ గా అంగీకరించవచ్చు. కానీ ఆమె ప్రేమికునిగా వూహించ లేదు, లాల్. చదువుసంధ్యలు లేని, అక్షరాలు తిన్నగా రాయలేని సన్యాసి రకాన్ని, డాక్టర్ ని చేసుకోగల వనిత ఏ విధంగానూ మోహించలేదని బల్లగుద్ది చెప్ప గలను.

"కాబట్టి లాల్, అతడామె గతంలో ప్రేమికుడనే థియరీ తీసేద్దాం. ఇప్పుడు మన అపోహాలన్నీ తొలగి పోయాయి కదా, ఆమె క్యారెక్టర్ పట్ల? అటెన్షన్ ప్లీజ్, ఆమెపట్ల నీ తేలికభావాన్ని పారద్రోలు! సాను భూతి చూపించు! ఆమె కష్టాల్లో వుంది, రియల్ ట్రబుల్స్. ఈ బ్లాక్ మెయిల్ ఆమె ప్రేమ వ్యవహారం గురించి సాగటంలేదు. అసలలాటి వ్యవహారం లేదు! మరేదో కారణంగా సాగుతోంది. అదేమంత ఆమె సంసారాన్ని విచ్ఛిన్నం చేయగలంతటిదికాదు. ఇమో షనల్ బ్లాక్ మెయిలింగ్. వూరికే భయపడుతోంది. ఇందులో మన ప్రమేయం ఆమె కేవిధంగానూ ప్రమాద కరమైనది కాదు. రహస్యంగా సంప్రదించి ఆమెనుంచి అసలు విషయం రాబట్టాలి. ఆమెను చూలాగ్గా లాగి బైటపడేయాలి. లేకపోతే నువ్వన్నట్లు ఇప్పటికే విష పురుగు దొలుస్తూన్న సురేష్ తో ఆమె జీవితం—"

ఫోన్ మోగింది.

జాన్ చటుక్కున రిసీవరెత్తాడు.

సురేష్ అన్నాడు అవతలినుంచి. "మిష్టర్ జాన్, రేవతి ఫోన్ చేసింది!"

"ఏమని?"

"వాడు మళ్ళీ ఫోన్‌లో బెదిరించాడట నన్ను చంపుతానని!"

జాన్ నవ్వుతున్నాడు. "ఇంకేమన్నాడట?"

"మేము ఊరికెళ్ళలేదనీ, స్టేషన్‌కెళ్ళి డిటెక్టివ్‌తో సహాకరించామనీ, తన హెచ్చరికను నిర్లక్ష్యంచేశామనీ. అయినా మరో అవకాశం ఇస్తున్నాననీ, ఇప్పుడు తక్షణం నేను ప్రయత్నాలు మానుకోకపోతే రాత్రి పన్నెండు గంటలకి నా హత్య జరుగుతుందనీ అన్నాడట!"

జాన్ మళ్ళీ నవ్వుతున్నాడు.

"ఫోన్‌లో నవ్వకు!" అన్నాడు లాల్.

"ఓ.కే. మిస్టర్ సురేష్, మీరిప్పుడే ప్రయత్నాలు చేయటంలేదు. కిడ్నాపర్‌ని మర్చిపోయారు. డబ్బునీ మర్చిపోయారు. ఏమిటి? మీ క్లినిక్ పనితో బిజీగా వుండండి. మమ్మల్నెప్పుడూ కాంటాక్టు చేయకండి. మేం ఏం చేయాలో ఇవతల చేసుకుంటూ పోతాం."

"అలాగే, ఆ స్టేషన్‌లో యువతి గురించి కనుక్కున్నారా?"

జాన్ తటపటాయించాడు. "ఆ యువతి .... ఆమె రాత్రి ట్రైన్‌లో వెళ్ళిపోయినట్టు తెలిసింది. అటెండర్ మిమ్మల్నీ, మీ మిసెస్‌నీ ఫాల్స్ ఐడెంటిఫికేషన్‌తో కంగారుపెట్టాడు. కొద్దిపాటి తేడాలో రూపాలు కలవవచ్చు. ఉదాహరణకి మా ఇంటి యెదురుగా అచ్చం జయసుధలాగే ఒకామె ఉంటోంది—"

"పెట్టేయ్!" అన్నాడు లాల్.

"ఓ.కే, సురేష్. మీరిక నిశ్చింతగా వుండండి" అన్నాడు జాన్, ఫోన్ పెట్టేస్తూ.

రాత్రి పన్నెండున్నరకి ఫోన్ అదేపనిగా మోగుతోంటే, లాల్ కు మెలకువ వచ్చి రిసీవరందుకున్నాడు.

ఇన్ స్పెక్టర్ కృష్ణన్ అన్నాడు అవతలినుంచి, "మర్డర్, మిస్టర్ లాల్."

లాల్ కి నిద్ర యెగిరిపోయింది. నిటారుగా కూర్చున్నాడు. "ఎవరు?"

"తెలియదు. ఒంటరిగా చచ్చిపడున్నాడు ఇంట్లో. ఇందాకే రిపోర్టందింది ఈ ఇంట్లోంచి కాల్పులు వినిపించాయని. వచ్చి చూస్తే మర్డర్."

"ఎక్కడది?"

కృష్ణన్ అడ్రసు చెప్పాడు.

లాల్ కళ్ళు విశాలమయ్యాయి. "ఇంట్లో యెవరూ లేరా?"

"లేరు. షాట్ విన్పించిన వెంటనే యెవరో ఒకామె పారిపోతోంటే చూశారట. ఆమె గురించి ఇక్కడ ఆసక్తిగా చర్చించుకుంటున్నారు—"

"హంతుడ్ని వర్ణించండి!"

కృష్ణన్ వర్ణిస్తోంటే లాల్ ముఖంలో రంగులు మారిపోసాగాయి.

"ఓ, గాడ్! కృష్ణన్, మేం వెంటనే వస్తున్నాం!" అని రిసీవర్ పెట్టేసి జాన్ ని లేపాడు. "లే, పార్ట్ నర్. శవం పిలుస్తోంది."

జాన్ బద్ధకంగా కళ్ళు తెరిచి చూశాడు. "ఇంత రాత్రా?"

"వాటికి వేళాపాళా వుండదు. రమ్మన్నప్పుడు పోవాలి."

"ఓహ్, ఈ శవాలెప్పుడు సుఖంగా నిద్రపోనివ్వవు కదా—ఛ—మనుషులకి చావనేదే లేకపోతే యెంత సుఖంగా వుండేది మన పని!"

లాల్ పిడికిలితో ఫెడీమని అతని కడుపులో కొట్టి, వెళ్ళి బట్టలు మార్చుకోసాగాడు.

జాన్ కెవ్వున అరిచి లేచి కూర్చున్నాడు.

"కడుపులో కొట్టద్దన్నాను ఫూల్, మందు కక్కేస్తాను!"

"ముందు లేచి రాకపోతే వీపు వాయించేస్తాను!"

"ఓహ్, నువ్వెంత నియంతవి! ఈ ఫాసిస్టు పార్ట్‌నర్ నశించాలి!" అరిచాడు జాన్, అద్దంలో తన ప్రతిబింబాన్ని చూస్తూ.

లాల్ ఫోనెత్తి గబగబా ఒక నెంబర్ డయల్ చేశాడు. కానీ అటువైపునుంచి ఎంతసేపటికీ రెస్పాన్స్ లేకపోవటంతో సాలోచనగా పెట్టేశాడు.

వాళ్ళిద్దరు విద్యానగర్‌లో ఆ ఇంటికి చేరుకొనేసరికి పావుగంట పట్టింది. ఇంటిముందు జనం గుమిగూడి వున్నారు. ఒక పోలీస్ కారూ, అంబులెన్స్ ఆగి వున్నాయి. డిటెక్టివ్‌లు తమ కారు దిగి ఇంట్లోకి నడిచారు.

చిన్న కాంపౌండు ముందు గేటు, లోపల వరండా, మూడు గదులున్న ఇల్లది.

శవం ముందు గది మధ్యలో వుంది నేలమీద. వెల్లకిలా గాకుండా కొంచెం యెడమవైపు వొత్తిగిలి వుంది. నేలమీద రక్తం చిన్న మడుగు గట్టింది. శవం వొంటిమీద లుంగీ, బనియన్ మాత్రం వున్నాయి. మెళ్ళో బంగారు గొలుసు దృష్టి నాకర్షించేలా వుంది.

గుండె ప్రాంతాల గాయమైంది .... ప్రక్కనే ఒక రివాల్వర్ పడివుంది.

"ఎవరితను, మీకు తెలుసా?" కృష్ణన్ అడిగాడు లాల్‌ని.

"సుభాష్...." లాల్ అన్నాడు తలూపి, "ఇతను సుభాష్ కిడ్నాపర్, బ్లాక్ మెయిలర్, బడా క్రిమినల్. ఇతని కోసం ఓ కేసులో గాలిస్తున్నాం....ఇలా తటస్థ పడతాడనుకోలేదు. యెవరు మీరు చెప్పిన ఆ స్త్రీ, ఈ ఇంట్లోంచి పారిపోయినామె?"

కృష్ణన్ బైటకు దారితీసి అక్కడ వరండాలో ఇద్దర్ని చూపించాడు.

"వాళ్ళు చెప్తారు. వాళ్ళది వీధి చివర ఎదురెదురిళ్లు. ఆ సమయంలో బయట బాతాఖానీ వేసుకున్నారు. ఇంతలో యీ ఇంట్లోంచి షాట్, ఆ వెంటనే ఓ యువతి పారిపోతూ తమ ముందునుంచి వెళ్ళటం చూశారు...."

"ఆమె ఎలా వుంది?" లాల్ అడిగాడు వారిలో ఒకర్ని.

"ఆమె మాకు తెలుసు, సార్. చాలాసార్లు ఈ ఇంటికొచ్చింది. కానీ ఆమె యెవరో, పేరేమిటో తెలియదు. ఏం పనిమీద వచ్చేదో కూడా తెలియదు. ఇందాక మా ముందునుంచి ఉరుకులోంటే స్పష్టంగా చూశాం! ఆమె తెల్లగా వుంటుంది. పెద్ద కళ్ళు. తెల్ల చీరలో వుంది—"

"అప్పుడామె చేతిలో ఏముంది?"

"ఏమీ లేదు. ఒట్టి చేతుల్తో పరుగెత్తింది."

"ఆమె రావటం చూశారా?"

"లేదు. మేం అప్పుడే బయటకొచ్చి మాట్లాడుకుం

టున్నాం....”

లాల్, జాన్ వైపు తిరిగాడు. “నువ్విక్కడ చూసుకో! నేను ఒకచోటికి వెళ్లొస్తాను. కృష్ణన్ అడిగితే అంతా చెప్పెయ్, దాచడానికేమీ లేదు....ఆమె స్వయంగా రట్టు చేసుకుంది.”

“ఓ.కే, లాల్” అన్నాడు జాన్.

## 6

ఆమె గేటుతీసి ఆశ్చర్యంగా చూసింది. “మీరా?”

లాల్ తలూపి పరీక్షగా చూశాడు ఆ మసకచీకట్లో ఆమెని. ఆమె తెల్ల చీరలో వుంది. ముఖంలో గాభరాతనం కొట్టొచ్చినట్లు కన్పిస్తోంది. ఆమె కళ్ళలో బెదురు స్పష్టంగా అగుపిస్తోంది.

“మీవారెక్కడ?” అడిగాడు లాల్.

“నిద్రపోతున్నారు” అందామె తటపటాయిస్తూ.

“మీ బాబు?”

“నిద్రపోతున్నాడు.”

“మీరేం చేస్తున్నారు?”

“నేను — నేను నిద్రపోతున్నాను.” ఆమె గొంతు వణికింది, “ఇప్పుడు టైమెంతైంది? ఇంత రాత్రి మేల్కొనివుండే అలవాటు నాకు లేదు.”

“సారీ, మిమ్మల్ని ఇబ్బందిపెట్టినందుకు, నేను మీ వారికోసం వచ్చాను. ఇందాక ఫోన్ చేస్తే ఎవరూ పలుకలేదు.”

“ఫోన్ చేశారా?”

“అవును, కానీ మీ ఇంట్లో ఎవరూ యెత్తలేదు.”

“ఫోన్ మోగలేదు. మీరెలా అంటున్నారు.... ఫోన్ రింగయితే మెలకువ రానంత మొద్దునిద్ర కాదు

నాది!"

"మీ వారిది—?"

"ఆయన—ఆయన కూడా లేస్తారు."

"మరి ఇప్పుడెందుకు లేవలేదు?"

"ఏమో తెలియదు. మీ రసలు ఫోన్ చేశారా?"

లాల్ నవ్వాడు, "చేశాను, మాడమ్. అర్ధరాత్రి వచ్చి మీతో అబద్ధాలాడే దుర్బుద్ధి నాకు లేదు. జనం అపార్థం చేసుకుంటారు. నేను ఫోన్ చేశాను. కానీ మీరు ఇంట్లో లేనందువల్లా, మీవారు మత్తు నిద్రలో ఉండటం వల్లా రెస్పాన్స్ రాలేదు."

ఆమె ఉలిక్కిపడింది. "ఏమిటి మీరంటున్నది?"

"మీ వారిని లేపండి."

"ఆయన లేవరు."

"ఎందుకు లేవరు?"

"నాకు తెలియదంతే!"

"మీరింత నిర్లక్ష్యంగా జవాబు చెప్పలేరు!"

"నేను చెప్పనంతే!"

"సరే, మీ బాబుని ఓసారి తీసుకురండి."

"వాడెందుకు?"

"లుక్ మిసెస్ రేవతి, మీరు బెట్టు చేయకండి. మీ బాబుని తీసుకురండి, లేదా నన్ను లోపలికి రానివ్వండి. అవతల మర్డర్ జరిగింది. ఎవరనుకున్నారు? మీ బ్లాక్ మెయిలర్. చేసిందెవరనుకున్నారు? ఆ బజార్లో అంతా మీ ఆనవాలే చెప్తున్నారు. అదెలా సంభవమంటారు? మీరిక్కడ మీ వారికీ, మీ బాబుకీ నిద్రమందు కలిపిచ్చి, మీ బ్లాక్ మెయిలర్ని కలుసుకునేందుకు జారుకున్నారు. కానీ అక్కడ దేనికో పేచీపడి, అతని గుండెలో బుల్లెట్

ఇరికించి బ్రతకకుండా చేశారు. దీనికి మీరు చెప్పే జవా బేమిటి?"

ఆమె ఆవేశంతో ఊగిపోయింది. "అంతా అబద్ధం! అంతా అబద్ధం! అత నెవరో నాకు తెలీదు. నేనెక్కడికీ పోలేదు!"

లాల్ జాలిగా నవ్వాడు. "మీకన్నీ తెలుసు. మొద ట్నుంచీ మీరింతే. పరిసితులెలా రూపుదాలిస్తే మీరలా ప్రవర్తిస్తున్నారు. మీరు నిర్దోషి అయితే నన్ను లోపలికి వెళ్ళనిచ్చి చూడనివ్వండి."

ఆమె అచేతనంగా నిలబడిపోయింది. ఏమీ పలక లేదు.

లాల్ లోపలికి నడిచాడు. ఇంట్లో కెళ్ళి బెడ్ రూంలోకి దారితీశాడు. ఆమె వెనుక వచ్చింది బేలగా. బెడ్ రూంలో సురేష్ గాఢ నిద్రలో వున్నాడు. లాల్ దగ్గరి కెళ్ళి పిలిచాడు. లేవలేదు. కుదిపాడు. కదలిక లేదు. లాల్ దృష్టి ఆ ప్రక్కనే టేబిల్ మీదున్న గాజుగ్లాసుమీద పడ్డాయి. అందులో అడుగున కొన్ని పాలు మిగిలివున్నాయి....

మరో ప్రక్క ఉయ్యాల తొట్టిలో నిద్రిస్తూన్న బాబు కన్పించాడు. లాల్ దగ్గరికి వెళ్ళి అతనికీ తండ్రి లాటి అవస్థే గమనించాడు. అప్పుడు బయటికి నడుస్తూ తలుపు దగ్గరాగిపోయాడు. అతని కళ్ళు పక్కనున్న డ్రెస్సింగ్ మిర్రర్ మీద పడ్డాయి. అందులో తన వెనుక ఆమె ప్రతిబింబం కన్పిస్తోంది. ఆమె బెడ్ దగ్గర వంగి, భర్త తలగడకింద ఏదో తోస్తోంది కంగారుగా.

లాల్ నిదానంగా తిరిగి చూశాడు.

ఆమె ఖిన్నురాలై పోయింది.

లాల్ ముందుకెళ్ళి ఆ తలగడ కింద చెయ్యిపెట్టి,

చూశాడు.

చేతిలోకి కొన్ని నోట్లు వచ్చాయి. వందరూపాయల నోట్లు. వాటిని లెక్కించాడు. తొమ్మిదున్నాయి.

"అక్కడింతే దొరికిందా?" అడిగాడామెని.

ఆమె తేరుకుంది. "నాకు దొరకడమేమిటి? అవి నా తలగడకింద వుంటే తీసి ఆయన తలగడ కింద పెడు తున్నాను...."

"కానీ, ఈ మాత్రానికే అంత కంగారుపడనవసరం లేదే?"

"అవి నా తలగడక్రింద ఎక్కడివో తెలీదు—చూసి భయపడ్డాను."

"ఫోన్ ఏది? నేను పోలీసుల్ని పిలవాలి...." లాల్ బైటికి నడిచాడు.

"ఆగండి!" ఆమె పరుగెత్తివచ్చింది, "మీరాపని చేయకండి! నామాట నమ్మండి! నేనెవర్నీ చంపలేదు! నేనెక్కడికీ పోలేదు!"

"మీకు రెండు కళ్ళు అనదగ్గ మీ భర్తా, మీ బాబు పరిస్థితి చూసి నేనలా అనుకోలేను, రేవతీ!" అన్నాడు లాల్ అలాగే నడుస్తూ. "మీ ఇంటికి ఫోన్ చేసి రెస్పాన్స్ పొందనప్పుడే, నేను వెంటనే వచ్చి ఇక్కడ ఎదురుచూస్తే, అప్పుడు తిరిగి వస్తున్న మిమ్మల్నాపి యెక్కడికెళ్ళి వస్తున్నారు, రేవతిగారూ? అని అడిగే వాడ్ని. కానీ ముందా శవం నేననుకున్నదే అవునా కాదా అన్న అనుమానంతో ముందు అక్కడికెళ్ళి పోయాను....వ్చ!" అతను ఫోనెత్తి డయల్ చేయ సాగాడు,

## 7

ఉదయం పదకొండున్నరకి వచ్చాడు, కృష్ణన్ సురేష్‌తో.

సురేష్ ముఖం పాలిపోయి వుంది. అతను ఆందోళనగా కూర్చుంటూ అన్నాడు. "మిష్టర్ లాల్, అబద్ధం! బూటకం! యెవరో ఆడుతున్న నాటకం! పన్నాగం! రేవతి ఇలాంటి పని యెప్పుడూ చేయదు!"

"కానీ పరిస్థితి అలా వుంది...."

"రేవతీ ముమ్మాటికీ ఈ హత్య చేయలేదు."

"సురేష్, మీరు మర్చిపోతున్నారు...." కృష్ణన్ అన్నాడు కల్పించుకుని. "రాత్రి మీకు నిద్రమందు ఇవ్వబడింది. అది మీ రొప్పుకుంటున్నారు. అలాగే మీ బాబుకీ ఇవ్వబడింది. యెవ రిచ్చారు? ఇంకెవరు, మీ మిసెస్, ఆ బ్లాక్ మెయిలర్‌ని కలుసుకునేందుకు మీకలా చేసింది. ఎప్పుడు వెళ్ళిందో తెలియదు. కానీ పన్నెండూ పదికి అక్కడ మర్డర్ జరిగింది. తిరిగి పన్నెండున్నరవరకూ ఆమె యింటికి చేరుకోలేదు. ఎలాగంటే, ఆ సమయంలో లాల్ ఫోన్ చేస్తే మీ ఇంట్లో రెస్పాన్స్ లేదు. కాబట్టి రేవతికి ఎలిబీ లేదు——"

సురేష్ అయోమయంగా చూశాడు.

"అంతే కాదు, సురేష్, మీరు కిడ్నాపర్‌కిచ్చానంటున్న డబ్బులో కొంత మీ తలగడ కింద దొరికింది లాల్‌కి, నిన్న రాత్రి. అవి తొమ్మిది వంద నోట్లు. వాటి నెంబర్లు నిన్న మీరు లాల్‌కిచ్చిన నోట్ల నెంబర్ల లిస్టులో వున్నాయి. కనుక ఆ డబ్బు బ్లాక్ మెయిలర్ దేననీ, రేవతి అతని దగ్గర్నుంచీ తెచ్చిందనీ అర్థమవుతోంది....

ఇంకా అన్నింటికంటే ముఖ్యమయిన రుజువు,

అక్కడ హత్యాయుధం. రివాల్వర్ మీద ఆమె వేలి ముద్రలున్నాయి.

"అంతే కాదు, మిస్టర్ సురేష్, ఆమె చంపి పారి పోతోండగా ఆ వీధిలో వాళ్ళు ఒకరిద్దరు చూశారు. తర్వాత ఆమెను గుర్తుపట్టారు. ఆమెను అప్పుడే కాదు, అంతకుముందు చాలాసార్లు ఆ వీధిలోకి, ఆఇంటికి రావటం చూశారట. ఆ యింటిని సుభాష్ రెండు నెలల క్రితం అద్దెకి తీసుకున్నాడు. ఒంటరిగా ఉంటున్నాడు. రేవతి అడపాదడపా వెళ్ళి కలుసుకుంటోంది. ఆమె బ్లాక్ మెయిల్ లో చిక్కుకుంది. సురేష్, అతనెవరో ఘరానా నేరస్థుడే వుంటాడు. అతనికి సంబంధించిన ఫైలు మా దగ్గర లేదు. అతను యెక్కడివాడో ఇంకా తెలియదు."

సురేష్ మాట్లాడలేదు.

క్రిష్ణన్ అన్నాడు తిరిగి. "రాత్రి రేవతి అతన్ని కలుసుకుంది. మీరంతా అతను మొన్న రాత్రే సిటీ వదిలి వెళ్ళిపోయాడనుకున్నారు. కానీ ఇక్కడే వున్నాడు. మిస్టర్ సురేష్, సేషన్ లో మీరు మోసిన గ్రీన్ సూట్ కేసు ఇప్పుడు సుభాష్ ఇంట్లో లేదు. మీరిచ్చిన రాన్సమ్ డబ్బూ లేదు. రేవతికి ఆ తొమ్మిదివందలే దొరికాయి. ఆమె దేనికి వెళ్ళిందో, యెందుకు కొట్లాడిందో చెప్ప టంలేదు. అసలక్కడికి వెళ్ళనే లేదంటోంది. పూర్ లయర్. ఆమె అలా బుకాయించి లాభంలేదు. సాక్షుల కథనం ప్రకారం అప్పుడామె తెల్లచీరలో వుంది. లాల్ ఇంటికెళ్ళినప్పుడు ఆ చీరలోనే వుంది. మా దగ్గర హత్యకు సంబంధించి ఆమెమీద అన్ని రుజువులూ వున్నాయి.

"రాత్రి ఆమె బ్లాక్ మెయిలర్ తో తగాదా పడి

అతన్ని ఆతని రివాల్వర్‌తో షూట్ చేసి చంపింది. అందులో ఆ ఒక్క గుండే వుంది. ఆ గుండు ఆ రివాల్వర్ నుంచే వెలువడిందని బాలస్టిక్ ఒపీనియన్. దాని మీద రేవతి కుడిచేతి వేలిముద్రలు అయిదూ వున్నాయి. అఫ్‌కోర్స్ హాతుడివీ ఉన్నాయనుకోండి.... కానీ రక్షించుకోలేకపోయాడు. ఇప్పుడు రేవతి రక్షించుకోలేదు మా నుంచి!"

కృష్ణన్ చేతులు చరచుకొని గర్వంగా చూశాడు.

డిటెక్టివ్‌లు నిశ్శబ్దంగా వుండిపోయారు. సురేష్ ఉద్రేకంగా చూడసాగాడు. అప్పుడన్నాడు లాల్ తేరుకుని.

"రేంజి, కృష్ణన్, ఏ రేంజిలో షూట్ చేయడం జరిగింది?"

"సుమారు పదిహేను అడుగుల దూరంనుంచి...."

"అదయ్యాక రివాల్వర్ యెక్కడుంది?

"శవం ప్రక్కనే, కడుపు దగ్గర."

"రివాల్వర్ ఆమె యెక్కడ్నుంచి తీసింది?"

"అదెక్కడుందో ఆమెకు తెలిసివుండదు. హాతుడే తీసి బెదిరించి వుంటాడు. యెందుకంటే అది అతని రివాల్వర్. అప్పుడామె మీదపడి లాక్కొని—"

"అయితే ఘర్షణ జరిగిన సూచనలున్నాయా?"

"అదే....అలాంటిదేమీ లేదు."

"మరామె రివాల్వర్ లాక్కొని పదిహేను అడుగుల దూరంలో ఎలా వెళ్ళగల్గింది? అతను వెంబడించి లాక్కోవాలి కదా?"

"వెంబడించి వుండడు. స్టన్ అయిపోయి వుంటాడు. రేంజాఫ్ ఫైర్‌నిబట్టి చూస్తే పదిహేను అడుగులుండగా,

ఆ గది వైశాల్యం ఎనిమిదడుగుల చదురంలోనే వుంది. కాబట్టి షూటింగ్ ఆ గదిలో జరగలేదు. రివాల్వర్ లాక్కొని పారిపోతూ బయట వరండాలోంచి షూట్ చేసి వుంటుంది. అతను గది మధ్యలో సరిగ్గా తలుపుకెదురుగా నిల్చుని వున్నాడు. అక్కడే కూలిపోయాడు. ఆమె రివాల్వర్ లోపలికి విసిరి పారిపోయింది. దాన్ని తనతో తీసుకెళ్ళకపోయినా, కనీసం వేలిముద్రలు తుడవాలన్న ఇంగితం కూడా లేకపోయిందామెకు...."

"చిత్రంగా వుంది!" అన్నాడు జాన్.

"చిత్రంకాదు, అలాటి వ్యవహారాలామెకు కొత్త. చేసిన పనికి గుండె చెదిరిపోయింది...."

లాల్ అన్నాడు. "అయితే అది క్లోజ్ షాట్ కాదంటారా? నమ్మకమేనా?"

కృష్ణన్ తలూపాడు వెంటనే. "నమ్మకమే. క్లోజ్ షాట్ అయితే అతను తొడుక్కున్న బనియన్ మీద పాయింటాఫ్ ఎంట్రీ గుండ్రంగా వుండేది. చర్మంపై కాలినమచ్చ వెడల్పుగా ఏర్పడేది. గాయంచుట్టూ కణాలు నల్లగా కమిలిపోయేవి. గన్ పౌడర్ గాయంలో ఇంకి, రక్తంలో కార్బన్ మోనాక్సైడ్ తేలేది. ఇవేవీ లేవు."

"అయితే కృష్ణన్, అది క్లోజ్ షాట్ కాకపోతే, పదిహేను అడుగుల లాంగ్ షాట్ అయితే, గురి తప్పకుండా అంత సరిగ్గా అంత దూరంనుంచి షూట్ చేయగల ఎక్స్‌పర్టు ఎప్పుడైందామె? అదీ వెనక్కి తిరిగి పారిపోతున్నప్పుడు....? మరో షాట్ పేల్చలేదు. అందులో ఒక్కటే బుల్లెట్ వుంది. బయటివాళ్ళకి ఒక్కటే షాట్ విన్పించింది...."

క్రృష్ణన్ తల అడ్డంగా వూపాడు. "ఆమె నైపుణ్యాం గురించి నాకు తెలీదు. ఉన్న వాస్తవం చెప్పాను. రుజువులన్నీ అందుకు సరిపోతున్నాయి. మీరామెను అరెస్టు చేయిస్తే ఆమె నేరం చేసిందని మీరు నమ్మారను కున్నాను. ఇప్పుడామెకు అనుకూలంగా మాట్లాడు తున్నారు...."

"న్యాయం ఎటువైపుంటే ఆ వైపు మాట్లాడాలి. ఈ రేంజాఫ్ ఫైర్ నా నమ్మకాన్ని బలహీనం చేసింది. అలా జరగడం సంభవం కాదు. అంత దూరంనుంచి షూట్ చేయడం ఆమెకు సాధ్యంకాదు—"

"మరింకెవరు చేశారు?"

"అసలా రివాల్వర్ అతనిదేనా అని!"

"అంటే—?"

"ఎవరో చత్తేరాం అలా పోతూ పోతూ సరదాకి షూట్ చేసి పోలేదు కదా?"

"మీ బ్రెయిన్ చెడిపోయింది!"

"లాల్ బ్రెయిన్ చెడదు!" జాన్ అభ్యంతరం తెలిపాడు.

"అయితే ఆయన ఆ నేదానికి ఏమిటాధారం?"

"చెప్పు, లాల్."

చెప్పాడు లాల్. "సుభాష్‌ని క్రిమినల్ అంటున్నాం. కిడ్నాపర్, బ్లాక్ మెయిలర్ అంటున్నాం. కానీ అతను ఒంటరిగాడని అనలేంకదా? క్రిమినల్స్ సాధారణంగా ఒంటరి జీవితం గడపరు, ఎక్కడో యెవరో మానియక్ అయితే తప్ప. అసోసియేట్స్ వుంటారు. సుభాష్ ఇంట్లో సూట్‌కేస్ లేదన్నారు.

దాన్ని రేవతి పట్టుకు పారిపోయిందని సాక్షులనటంలేదు కదా? మరి అదేమైంది? మిగతా డబ్బంతా ఏమైంది—"

"ఎలా?"

"ఆ రైల్వేస్టేషన్‌లో మనమనుకుంటున్న నెంబర్ టూ ఎవరో సుభాష్ అసోసియేట్ ఎందుకయ్యి కూడదు? ఫిమేల్ ఎకాంప్లీస్? ఏమిటి? అతని లవర్ రేవతి రూపంలో వచ్చి ఆమెను యెందుకు ఇంపర్సనేట్ చేయకూడదు?"

"కానీ ప్రయోజనం? ఉద్దేశ్యం? మిగతా థియరీ ఎలా కన్‌స్ట్రక్ట్ చేస్తారు? రివాల్వర్ మీద ఆమె వేలిముద్రలున్నాయి...."

"వేలిముద్రలు! అవెందుకొచ్చాయ్?" అరిచాడు జాన్.

లాల్ అతన్ని వారించాడు. "ఎక్కడో కిటుకువుంది, పార్ట్‌నర్ గ్రిప్ దొరకటంలేదు. మీకింకా అక్కడేం దొరికాయి, కృష్ణన్?"

"ఇంకేమీ లేదు."

జాన్ ఉలిక్కిపడ్డాడు. "తాళంచెవి — మీకో తాళంచెవి ఇచ్చాను. అదేమైంది?"

"అది....అది .. నా దగ్గరే వుంది...."

"అది మీ ప్రాపర్టీ కాదు, తీయండి బైటికి!"

"ఎక్కడిది, జాన్?" అడిగాడు లాల్.

"అక్కడే వరండాలో దొరికింది. మామూలు నికెల్ తాళంచెవి దానిమీద హెచ్.ఎల్—3 అని అక్షరాలు చెక్కి వున్నాయి" దానికి సంబంధించిన తాళం ఆ ఇంట్లో లేదు."

"ఆ అక్షరాలు తయారుచేసిన కంపెనీ పేరా?"

"కాదు, అవి అచ్చులో లేవు. చెక్కి వున్నాయి"

కృష్ణన్ తాళంచెవి తీసి లాల్ కిచ్చాడు.

లాల్ అందుకుని చూశాడు. "ఇది హోటల్ తాళం చెవిలా వుంది. హెచ్. ఎల్—హోటలు కాదు, అలా కాదు, హోటలు లయన్—లార్క్—అలా వుండాలి పేరు. జాన్, డైరెక్టరీ తీసి రెండు పొడి అక్షరాలుగల హోటళ్ళ పేర్లు చూడు...."

జాన్ టెలిఫోన్ డైరెక్టరీ అందుకున్నాడు.

సురేష్ అందరి చర్యలు, మాటలు ఆసక్తిగా ఆల కిస్తున్నాడు.

"రేవతి గతం గురించి మీకేం తెలుసు, సురేష్?" లాల్ అడిగాడు.

"ఆమె గతం ఎలాటిదైనా నాకనవసరం. నాకు తెలిసినంతవరకు వాళ్ళెవరూ వేలెత్తి చూపలేదు. ఆమెను రక్షించుకుంటాను. ఆమెకు తల్లీదండ్రీ వున్నారు. వాళ్ళకామె ఒక్కతే సంతానం. మా ఇద్దరిదీ ఒకే ఊరు, వరంగల్. ఈ విషయం నేను వాళ్ళకెవరికీ తెలుపలేదు. ఆమె నిర్దోషి అన్న నమ్మకంతో వున్నాను. దీని కక్కువ ప్రచారం జరక్కుండా ఆమెను కాపాడుకోవాలి...."

జాన్ డైరెక్టరీలో చూస్తూ కృష్ణన్‌కు చెప్తుంటే, అతను ఒకో నెంబర్‌కి ఫోన్ చేసి మాట్లాడుతున్నాడు. హోటలు లక్కీ, హోటలు లారెలు, హోటలు లిబర్టీ... హిందుస్తాన్ లాడ్జి, హరిలాడ్జి, హనుమాన్ లాడ్జి....

కృష్ణన్ ఉద్రేకపడ్డాడు. హనుమాన్ లాడ్జినుంచి వచ్చిన సమాచారం ఆసక్తిగా విని, ఫోన్ పెట్టేసి చెప్పాడు.

"మన టార్గెట్ ఇదే కావచ్చు. హనుమాన్ లాడ్జి,

జాంబాగ్. ఈ తాళంచెవి వాళ్ళు తమదేనంటున్నారు. మూడో నెం ర్ గది దట. ఆ గది నిన్న రాత్రే ఖాళీ అయిపోయిందట ...!"

లాల్ ముఖం ప్రసన్నమైంది. "వెరీ వెల్! జాన్ నువ్వెళ్ళు. ఈ టార్గెట్‌ని ఫైన్ చేసి వాళ్ళని ట్రేస్ చెయ్. వాళ్ళు మకాం ఎక్కడ మార్చారో తెలిస్తే నాకు ఫోన్ చెయ్. కృష్ణన్‌తో వస్తాను—కమాన్, మూవ్ ఫాస్ట్!"

## 8

జానే జాంబాగ్‌లోని హనుమాన్ లాడ్జిముందు కారు దిగి చకచకా లోపలి కెళ్ళాడు. అదొక రెండంతస్తుల చీప్ లాడ్జి. మెయిన్ రోడ్డు మీదగాక లోపల సందులో వుంది. పరిచయ ఉపోద్ఘాతాలయ్యాక దాచుకోకుండా అంతా చెప్పేశాడు ప్రొప్రయిటర్.

అతని స్టేట్‌మెంట్ ప్రకారం వారం క్రితం, అంటే మూడో తేదీన సంతోష్‌కుమార్—సంధ్య అనే భార్యాభర్తలిద్దరు మూడో నెంబర్ గదిలో దిగారు. నాగపూర్ నుంచి బిజినెస్‌రీత్యా వచ్చినట్లూ, వారం రోజులుంటున్నట్లూ వ్రాయించారు. అతనికి ముప్పైఏళ్ళు, ఆమెకు పాతికేళ్ళు. హిందీ చక్కగా మాట్లాడతారు.

వాళ్ళు బయట ఎక్కువగా తిరిగేవారు. విడివిడిగా తిరిగేవారేమో, రాకపోకల సౌకర్యం నిమిత్తం రెండు తాళంచెవులు కావాలంటే ఇవ్వటం జరిగింది. మొన్న సాయంత్రంవరకు వాళ్ళ ప్రవర్తన ఒక్కలాగే వుంది. కానీ మొన్న సాయంత్రమే మార్పు వచ్చింది....

ఆ రోజు ఒకతను వచ్చాడు వాళ్ళకోసం. భుజాన చిన్న పిల్లాడున్నాడు. ఏడాది నిండదు. బ్లూ నిక్కరు,

పసుపురంగు బనియన్‌తో వున్నాడు. ఆ పిల్లాడ్ని అతను వాళ్ళకప్పగించి వెళ్ళిపోయాడు. అతనికి ముప్ఫైవుండొచ్చు వయసు. రింగుల జుట్టు. నల్ల కళ్ళద్దాలు, మెడలో బంగారు గొలుసు. అతడా ఒక్కసారే వచ్చాడు.

ఆ రాత్రి తొమ్మిది గంటలకి ఆ పిల్లాణ్ని తీసుకొని ఆమె యెక్కడికో వెళ్ళింది. అప్పుడామె ఆకుపచ్చ చీరలో వుంది. పిల్లాడెందుకో వచ్చినప్పట్నుంచీ నిద్ర పోతూనే వున్నాడు. రెండు గంటల తర్వాత ఆమె తిరిగి వచ్చింది. అప్పుడా పిల్లవాడు లేడు. సూట్‌కేసు వుంది, ఆకు పచ్చ రంగుది.

ఆ తర్వాత నిన్న ఉదయమంతా ఎక్కడెక్కడో తిరిగి మధ్యాహ్నం ఖాళీ సూట్‌కేసుతో వచ్చారు వాళ్ళు. తీసుకెళ్ళేటప్పుడు అది చాలా బరువుగా వుంది. ఆ పగలంతా గదిలోనే వుండి, ఆమె రాత్రి పదకొండు గంటలకి యెక్కడికో బయల్దేరింది. చేతిలో హేండ్ బ్యాగ్ వుంది. ఒంటిగంటకి ఒక బ్రౌన్ కలర్ బ్రీఫ్ కేసుతో కంగారుగా తిరిగి వచ్చింది. అప్పుడు హేండ్ బ్యాగు కూడా వుంది. ఆ వెంటనే వాళ్ళు గది ఖాళీ చేసేసి వెళ్ళిపోయారు. అయితే రెండో తాళంచెవి తిరిగి ఇవ్వకుండా యెక్కడో పోయిందని చెప్పారు."

జాన్ వాళ్ళ వర్ణన కోరాడు. ఆమె పల్చగా, తెల్లగా పెద్ద జడతో వుంటుంది. నగలేవీ లేవు. ఒక రిస్టువాచీ వుంది. అతను తెల్లగా, లావుగా ఆధునికంగా వున్నాడు. బ్రిస్టల్స్ కాలుస్తాడు. గది ఖాళీ చేసినప్పుడామె ఎర్ర చీర, ఎర్ర జాకెట్‌లో వుంది. అతను గోధుమ రంగు ప్యాంటు, నల్ల షర్టులో వున్నాడు."

జాన్ వాళ్ళ లగేజి వివరాలడిగాడు. రెండు సూట్

కేసులు—బ్లూ కలర్ ఒకటి, ఆకుపచ్చదొకటి, ఒక బ్రౌన్ కలర్ బ్రీఫ్ కేసు, ఒక హేండ్ బ్యాగు, అంతే.

ఆ గదిలో వాళ్ళేమీ వదల్లేదు. ఉదయమే ఆ గదిలో మరో పార్టీ దిగింది. జాన్ వాళ్ళెల్లా వెళ్ళారని అడిగినప్పుడు, ప్రొప్రయిటర్ కుర్రాడిని పిలిచాడు.

కుర్రాడు, ఆత్మారాం టాక్సీలో ఎక్కించానని చెప్పాడు. సందు ఎదురుగా మెయిన్ రోడ్డుమీద టాక్సీ స్టాండును చేరుకున్నాడు జాన్, ఆ కుర్రాడితో. కుర్రాడు ఆత్మారాంని చూపించాడు. జాన్ ఆత్మారాంని సమీపించాడు. బేరం కుదిరాక ఆత్మారాం చెప్పిన ప్రకారం రాత్రి వాళ్ళు టాక్సీ యెక్కి దగ్గర్లో ఏ ఊరుంటే అక్కడికి చేర్చమని అడిగారు. ఆత్మారాం షాద్ నగర్ పేరు చెప్పాడు. వాళ్ళు తీసుకెళ్ళమన్నారు, ఊరవతలే దిగిపోయి రెండొందలిచ్చారు. ఆత్మారాం కళ్ళకద్దుకున్నాడు.

కారు దూసుకుపోతూంటే జాన్ సిగరెట్ మీద సిగరెట్ తాగుతూ తీవ్రంగా ఆలోచించసాగాడు. గంట తర్వాత షాద్ నగర్ చేరుకోగానే బస్టాండు వైపు పోనిచ్చాడు. బస్టాండులో పళ్ళకొట్టు పరమేశం సమాచారం ఇచ్చాడు.

వాళ్ళు పెద్ద లగేజితో చాలా రాత్రి గడిచాక పళ్ళకొట్టువద్దకొచ్చి, చాలా పళ్ళూ అవీ కొనుక్కున్నారు. అప్పుడు దగ్గర్లో ఏయే ఊళ్ళున్నాయని అడిగితే చెప్పాడు పరమేశం, నాలుగైదు పేర్లు. అన్నిటికంటే దగ్గర్లో ఏదుందని అడిగితే 'తుమ్మిట' అని చెప్పాడు పరమేశం. వాళ్ళక్కడ్నుంచి వెళ్ళిపోయారు, దారి దూరం తెలుసుకొని.

'తుమ్మట' దరిదాపులకొచ్చి దారినపోయే దానయ్యని అడిగాడు జాన్, చుట్టుపక్కల దట్టమైన చిట్టడవిగానీ తోపుగానీ వున్నాయా అని.

దక్షిణంవైపుగా వెళ్ళే వూరవతల గొర్రెలకాపరి గోపీ మందలు కాసేచోట దట్టంగా చెట్లున్నాయనీ, దానికవతల దూరంగా సైతాను దిబ్బవుందనీ, చెప్పాడు అతను.

జాన్ సైతాను దిబ్బమీదే కారు నిగి కళ్ళద్దాలు తీసేశాడు. రివాల్వర్ తీసుకున్నాడు. గబగబా విశాల మైన మైదానంలోకి, ఆ చెట్లున్న ప్రాంతానికేసి మండు టెండలో నడవసాగాడు

ఇరవై గజాల దూరంలో యెవరిదో కేక విన్పించింది. బదులుగా ఎక్కడో గొర్రెలమంద అర్చింది.

జాన్ పరుగెత్తాడు, పరుగెత్తుకు వెళ్ళి ఆ చెట్ల ప్రాంతాన్ని చేరుకున్నాడు. అక్కడతనికి కన్పించిన దృశ్యం—

కింద గడ్డిలో దుప్పట్లూ దిళ్ళతో కూడిన పక్క, దాని పైన నిటారుగా కూర్చున్న ఆడా మగా మనుషులిద్దరూ వాళ్ళచుట్టూ పళ్ళూ లగేజీ పాటలు వస్తూన్న ట్రాన్సిస్టర్, ఆ పక్కనే గట్టులేని సేద్యపు నీటిబావి.

జాన్ ఆమెనే రెప్పవేయకుండా చూస్తున్నాడు.

ఆమె అచ్చం రేవతిలాగే వుంది.

వాళ్ళిద్దరు లేచి జాన్ మీదికి రాబోయారు దాడికి. కానీ అతని చేతిలో రివాల్వర్ చూసి ఆగిపోయారు అక్కడే. రివాల్వర్ పేల్చే అవసరంలేకుండా, ఎటు వంటి అర్భాటం లేకుండా లొంగుబాటు జరిగిపోయింది.

# 9

లాల్ తలూపాడు ఆమెను చెప్పమన్నట్లు.

ఆ గదిలో డిటెక్టివ్ లు, ఇన్ స్పెక్టర్ కృష్ణన్, డాక్టర్ సురేష్, అతని భార్య రేవతీ, మొదలైనవారు ఆసక్తిగా కూర్చుని వింటున్నారు.

"నా పేరు రజని...." చెప్పసాగిందామె మెల్లిగా. "రేవతి నాకంటే సంవత్సరం పెద్దది. సుభాష్ మా ఇద్దరికంటే పెద్దవాడు. నాకు రెండేళ్ళు పెద్ద. మేం ముగ్గురం తోబుట్టువులం. మేం విడిపోయి చాలా కాలమైంది. అప్పుడు మేము ఖమ్మంలో వుండేవాళ్ళం.

కానీ అన్నయ్యకూ నాకూ చదువులమీద శ్రద్ధ వుండేది కాదు. మేమెప్పుడూ ఉద్యమాలూ విప్లవాలంటూ తిరిగేవాళ్ళం. రేవతి మాత్రం శ్రద్ధగా చదువుకునేది. ఆమె చాలా రిజర్వ్డుగా వుండేది మా వ్యవహారాల్లో—యితర విషయాల్లో అసలు ఆసక్తి చూపేది కాదు....

అప్పుడు హైస్కూలు ఎలక్షన్లు పెట్టారు. అన్నయ్య పదో తరగతిలో వున్నాడు. మేం తొమ్మిదిలో వున్నాం. ఆ ఎలక్షన్ లలో అన్నయ్య కూడా నిలబడ్డాడు, ప్రెసిడెంటుకి. అవతలి వర్గంనుంచి కిషన్ అనే అతను నిలబడ్డాడు. మొదట్నుంచీ బద్ధవైరం వుండేది ఇద్దరికీ. ఎన్నికల ప్రచారం చేసుకుంటూ వాళ్ళిద్దరి వర్గాలూ ఘర్షణపడి పరిస్థితి అదుపు తప్పింది. అన్నయ్యవాళ్ళు కిషన్ని పొడిచి చంపేశారు, సుందర్ టాకీసు ఎదురుగా. తర్వాత పోలీసులకి లొంగిపోయారు.

కానీ బెయిల్ మీద విడుదలైవస్తే వాళ్ళ పని పట్టడానికి సిద్ధంగా వున్నారు కిషన్ పార్టీ వాళ్ళు. అందుకని

అన్నయ్యవాళ్ళు — మొత్తం అయిదుగురు — బయటికి రాగానే రాత్రికి రాత్రి ఊరొదిలి పారిపోయారు. ప్రిలిమినరీ హియరింగ్ కి వాళ్ళకోసం వారంట్లు వెళ్ళాయి. కానీ వాళ్ళెక్కడా దొరకలేదు. ఇప్పటికి ఆ కేసు అలాగే వుంది....''

క్షణమాగి అందామె. "అలా ఒక సంవత్సరం గడిచి పోయింది. అన్నయ్య దూరమైనా నా ధోరణిలో మార్పు రాలేదు. నా భావాలు మరింత పెరిగాయి. నాన్న మా యిద్దర్నీ యెంత అసహ్యించుకునేవాడో నాకు తెలుసు. చాలాసార్లు మమ్మల్ని నచ్చజెప్పి, వారించి చూశాడు. చివరకి మేము దారి మార్చుకోమని తెలుసుకొని, మా గురించి ఆలోచించటం మానేసి అసహ్యం పెంచు కున్నాడు.

ఆ రోజుల్లోనే నాకు ఖాదర్ అనే అతను పరిచయం మయ్యాడు. అప్పుడు మేము పదో తరగతిలో వున్నాం. అతనికి ఉర్దూ రాకపోయినా తెలుగులో మంచి కవిత్వం రాసేవాడు. విప్లవకవులతో సంబంధాలుండేవి. అతని స్నేహంలో అతనివీ నావీ భావాలూ ఆశయాలొక్కటే అని తెలుసుకోవటంతో, మేమిద్దరం ఒకటిగా కలిసి పోయాం. నేనతని పార్టీలో చేరిపోయాను.

అప్పుడు మిమ్మల్ని అంతా వ్యతిరేకించారు. ఉగ్ర వాదులన్నారు. నక్సలైట్లన్నారు. ఇంకేదో అన్నారు. కారణంలేకుండానే మా కార్యాలయంమీద దాడిచేసి పోలీసులు మమ్మల్ని కొట్టేవారు. లాకప్ లో పెట్టేవారు. ఆ బాధలు పడలేక మేము అజ్ఞాతవాసంలోకి వెళ్ళాలను కున్నాం....అజ్ఞాతంగా వుంటూ మా కలాపాలు సాగిం చాలనుకున్నాం. అడవుల్లోకి వెళ్ళిపోయాం.

అలా వెళ్ళిపోయిన కొంత కాలానికి ఊళ్ళో ఒక హత్య జరిగింది. ఆ అధికార పార్టీ నాయకుని హత్యకు పోలీసులు మమ్మల్ని నిందించి, ఎలాగో వెతికి పట్టుకుని, ఖాదర్ నీ మరో ముగ్గుర్నీ కాల్చిపారేసి ఎన్ కౌంటర్ అని ప్రచారం చేశారు. నేనూ విక్టర్ అనే అతను మాత్రం ఎలాగో తప్పించుకోగలిగాం—"

నేనా రాత్రి ఖమ్మంకి దగ్గర్లో చెర్వుపల్లి అనే ఊళ్ళో సత్యవతి ఇంట్లో తలదాచుకున్నాను. ఆమె నాతోపాటు చదువుకునేది. సైకిలుమీద రోజూ ఖమ్మం వచ్చేది స్కూలుకి. ఆమె నన్ను చూసి ఉద్రేకపడింది. ఒక ఉత్తరం తెచ్చి, చాలారోజుల క్రితం నాకది స్కూలు అడ్రసుకొచ్చినట్లూ, తను తీసి దాచినట్లూ చెప్పి ఇచ్చింది. విప్పిచూస్తే అది అన్నయ్య వ్రాసింది.

"ఎక్కడ్నుంచి? ఏమని?"

"గుజరాత్ నుంచి రాశాడు. అక్కడ సౌరాష్ట్ర అనే చోట స్థిరపడ్డాడట. నన్నక్కడికొచ్చేయమని రాశాడు! నేనాలోచించాను. ఇక్కడ నాకు భవిష్యత్తు లేదనిపించింది. మా పార్టీ విచ్ఛిన్నమైంది. కొత్త పార్టీని కూడ కట్టుకోవటం కష్టం. ప్రభుత్వం తీవ్రంగా, అవసరమైతే దౌర్జన్యంగా అణచివేస్తోంది... ప్రాణాలతో చెలగాటం. నేనొక్కదాన్ని ఏమీ చేయలేను. నా కన్నయ్య దగ్గరే రక్షణా భవిష్యత్తూ ఉంటుందనిపించింది. సత్యవతి దగ్గర డబ్బులడుక్కుని మర్నాడే ప్రయాణమయ్యాను.

అక్కడ అన్నయ్యని చూసి నాకు చాలా సంతోషమేసింది ...దర్జాగా, నిశ్చింతగా బ్రతుకుతున్నాడు. ఆ బ్రతుకేమిటో నాకు తర్వాత్తర్వాత అర్థమైంది.... చాలా సార్లు నన్ను దుబాయ్‌వంటి చోట్లకి తీసుకెళ్ళాడు పడవల

మీద.

ఆ ప్రాంతాల నారాయణ్ సేట్ అనే అతను పెద్ద స్మగ్లరు. అతనికింద పనిచేస్తున్నాడు. సేట్ నన్నూ తమలో చేర్చుకున్నాడు. అప్పుడే నాకు తమకోసం బ్రతకటంలో, ఇతరులకోసం బ్రతకటంలో తేడా తెలిసి వచ్చింది....గత జీవితం పరమ చేదుగా తోచింది. అప్పుడు మా ఆశయాలు యెవరికీ పట్టలేదు. మా త్యాగాలు ఎవరికీ లెక్కలేదు. సానుభూతి యెవరికీ లేదు మామీద. ఆ జీవితం కుక్కలకన్నా హీనం!

ఈ ఎనిమిదేళ్ళూ నేను స్వర్గసౌఖ్యాలనుభవించాను. నాకు నచ్చినవాడ్ని ఎన్నుకున్నాను. అరిష్టాలు ఎదుర్కోక తప్పలేదు. పోలీసులతో అక్కడా అనేకసార్లు తల పడ్డాం. తృటిలో ప్రాణాలు దక్కించుకున్నాం.

కానీ ఈసారి—ఈమధ్యే రెండు నెలల క్రితం వాళ్ళ ధాటికి తట్టుకోలేకపోయాం. మా నారాయణ్ సేట్ సైతం వాళ్ళనెదుర్కోలేక చివరికి లొంగిపోయాడు. మేం చిన్నచిన్న వాళ్ళమంతా కట్టుబట్టలతో యెక్కడి వాళ్ళక్కడ పారిపోయాం! నారాయణ్ సేట్ ఆర్గనైజేషన్ పూర్తిగా మట్టుబెట్టబడిందిప్పుడు....”

“అయితే?” లాల్ అన్నాడు.

“అందుకని మేము పారిపోయి వచ్చేశాం, నేనూ అన్నయ్యా రాకేష్. నారాయణ్ సేట్ మనుషులకోసం నార్తు అంతా వలపన్నారు పోలీసులు. అతను మమ్మల్ని లొంగిపొమ్మని పిలుపు కూడా ఇచ్చాడు. కానీ మాలో కొందరికి అది ఇష్టంలేదు. కొందరు లొంగిపోయారు కూడా, మేము నార్తులో ఉండకూడదని ఇక్కడ సౌత్ కొచ్చేశాం. ఇక్కడైతే కొంత క్షేమంగా వుంటుంది....

మరికొందరు నా దృష్టిలోనే బొంబాయిలోనూ, ఢిల్లీలోనూ తలదాచుకుంటున్నారు. మాకు బాగా సన్నిహితమైన రంగరాజన్ ఢిల్లీలోనే వుంటున్నాడు.

ఇక్కడకొచ్చాక అన్నయ్య ఒక యిల్లు అద్దెకు తీసుకొన్నాడు, విద్యానగర్‌లో. కానీ మా కక్కడ ఉండబుద్ధి కాలేదు. మేము హోటల్సులోనే వుంటూ వచ్చాం. ఏ హోటలులోనూ వారంకంటే యెక్కువ ఉండకుండా గడిపాం. అన్నయ్య మాత్రం ఆ ఇంట్లోనే ఒంటరిగా ఉంటున్నాడు. నేనే అప్పుడప్పుడు వెళ్ళివస్తూండేదాన్ని.

మేమక్కడ యేమీ చేయకూడదని నిశ్చయించుకున్నాం. పొరపాటున యెందులోనైనా పట్టుపడితే చాలా ప్రమాదం. కొన్నాళ్ళిక్కడే గుట్టుగా గడిపి, అప్పుడు పోలీసు వేట తగ్గాక తిరిగి అక్కడికెళ్ళి మామూలుగా రంగంలో దిగిపోవాలనుకున్నాం. మా దగ్గర చాలినంత డబ్బు లేకపోయినా అలాగే వుండాలనుకున్నాం.

అప్పుడు — ఒక రోజు అన్నయ్య మా దగ్గరకొచ్చి ఒక ఆశ్చర్యకర విషయం చెప్పాడు. క్రింతటి రోజు సాయంత్రం చిక్కడపల్లిలో ఏదో సినిమాకి వెళ్లాడట. అక్కడ నాలాగే ఒకామెని చూసి కలవరపడ్డాడట. నేనే అనుకుని పలకరించబోయాడట. కానీ ఆమె భర్తతో, బిడ్డతో స్కూటరుమీద రావడంవల్ల తను పొరబడ్డానని తెలుసుకున్నాడట.

కానీ సినిమా చూస్తున్నంతసేపూ ఆమె గురించే ఆలోచించాడట. అప్పుడు యెనిమిదేళ్ళ క్రితం తనకు మరో చెల్లెలుండేదన్న సంగతి గుర్తొచ్చిందట. మేమిద్దరం కవలలంగాకపోయినా, మాకు చాలా దగ్గర పోలికలున్న

విషయం తట్టిందట. ఇన్నాళ్ళూ రేవతి యెందుకు గుర్తుకు రాలేదా అని బాధపడ్డాడట. ఆమే ఈమె కాదు కదా అని అనుమానించాడట. అప్పుడు సినిమా వదిలాక వెంబడించి ఇల్లు కనుక్కున్నాడట.

ఆ రాత్రి ఇంటికొచ్చేసి మర్నాడు ఉదయం వెళ్ళాడట, భర్త లేని సమయంలో. ఆమె అతన్ని చూసి, గుర్తుపట్టి, బెదిరిపోయిందట! భయంతో అరవబోతే అన్నయ్య నచ్చజెప్పి శాంతపర్చాడట. కానీ ఆమె వెంటనే వెళ్ళిపొమ్మని అర్చిందట. తన దగ్గరకి ఆ ఛాయలకి రావద్దని వాదించిందట. తనకూ అతనికీ యే సంబంధమూ లేదందిట—

అన్నయ్య బతిమాలుకుని ఆమెను కూర్చోబెట్టి, నెమ్మదిగా ఇంటి విషయాలన్నీ అడిగాడట. నేనూ అన్నయ్యా వెళ్ళిపోయాక నాన్న అక్కడ ఖమ్మంలో తలెత్తుకోలేక పోయాడట. నల్గురూ నాలుగు అనుకో సాగారట. రేవతినీ తేలిక చూపు చూసేవారట. నాన్న అక్కడ ఉండదల్చుకోక, రేవతి భవిష్యత్తు కోసం ఆ ఊరు విడిచిపెట్టేశారట. వచ్చి వరంగల్లో స్థిర పడ్డారట. అక్కడ ఆమె ఒక్కర్తే కూతురని చెప్పుకునే వారట. మా విషయం యెక్కడా బయటపడకుండా జాగ్రత్తపడ్డారట—లేకపోతే రేవతి పెళ్ళి కష్టమవుతుంది.

అలా మా గురించి దాచిపెట్టి యెలాగో ఆమె పెళ్ళి అయిందనిపించారట. అందరూ సుఖంగా వున్నారట. ఇదంతా చెప్పకొచ్చి, ఇప్పుడీ నిజం బైటపడితే తన బ్రతుకు నరకమవుతుందని ఏడ్చిందట. మోసంద్వారా ఈ పెళ్ళి జరిపించారని భర్తా, భర్త తరపు వాళ్ళూ

గొడవచేస్తే, తెగ తెంపులు చేసుకుంటే, తన గతేం కావాలనిపించిందట. అన్నయ్య అలా జరగదని మాటిచ్చాడట.

ఇదంతా విని నేనూ చలించాను. అక్కయ్యను వెంటనే కలవాలనుకున్నాను. కానీ యెందుకో ముఖం చూపించలేనన్పించింది .... ఆమె యెంత అసహ్యించుకుంటోందో! - ఆమెకు చెల్లెలిగా నేను తగనన్పించింది. ఆమె జోలికి పోకుండా ఆమె అదృష్టానికి ఆమెని వదిలేయాలనుకున్నాను. కానీ పరిస్థితులు ఒప్పుకోలేదు."

"ఏం జరిగింది?"

"మా దగ్గర డబ్బు అయిపోవచ్చింది. పుట్టే మార్గాలు లేవు. రంగరాజన్ కి ఉత్తరం వ్రాస్తే తనూ ఇదే పరిస్థితిలో వున్నట్లు రాశాడు. అప్పుడు రేవతి గుర్తొచ్చింది. అన్నయ్యే చెప్పాడు, ఆమెనుంచి ఒకవిధంగా డబ్బు పొందవచ్చునని. ఆ రోజే వెళ్ళి రెండొందలు పట్టుకొచ్చాడు. అప్పట్నుంచీ అవసరమైనప్పుడల్లా వెళ్ళి రెండు మూడొందలు తెచ్చేవాడు, ఆమె బలహీనత ఆధారంగా బెదిరించి. ఇలా రోజులు గడిచిపోతున్నాయి....

ఇంతలో రంగరాజన్ ఢిల్లీనుంచి ఉత్తరం వ్రాశాడు. తనకి అనుకోకుండా కొంత మొత్తంలో 'సరుకు' లభ్యమైందనీ, తానిక ఇంటికిపోతున్నాననీ, అయితే అంత సరుకు తానొక్కడు వదిలించుకోలేననీ, అందులో కొంత దార్లో ఇక్కడ మాకు అప్పగించి వెళ్తాననీ, అందుకవసరమయ్యే పార్టీలని చూసుకోమనీ, పది శాతం కమీషన్ ఇస్తాననీ వ్రాశాడు. ఈ ఉత్తర ప్రత్యుత్తరాలన్నీ అన్నయ్య ఇంటినుంచే సాగేవి. ఎప్పటికప్పుడు చింపేసేడు.

ఈ వార్త విని మేం సంతోషించాం. వెంటనే పార్టీల వేటలో పడ్డాం. ఈ వారమంతా ఈ పనిమీదే తిరిగాం. యెలాగైతేనేం ముగ్గురు పార్టీలని పట్టాం, పాత సిటీలో. అయితే రంగరాజన్ యెప్పుడొచ్చేదీ తెలియదు. వచ్చేముందు టెలిగ్రాం ఇస్తానన్నాడు. ఆ బండికి అప్పుడు స్టేషన్‌లో యెదురుచూడమన్నాడు. అక్కడే అప్పజెప్పి మద్రాసు వెళ్ళిపోతానన్నాడు— పాతిక కిలోల చరస్.

ఇలా ఎదురుచూస్తోంటే మళ్ళీ మా దగ్గర డబ్బు అయిపోవచ్చింది. అన్నయ్య రేవతి దగ్గర హాజరువేశాడు. ఆమె ఇక ఇవ్వలేనని కచ్చితంగా చెప్పేసిందట. భర్తకి తెలియకుండా ఇప్పటికే చాలా ఇచ్చాననీ, ఇహ వల్ల కాదని మొండిగా చెప్పేసిందట. అన్నయ్య పర్యవసానం హెచ్చరించిందట. ఆమె కాళ్ళు పట్టుకుందట. అప్పుడు ఇలా లాభంలేదని అన్నయ్య ఆ భర్తనుంచే నేరుగా చాలా మొత్తం రాబట్టేందుకు ఈ కిడ్నాపింగ్ ప్లాను వేశాడు.

బాబుని కిడ్నాప్ చేసి అన్నయ్య బాబుని హోటల్లో మాకప్పగించి ఇంటికెళ్తే, పక్కింటాయన టెలిగ్రాం వచ్చినట్లు చెప్పాడట. అన్నయ్య పోస్టాఫీసుకెళ్ళి తీసుకున్నాడట. ఆ రాత్రి తొమ్మిదిన్నరకి వస్తున్నట్లు రంగరాజనే ఇచ్చాడు! వెంటనే మేము కిడ్నాప్ ప్లాను సెటప్ చేసుకున్నాం. బాబు యెక్కడ దొరుకుతాడో సురేష్‌కు ముందు చెప్పలేదు. మేమూ నిర్ణయించుకోలేదు. టెలిగ్రాం వచ్చాక అనుకున్నాం — రైల్వేస్టేషన్‌లో అయితే బాగుంటుందని, ఒకే సమయంలో రెండు పనులూ ఒకేసారి జరుగుతాయి.

రంగరాజన్నుంచి సరుకు తీసుకుని, బాబుతో పాటు వెయిటింగ్ రూంలో పెట్టేస్తే, సురేష్ వచ్చి వాటిని తీసుకెళ్తున్నప్పుడు ఆయన వెనుక నేను భార్యలా నడిచి వెళ్తే ఎవరికీ అనుమానం రాదు. అనుకున్న ప్రకారం అలా జరిగిపోయింది. నే నా సూట్ కేసుతో హోటలుకొచ్చేశాను. మర్నాడు వెళ్ళి పార్టీలకి అందించాం. డబ్బు చేసుకున్నాం. మాక్కొంత నిమిత్తం చిక్కింది. ఆ కిడ్నాప్ డబ్బు బ్రీఫ్ కేసులో అన్నయ్య దగ్గరే వుంది...."

"అయితే యెక్కడ వచ్చింది తగాదా?"

"తగాదా రాలేదు!" అడ్డంగా తలూపిందామె, "నిన్న రాత్రి నేను అన్నయ్యని కలుసుకోవడానికి వెళ్ళాను. అప్పుడు పన్నెండవుతోంది. నా బ్యాగులో రివాల్వర్ వుంది. దాన్ని బయటకెళ్ళినప్పుడు ఉంచుకుంటున్నాను. ఇక్కడి పరిసితులతో నాకు బొత్తిగా పరిచయం లేదు. మా ముగ్గురికీ కలిపి ఒకటే రివాల్వర్ వున్నా, అది నా దగ్గరే యెక్కువగా వుంటోంది.

నేనింట్లోకి వచ్చానో లేదో, లోపల్నుంచి మాటలు వినిపించాయి—పక్కకు తప్పుకుని కిటికీలోంచి చూశాను. అన్నయ్య రేవతి మాట్లాడుకుంటున్నారు ముందు గదిలో నిలబడి! ఆమె ఉద్రేకంతో ఉందప్పుడు. అన్నయ్యని హెచ్చరిస్తోంది వెంటనే ఊరొదిలి పారిపొమ్మంటోంది.

భర్త డిటెక్టివ్ల సహాయం కోరాడట. వాళ్ళు తీవ్రంగా గాలిస్తున్నారట. తను చేతనైనంత వరకూ మాన్పించే ప్రయత్నాలు చేసిందట. కానీ లాభంలేక పోయిందట. ఇంకా ఆ నోట్ల నెంబర్లన్నీ భర్త వ్రాసుకుని డిటెక్టివ్ల కందించాడట! అన్నయ్య ఆనవాలు కూడా

వాళ్ళకి తెలిసిపోయిందట! పైగా డిటెక్టివ్‌లు తననీ అనుమానిస్తున్నారట! తనని నిలదీస్తే ధైర్యం కోల్పోయి ఏ క్షణంలో ఏం చెప్పేస్తుందో తనకే తెలియదట! తన క్షేమం కోరి వెంటనే ఇక్కడ్నుంచి పారిపొమ్మని వేడుకుంటోంది...

నిజంగా అప్పుడామె పరిస్థితి అలాగే వుంది. ఆ పరిస్థితిలో ఆమె ఇంటికి తిరిగి వెళ్తే, అక్కడెవరైనా పట్టుకుని నిలదీస్తే — మా పని అయిపోతుంది. పైగా డిటెక్టివ్‌లామెను అనుమానంతో కనిపెడుతోంటే, వెంటాడి ఆ ప్రాంతాలకి రావచ్చు. ఈ ట్రాప్ నన్ను బెదరగొట్టింది! ఆ క్షణంలో నేనేం చేస్తున్నానో తెలీదు! కానీ రేవతి బ్రతకకూడదు. ఆమె బ్రతికివుంటే, మా గురించి అంతా చెప్పేస్తే, మేం పట్టుబడడం ఖాయం! మాకు వ్యవధి లేదు. అన్నయ్యాని అప్పుడు శాశ్వతంగా మూసేస్తారు కిషన్ హత్య కేసుతో!"

"అందుకని ఏం చేశావ్?"

"రివాల్వర్ గురిపెట్టి రేవతిమీదికి కాల్చాను. అప్పుడు వాళ్ళిద్దరు యెదురెదురుగా వున్నారు. రేవతి వీపు నా వైపువుంది. గుండు ఆమె వీపులోకి దూసుకుపోయేదే — కాని ఏ శక్తి ఆమెని కాపాడిందో — ఆ క్షణంలో ఆమె లీలామాత్రంగా పక్కకు తొలగింది! అంతే, నేను నాలుక కరచుకునేంతలో గుండు దూసుకెళ్ళి అన్నయ్య గుండెలో దూరింది!"

ఆమె ఉద్రేకంగా అంది చివరి మాటలు. రేవతి ఉలిక్కిపడి సబురాలై పోయింది. సురేష్ అభయమిస్తూ ఆమె భుజంపై చేయి వేశాడు. డిటెక్టివ్‌లూ, కృష్ణన్ ఒక్క క్షణం ఒకర్నొకరు చూసుకున్నారు.

అప్పుడన్నాడు లాల్. "ఆ తర్వాత."

ఆమె గుటక వేసింది. "జరిగింది చూసి నేను అదిరి పోయాను! అయినా నా పట్టుదల పోలేదు! మరోసారి ట్రిగర్ లాగాను. కానీ పేలలేదు! నా దురదృష్టంకొద్దీ అందులో ఒక్క గుండే వుంది! రేవతి భయపడిపోయి పరుగెత్తి వచ్చేస్తోంది. అన్నయ్య అచేతనంగా పడి పోయాడు. ఆమెను అంతం చేయలేను. ఆపలేను. బయట పోలీసులకో, డిటెక్టివ్ లకో చిక్కుతుంది. ప్రమాదం. ఆమెను ఇరికించాలి. అంతే ఇలా ఆలోచించి పరుగెత్తు కొస్తూన్న ఆమెను అడ్డుకొని, రివాల్వర్ చేతిలో పెట్టాను శుభ్రంగా తుడిచి! ఆమె బెదిరి కింద పడేసి ఉరికింది—

అప్పుడా రివాల్వర్ని ఎత్తి జాగ్రత్తగా అన్నయ్య శవం దగ్గర, అతని వేలిముద్రలు కూడా అద్ది అక్కడ పడేశాను. ఆ వెంటనే డబ్బున్న బ్రీఫ్ కేసు తీసుకుని వెనుక గుమ్మంగుండా పారిపోయాను."

"తిన్నగా హోటల్ గా?"

"కాదు. నాకో ఆలోచన వచ్చింది. మధ్యలో ఆ నోట్ల నెంబర్లు డిటెక్టివ్ ల దగ్గరున్నాయంది. అందులో కొన్ని నోట్లు ఆమె మీద ప్లాంట్ చేస్తే, ఆమెమీద హత్యకు మంచి మోటివ్ వుంటుంది. వెంటనే వాళ్ళింటికి వెళ్ళాను. దాన్లో ఆమెని యెవరూ పట్టుకోకుంటే అవి ప్లాంట్ చేసి వెళ్ళిపోవాలనుకున్నాను. అనుకున్నట్లుగానే ఆమె క్షేమంగా యింటికి చేరింది. నేను బెడ్ రూం కిటికీ లోంచి దూకి, ఆమె లేనిది చూసి తలగడకింద కొన్ని నోట్లు తీసి పెట్టాను."

"అప్పుడు?"

"తిన్నగా హోటలు కెళ్ళిపోయాను. అక్కడ అల
వాటుగా బ్యాగులో చెయ్యిపెట్టి చూసుకుంటే తాళం
చెవిలేదు! కంగారుపడ్డాను. ఎక్కడ పడిపోయింది?
అప్పుడొక్కటే బలంగా తోచింది—అది ఖచ్చితంగా
రివాల్వర్ తీసినప్పుడు ఆ ఇంట్లో పడిపోయి వుండాలి!
అక్కడది పోలీసులకి దొరుకుతుంది—దాంతో ఇక్కడ
కొచ్చారంటే—వచ్చారంటే—ఆ ఊహ భయంకరంగా
తోచి తక్షణం హోటలు ఖాళీచేసేశాం!

సిటీయే వదిలిపెట్టాలనుకున్నాం. మాకోసం ప్రధాన
మార్గాలూ, పెద్ద నగరాల్లో గాలిస్తారు. అందువల్ల
ఏదైనా మారుమూల ఊళ్ళో తల దాచుకుంటే అంతా
చల్లబడ్డాక దారిపట్టాలనుకున్నాం. మా దగ్గర చరస్
డబ్బు చాలా వుంది. దాంతో పట్టుబడితే రంగరాజన్
అన్యాయమవుతాడు...." ఆమె చెప్పడం ఆపి, ఇంకేమీ
లేనట్లు చూసింది.

అందరూ భారంగా నిట్టూర్చి ఒకర్నొకరు చూసు
కున్నారు.

"వెల్, అరెస్ట్ దెమ్" అన్నాడు లాల్, అక్కడ్నుంచి
లేస్తూ.

—:ఐపోయింది:—

సీరియల్

# రక్తపుటేర్లు

వసుంధర

(గత సంచిక తరువాయి)

బాబూరావు లలితకంటే సరిగ్గా ఒకే ఒక ఏడాది చిన్న. చిన్నప్పట్నించీ ఆ అక్కా తమ్ముళ్ళిద్దరూ ఒకే ఒక ప్రాణంగా పెరగారు. దానికి తోడు ఇద్దరు చదివేదీ ఒకే క్లాసు.

"అక్కా — నీకు అన్నింటికీ అనుమానమే! ఆ చీటీ దస్తూరీ నిపుణులదాకా ఎందుకు వెడుతుంది? ఆయ నెప్పుడో అవతల పారేసి వుంటారు—" అన్నాడతను. కానీ అతను అక్క చెప్పిన పని చేయడానికి ఒప్పు కున్నాడు.

రాత్రి ఏడింటికి చలపతిరావు జాహ్నవిని చూసివచ్చి కామేశ్వరరావుగారింటికి చేరుకున్నాడు. భోజనాలవు తున్న సమయంలో బాబూరావు ఎలాగో కష్టపడి— చలపతిరావు బట్టల జేబులన్నీ గాలించి ఓ చీటీ సంపా దించాడు. అది చూడగానే అతడికి ముచ్చెమటలు పోశాయి. అక్కణ్నించి ఒక్క పరుగున లలిత దగ్గరకు వెళ్ళాడు.

"ఏరా తమ్ముడూ—దొరికిందా?" అనడిగింది లలిత.

మాట్లాడకుండా చీటీని అక్కకందించాడు బాబూ రావు.

లలిత ఆ చీటీ చూసి తృప్తిపడింది.

"పెళ్ళికూతురు నచ్చిందని చెప్పకు. ప్రాణ ప్రమాదం!"

"ఇది తెమ్మనే కదూ నన్ను పంపావు!" అన్నాడు బాబూరావు.

"లేదురా—నీమీదొట్టు. ఈ చీటీ నేను రాయలేదు" అంది లలిత.

"అయితే నువెవరు రాశారంటావు?"

"ఏమో—నాకేం తెలుసు?" అంది లలిత.

"ఈ చీటీ చలపతిరావుగారు చూశారంటావా?" అన్నాడు బాబూరావు.

"ఇంటికొచ్చాక దానిమా టెత్తారా ఆయన?"

"లేదక్కయ్యా!"

"అయితే ఆయన చూసివుండరు—" అని—"అన్నట్లు తమ్ముడూ—ఈ చీటీ ఆయన జేబులోకి ఎప్పుడొచ్చిందంటావు?" అంది లలిత.

అక్క ప్రశ్నలోని అంతరార్థం బాబూరావుకు అర్థమయింది-"అంటే మనింట్లోనే ఈ పని జరిగిందంటావా?" అన్నాడు.

లలిత తమ్ముడివంక సీరియస్‌గా చూసి-"నిజం చెప్పు. ఈ చీటీ నువ్వే రాసి నన్నాటపట్టిస్తున్నావు కదూ—" అంది.

"లేదక్కా — నీమీదొట్టు—" అన్నాడు బాబూ రావు.

అక్కా తమ్ముళ్ళిద్దరూ కాసేపు దాని గురించి

చర్చించారు.

"ఇంతకీ ఈ చీటీ గురించి ఆయనకు తెలియజేయా లంటావా?"

లలిత ఆలోచిస్తూ — "అసలీ చీటీ మన దగ్గరకెలా వచ్చిందని చెప్పాలంటావు?" అంది.

బాబూరావు ఆ చీటీని మళ్ళీ తీసిన చోటనే పెట్టేస్తా నన్నాడు.

"త్వరగా వెళ్ళు—" అంది లలిత.

బాబూరావు త్వరగానే వెళ్ళాడు. కానీ అప్పటికే చలపతిరావు ఫోంచేసి గదిలోకి వెళ్ళిపోయాడు. అతను తలుపులు వేసుకుని పడుకుందుకు సిద్ధపడుతున్నాడు. బాబూరావు వెనక్కి వచ్చేశాడు.

"తలుపు సందుల్లోంచీ పడేయ్—" అంది లలిత.

బాబూరావు వెళ్ళబోతూండగా అతడికి తండ్రి మాటలు వినిపించాయి — "మనింట్లో ఇలా జరిగిందని నాకు బాధగా ఉంది—"

అతను ఆగి తండ్రి మాటలు విన్నాడు. లలిత రాసిన చీటీ గురించి ఆయన బాధపడుతున్నాడు. అది లలిత రాసిందని ఆయనకు తెలియదు. బయటవాళ్ళెవరో రాశారనే అనుకుంటున్నాడు. ఆ హెచ్చరించే వాళ్ళెవరో అందుకు తన ఇంటినే ఎన్నుకోవటం ఆయనకు బాధగా ఉంది. లేనిపోని అపార్థాలకు దారితీస్తుందని ఆయన బాధ.

బాబూరావు ఈ మాటలు అక్కకు చెప్పాడు.

"పోనీలేరా, ఈ చీటీ నా దగ్గరే ఉంచుతాను. ఇది ఆయన కళ్ళబడితే అది నాన్నగారికి చెడ్డపేరు తెస్తుందన్న ఆలోచన నాకు తట్టలేదు—"

"ఈ చీటీ నిజంగా ఆయనకు హెచ్చరిక ఏమో!"

"అయుండదు. ఎవరో సరదాకు రాసి ఉంటారు!" అంది లలిత.

"అయితే ఏ బాధా లేదు. ఇదాయన చూడకపోవటమే మంచిది—" అంటూ బాబూరావు ఆ చీటీని అక్క చేతి కిచ్చాడు. ఆమె దాన్ని భద్రంగా దాచింది.

కామేశ్వరరావు భార్య దగ్గర అంటున్నాడు—"రఘురాం కూతురికి మంచి సంబంధం తెచ్చాడే! మన అమ్మాయికీ పెళ్ళీడొచ్చింది. యిలాంటి సంబంధమే పట్టాలి—ఇంక నేనూ సంబంధాల వేటలో పడాలి—"

ఈ మాటలు పిల్లలు విన్నారు.

"అయితే అబ్బాయికి పిల్ల నచ్చినట్లేనా?"

"ఆ పిల్లకు తను నచ్చితే అదే తన అదృష్టం అంటుంటే!"

ఆ తర్వాత పిల్లలింక మాటలు వినలేదు. వాళ్ళు ముగ్గురూ లలితను ఆటపట్టించసాగారు. లలిత కుదుకు మోతనం వచ్చి — "మీరిలా ఏడిపించారంటే నేను ఇంట్లోంచి వెళ్ళిపోతాను—" అన్నది.

"ఆహా—ధైర్యవంతురాలు—రాత్రిపూట బయటకు పోతుందిట. వెళ్ళు చూద్దాం—" అన్నాడు బాబూ రావు వెటకారంగా.

"నాకేమైనా భయమా?" అని వీధి తలుపు తీసింది లలిత.

ఉన్నట్లుండి పిల్లలు ముగ్గురూ కెవ్వుమన్నారు.

లలిత తలుపులైతే తీసింది కానీ ఆమె వీధివైపు తిరిగి లేదు. అందుకని ఆశ్చర్యంగా—"పో—పో—అన్నారుగా నిజంగా పోతుంటే ఆ కేకలెందుకూ?" అంది.

"వెనక్కి చూడు—" అన్నదో కంఠం.

లలిత ఉలిక్కిపడి వెనక్కి తిరిగి తనూ కెవ్వుమని అరిచింది.

అతని వయసెంతో తెలియదు. బాగా ముసలివాడై ఉండాలి. వళ్ళంతా ముడతలుపడి ఉంది. మనిషి అస్థిపంజరానికి తోలు కప్పినట్లున్నాడు. అతడి చూపులు మహా భయంకరంగా ఉన్నాయి. చూపులకు మించి నవ్వు ఇంకా భయంకరంగా వుంది.

పిల్లల అరుపులు విని అక్కడికి వచ్చిన కామేశ్వర రావు ఆ మనిషిని చూసి-"ఎవరండీ మీరు?" అన్నాడు.

"శుభకార్యానికి సాయపడుతున్నావు. ఆశీర్వదించి పోదామని వచ్చాను. అబ్బాయి పెళ్ళికి ఒప్పుకున్నాడా?" అన్నాడా వృద్ధుడు.

"ఒప్పుకున్నాడండి—తమరెవరు? రఘురాం బంధువులా?" అనడిగాడు కామేశ్వరరావు.

"నేనెవరినైతేనేం నాయనా—నాకు కావలసిందల్లా ఒక్క కబురు. అబ్బాయి పెళ్ళికి ఒప్పుకున్నాడా? అని. చల్లని కబురు చెప్పావు—" అన్నాడు వృద్ధుడు.

"తమరెవరో చెప్పలేదు—" అన్నాడు కామేశ్వర రావు.

"అంతా నన్ను మంత్రగాడంటారు. కానీ బాబా అని పిలిపించుకోవటం నా కిష్టం—" అని వృద్ధుడు అక్కణ్నించి వెళ్ళిపోయాడు.

"అంతా ఆశ్చర్యంగా ఉంది—" అన్నాడు కామేశ్వరరావు.

"ఈ రాత్రికి మనింట్లో ఏదో జరుగుతుందనిపిస్తోంది-" లలిత భయం భయంగా నెమ్మదిగా బాబూరావుతో

అన్నది.

ఓ రాత్రివేళ ఆ యింట్లోంచి పెద్ద కేక వినబడింది. అది చలపతిరావు గదిలోంచి!

* * *

రాత్రి రెండుగంటల ప్రాంతాల ఎవరో కాలింగ్ బెల్ మ్రోగించగా రఘురాం తనే లేచి వెళ్ళి తలుపు తీశాడు.

"క్షమించాలి! అర్ధరాత్రి మీకిబ్బంది కలిగించాను—" అన్నాడు రామకృష్ణ.

రఘురాంకి నిజంగానే వళ్ళు మండింది. కానీ ఎలాగో తమాయించుకుని — "సరే — లోపలకు రా —" అన్నాడు.

"రోజూ ఇలా జరగదండి—అనుకోని పని తగిలింది-" అన్నాడు రామకృష్ణ. రఘురాం జవాబేమీ ఇవ్వకుండా అవులిస్తూ తలుపులు వేసుకున్నాడు. రామకృష్ణ తన గది లోనికి వెళ్ళిపోయాడు. రఘురాం తన గదిలోకి పోదా మనుకుంటూండగా మళ్ళీ కాలింగ్ బెల్ మోగింది. ఆయనకు కలిగిన విసుగు ఇంతా అంతా కాదు.

చాలా విసురుగా వెళ్ళి తలుపు తీశాడు. బయట నిలబడ్డ వ్యక్తిని నానామాటలూ అనాలని ఉందాయనకు. సగం నిద్రలో లేచివచ్చాడేమో చాలా చిరాగ్గా ఉందా యనకు. అయితే బయటి వ్యక్తిని చూడగానే తెరచిన నోరు తెరచినట్లే ఉండిపోయిం దాయనకు. అయితే అవతలి వ్యక్తి కూడా వెంటనే నోరు విప్పకుండా— మనిషి వణుకుతున్నాడు.

"మీరా—కామేశ్వరరావుగారూ — ఇంత రాత్రి సమయంలో వచ్చారేమిటి? ఏం జరిగింది?" అన్నాడు

రఘురాం కంగారుగా.

"జరగకూడనిదే జరిగిపోయింది—చలపతిరావు చచ్చిపోయాడు" అన్నాడు కామేశ్వరరావు వణికిపోతూ.

"ఆఁ" నోరు తెరిచాడు రఘురాం.

కొద్దిక్షణాలు ఇద్దరిమధ్యా నిశ్శబ్దం రాజ్యమేలింది.

"ఏం జరిగిందో చెప్పండి. నాకు కాళ్ళూ చేతులూ ఆడటంలేదు—" అన్నాడు రఘురాం. కామేశ్వరరావు కూడా—"ఏం చెప్పనండీ—నాకూ కాళ్ళూ చేతులూ ఆడటంలేదు—" అన్నాడు.

ఇద్దరికీ కాళ్లూ చేతులూ ఆడటానికి మరి కాస్తసేపు పట్టింది.

చలపతిరావు తలుపులు దగ్గరగా వేసుకుని గదిలో పడుకున్నాడు. ఓ రాత్రివేళ అతడి గదిలోంచి పెద్ద కేక వినబడింది. వెళ్ళి చూస్తే అతను రక్తపు మడుగులో ఉన్నాడు. కదలటంలేదు. ముందు ఆ వీధిలోనే ఉన్న డాక్టరుకు కబురు పంపారు. ఆయన వచ్చి చూసి అతను చనిపోయాడని నిర్ధారించాడు. ఎవరో రివాల్వరుతో కాల్చి చంపారని అందువల్ల ఇది హత్య కేసు కింద వస్తుందనీ—పోలీసులకు కబురు పెట్టమనీ ఆయన సలహా ఇచ్చాడు. ఓ కొడుకును పోలీస్ స్టేషన్‌కు పంపి తనిలా పరుగెత్తుకొచ్చాడాయన.

రఘురాం ఇంటిల్లపాదినీ లేపి విషయం చెప్పాడు.

రామకృష్ణ ఇంత హడావుడవుతున్నా గదిలోంచి బయటకు రాలేదు. అతని విషయం కూడా మర్చిపోయాడు రఘురాం.

* * *

"ఇది వయ్యారా లాలికించే వేళ—" అందామె.

"ఒలికించు—" అన్నాడు సురేష్.

"నువ్వు నా అందాన్ని పొగుడు—" అందామె.

"ఎంత పొగిడినా నువ్వు జాహ్నవివి కాలేవు కదా!"

"జాహ్నవి ఎవరు?"

"నువ్వెదురుగా ఉన్నప్పుడు కూడా తన్ను మరిచి పోనివ్వని ఓ అసమాన తేజోరాశి—"

"అటువంటప్పుడు ఆమెను పెళ్ళాడలేక పోయావా?"

"పెళ్ళాడాలనే వుంది. కానీ ఆమె ఒప్పుకోవాలి గదా!"

"ఒక ఆడదాన్ని పెళ్ళికి ఒప్పించలేవా?" ఆమె నవ్వింది.

"జాహ్నవి కేవలం నీ వలాంటి ఆడదయింటే ఎప్పుడో ఒప్పించి వుండేవాణ్ని. ఆమె మానవ లోకంలో తప్ప బుట్టిందా అనిపిస్తుంది—"

"నన్ను గురించీ ఎందరో రసికులలా అన్నారు—" అందామె.

"నీ గురించి అలా అనడానికి తాగుడు మైకం కావాలి. జాహ్నవి విషయంలో అక్కర్లేదు—"

ఆమె ముఖంలో కోపం కనబడింది — "అంతగా జాహ్నవి జాహ్నవి అని కలవరించేవారు నన్నెందుకు పిలిపించారు?"

"గదిలో విద్యుత్తున్నంత సేపూ మనసునిండా జాహ్నవి ఉంటుంది. దీపం ఆరేక చీకటిలో నీకూ, జాహ్నవికీ తేడా ఏముంది?"—నవ్వాడు సురేష్.

ఆమె కడుపుమోత్తనం వచ్చింది — "ఇంతకీ ఆ జాహ్నవిని పెళ్ళాడుతున్నావా?"

"ప్రస్తుతాని కది సాధ్యపడేలా లేదు—"

"నీకు సాధ్యపడేలోగా ఆమెకు వివాహమైపోతే?"

సురేష్ నవ్వి—"నేను తప్ప మరెవ్వరూ ఆమెను వివాహమాడలేరు. తెలుసా?" అన్నాడు.

"ఎందుకని?"

"ఎవరైనా ఆమెను వివాహమాడడానికి ముందుకు వస్తే రక్తం ఏరులై ప్రవహిస్తుంది-" అన్నాడు సురేష్.

ఆమె అతడివంక భయంగా చూసి—"ఆ జాహ్నవి ఎప్పుడు పెళ్ళిచేసుకుంటుంది?" అనడిగింది.

"నేను అనుమతిస్తే ఈ రోజే చేసుకుంటుంది—కానీ నన్ను కాదు—మరొకడిని!" అన్నాడు సురేష్.

"అంటే?" ఆమెకు అర్థంకాలేదు.

"ఈ రోజు సాయంత్రం జాహ్నవికి పెళ్ళిచూపులు జరిగాయి. వరుడు ఢిల్లీనుంచి వచ్చాడు—"

"వరుడికి ఆమె నచ్చితే?" అడిగిందామె.

"వరుడికి ఆమె నచ్చింది—"

"ఆమెకు వరుడు నచ్చాడా?"

"అదామె చెప్పదు—"

"ఇంతకీ ఈ పెళ్ళి జరుగుతుందా?"

"జరుగదు—"

"ఎందుకని?"

"ఈ పాటికి వరుడి రక్తం ఏ గదిలోనో సెలయేరుగా ప్రవహిస్తూంటుంది—" అని—"దీపం ఆర్పు—నేను జాహ్నవీ అంటే ఊఁ అని పలుకు—" అన్నాడు సురేష్.

* * *

"సావిత్రీ!"

ఆమె మొద్దు నిద్రలో ఉంది.

ప్రతాప్ ఆమెను కుదిపి లేపాడు. ఆమెకు పూర్తి

మెలకువ రావడానికి కొంతసేపు పట్టింది.

"మీరా?" అంది.

"ముందు నా గదిలోకి రా—"

సావిత్రి మాట్లాడకుండా ఫ్రిజ్ తెరచి ఓ నిమ్మకాయ తీసింది. తళతళ మెరిసే చాకు కూడా తీసింది.

"అవెందుకూ—?" అన్నాడు ప్రతాప్.

"పూజకోసం!"

"ఈ రోజు పూజలేదు—" అన్నాడు ప్రతాప్.

ఒక్కసారి సావిత్రి కళ్ళలో ఉత్సాహం కనబడింది. ఆమె చాకు, నిమ్మకాయ యథాస్థానంలో ఉంచింది.

ఇద్దరూ ప్రతాప్ గది చేరుకున్నారు.

ప్రతాప్ ఆమెను నడుం దగ్గర పట్టుకుని గాలిలోకి లేపాడు—"ఓహ్ — సావిత్రీ — నా మనసెంత తేలిగ్గా ఉందిప్పుడు?"

"ఏం జరిగిందండీ—" అంది సావిత్రి.

అతను చెప్పలేదు. ఉక్కిరిబిక్కిరయ్యేలా ఆమెను ముద్దుపెట్టుకున్నాడు.

అతను చాలా ఉత్సాహంగా ఉన్నాడని గ్రహించిందామె. అందుకామెకూ ఎంతో సంతోషంగా వుంది. అతనిలా తన్నాదరించటం ఇదే ప్రథమం. ఒక ఆడదానిలా కాక ఆత్మీయురాలిగా చూస్తున్నాడు. సావిత్రి కళ్ళు తుడుచుకుంది.

"నీకు తెలుసుగదా—జాహ్నవిని చూసుకుందుకు ఢిల్లీ నుంచి పెళ్ళికొడుకు వచ్చాడని!" అన్నాడు ప్రతాప్.

"ఊఁ."

"అతని పేరు చలపతిరావు—"

"అతనికి జాహ్నవి నచ్చిందా?"

ఈ ప్రశ్నకు ప్రతాప్ కు కోపం వచ్చింది. అతను జవాబు చెప్పకుండా సావిత్రి తెలివితక్కువతనాన్ని నిందించి—"సరే—ఈ రోజుకు నిన్నెలాంటి తప్పయినా క్షమించగలను—అతడికి జాహ్నవి అంతా యింతా అనకుండా ఎంతో నచ్చింది. ఆమె ఒప్పుకుంటే వెంటనే పెళ్ళిచేసుకోవా లనుకున్నాడు—"

"అయితే మీకింత ఉత్సాహ మెందుకు?"

"చెప్పనా?"

"జాహ్నవి కతను నచ్చి ఉండడు—"

"కాదు—"

"పెద్దలీ పెళ్ళికిష్టపడి ఉండరు—"

"పెద్దలిష్టపడ్డారు—"

"పెద్ద కట్నం అడిగి ఉంటాడు—"

"జాహ్నవి ఒప్పుకుంటే అతనే కట్నమివ్వడానికి సిద్ధంగా ఉన్నాడు—"

"అయితే మరేం జరిగిందండీ—నాకు తట్టటంలేదు-"

"చలపతిరావు చచ్చిపోయాడు—"

"చచ్చిపోయాడా?" సావిత్రి నిశ్చేష్టురాలైంది—"ఎలా?"

"ఎవరో చంపేశారు?" అని ఉత్సాహంగా సావిత్రిని మరింత దగ్గరగా తీసుకున్నాడు ప్రతాప్. అయితే సావిత్రి ఉత్సాహం మటు మాయమయింది.

చలపతిరావు ఎవరు? అతను ప్రతాప్ కేం అపకారం చేశాడు? జాహ్నవిని ప్రతాప్ చేసుకుంటానంటే అతను వద్దన్నాడా? రఘురాంగారు తీసుకొస్తే వచ్చాడు. కానీ అతడికి ప్రతాప్ పైన పగేమీ లేదుకదా! మరి అతను చచ్చిపోతే ప్రతాప్ కంత సంతోష మెందుకు? ఒక నిందు

ప్రాణం నిష్కారణంగా చచ్చిపోతే ఇతడికింత ఆనంద మెందుకు?

అయినా చలపతిరావు చచ్చిపోలేదు. చంపబడ్డాడు.

ఎవరు చంపా రతన్ని?

సావిత్రికి ఆలోచించే వ్యవధిలేదు. ఆమె ప్రతాప్ ఉత్సాహంలో కరిగిపోతోంది.

* * *

శ్రీకాంత్ ఆశ్చర్యంగా బల్లమీదకు చూసి-"గురూ! అయితే చలపతిరావు పని అయిపోయింది—" అన్నాడు.

బల్లమీద చలపతిరావు ఫోటో వుంది. ఫోటోలోని చలపతిరావు గుండెల్లోకి గుచ్చుకుని ఉంది తళతళలాడే బాకు.

డేంజర్ మాట్లాడకుండా ఫోటోవంకే క్రూరంగా చూస్తున్నాడు.

"గురూ — ఒక్క రాత్రిలో ఈ గురుడిమీద ఇంత కోపమెలా తెచ్చుకున్నావ్? ఇన్నాళ్ళుగా ఆ ప్రతాప్ ఫోటోని ఒక్కసారి కూడా పొడవలేకపోయినవాడిని— ఒక్క రాత్రిలో...." అని అడిగాడు శ్రీకాంత్.

"ప్రేమ ద్వేషాన్ని పెంచగలదు—" అన్నాడు డేంజర్.

"మరి ప్రతాప్ మీద ఎందుకు ద్వేషం పెరగలేదూ?"

"పరిణితి చేయిదాటే సమయం వచ్చింది-" అన్నాడు డేంజర్.

"ఎప్పుడు పొడిచావు గురూ? నేను చూడనేలేదు—"

"నిజం చెప్పాలంటే నాకూ తెలియదు. తాగుడు మైకంలో ఎప్పుడో పొడిచేసి వుంటాను—" అన్నాడు డేంజర్.

మిత్రులిద్దరూ రాత్రంతా బాగా తాగారు. అప్పుడు తెల్లవారుఝాము అయిదవుతోంది.

"అయితే అసలు మనిషిని పొడవడానికి ముహూర్త మెప్పుడు గురూ!"

డేంజర్ వికటంగా నవ్వాడు — "కత్తి ఇక్కడ ఫోటో మీద పడగానే మనిషి అక్కడ చచ్చాడనే అనుకో — ఇంకా ముహూర్తం దేనికి?"

"బాగుంది — నీకేమైనా మంత్రాలొచ్చా — ఇక్కడే కూర్చుని అక్కడున్న వాణ్ని చంపావనుకోవడానికి —"

శ్రీకాంత్ కి బాగా తెలుసు. రాత్రి తెల్లవార్లూ ఇద్దరూ కలిసే తాగుతున్నారు.

"ఇంతవరకూ చేసిన హత్యలన్నీ ఎలా చేశానను కున్నావ్? ఈ డేంజర్ హత్య చేయటం కోసం ఇల్లు కదలడు. యిక్కడ కత్తి ఫోటోమీద పడుతుంది. అక్కడ అఘోరీబాబా మంత్రం వేస్తాడు" అన్నాడు డేంజర్.

"అఘోరీబాబాయా?" ఆశ్చర్యంగా అన్నాడు శ్రీకాంత్ — "వాడెవరు?"

"అఘోరీబాబా సాయం లేకుండా నేను అవలీలగా హత్యలెలా చేయగల్గుతున్నా ననుకుంటున్నావ్?" అన్నాడు డేంజర్.

శ్రీకాంత్ ఆశ్చర్యంగా — "అఘోరీబాబా అన్న పేరు మొట్టమొదటిసారిగా నీ నోట వింటున్నాను—" అన్నాడు.

"నీకు తెలియని రహస్యాలు నా దగ్గరింకా చాలా ఉన్నాయి—" అని నవ్వాడు డేంజర్ — అందరికీ జాహ్నవి గురించని చెప్పానుగానీ అఘోరీబాబా గురించే

గుండు చేయించుకున్నాను. ఆయన నా జుత్తు కావా లన్నాడు. అది తన దగ్గరున్నంత కాలమూ నా తలమీద జుత్తు మొలవకూడదన్నాడు—"

శ్రీకాంత్ భయంగా డేంజర్ వంక చూసి-"అయితే నేనింక నీకు సలహా లివ్వను. నిన్ను చూస్తే నాకు భయంగా ఉంది—" అన్నాడు.

"అలా భయపడితే ఎలా? అటు అఘోరీబాబా ఎంతో ఇటు నువ్వూ అంతే నాకు—" అన్నాడు డేంజర్.

"నాకోసారి అఘోరీబాబాను చూపిస్తావా?"

"ఆయన అస్తమానూ కళ్ళబడడు. వీలుంటే ఎప్పు డయినా దూరాన్నుంచి చూస్తాడు. ఆయనే యింట్లో అడుగుపెట్టాడో — కొద్ది గంటల్లో ఆ యింట్లో ఒక ప్రాణి చావకతప్పదు—" అన్నాడు డేంజర్.

"ఇంతకీ చలపతిరావు చచ్చేడంటావా?" అన్నాడు శ్రీకాంత్.

"నీకేమైనా అనుమానముంటే ఓసారి వెళ్ళి చూసిరా—"

"చూసే వస్తాను-నువ్విక్కడే వుండాలి-" అన్నాడు శ్రీకాంత్.

"అలాగే — కానీ జాగ్రత్త—హత్య జరిగిన చోటుకి వెళ్ళేముందు ఎవ్వరూ అనుమానించని విధంగా మసలుకుని రావాలి—"

శ్రీకాంత్ డేంజర్ వంక అదోలా చూసి — "ఏం గురూ—నువ్వు నాకు జాగ్రత్తలు చెబుతున్నావు?" అన్నాడు.

"తాగినప్పుడు నీకంటే నేనే తెలివైనవాణ్ని—

ఎందుకో తెలుసా?" అన్నాడు డేంజర్—"తాగినప్పుడు నీ తెలివి తేటలు బాగా తగ్గిపోతాయి. నా తెలివి తేటలు తాగినప్పుడూ తాగనప్పుడూ ఒక్కలాగే ఉంటాయి—"

"సరేలే—" అని శ్రీకాంత్ అక్కణ్నించి బయ ల్దేరాడు.

డేంజర్ కుర్చీలో వెనక్కి జారగిలబడ్డాడు. అతడికి కళ్లు మూతలుపడసాగాయి. కొద్ది క్షణాల్లోనే అతడికి నిద్రముంచుకొచ్చింది.

ఓ అరగంటలో శ్రీకాంత్ అక్కడికి పరుగున వచ్చి ఓ కుదుపు కుదిపి లేపాడు.

"ఏమిటీ?" అన్నాడు డేంజర్ విసుగ్గా.

"నువ్వు చెప్పింది అక్షరాలా నిజం నీ అఘోరీబాబా నిజంగానే చాలా గొప్పవాడు. ఆ చలపతిరావు చచ్చి పోయాడు—" అన్నాడు శ్రీకాంత్.

"నిజంగా?" అంటూ కుర్చీలోంచి లేచి నిలబడ్డాడు డేంజర్.

"ఏమిటి గురూ — హత్య వార్త విని నువ్వు కూడా ఆశ్చర్యపడుతున్నావ్?" అన్నాడు శ్రీకాంత్ ఆశ్చ ర్యంగా.

* * *

"ఏమిటయ్యా-నీ ఉద్యోగం?" అన్నాడు రఘురాం.

"చాలా రహస్యమండి—ఎవ్వరికీ చెప్పకూడదు—" అన్నాడు రామకృష్ణ.

"నిన్ను చూస్తూంటే ఏ గవర్నమెంటు సీఐడీవో అనిపిస్తోంది—"

"పోనీ అలాగే అనుకోండి—" అన్నాడు రామకృష్ణ.

"అనుకుని ఊరుకుంటే నాకేం లాభం? ఆ చలపతి

రావు నెవరు చంపారో కనుక్కోని చెప్పకూడదూ—
ఆ స్తమానూ పోలీసుల చుట్టూ తిరగలేక చస్తున్నాను-"
అన్నాడు రఘురాం.

"ఎవర్ని కనుక్కోవాలో చెప్పండి!" అన్నాడు రామకృష్ణ.

"బాగుంది — అది తెలిస్తే నిన్నడగటమెందుకూ?" అన్నాడు రఘురాం విసుగ్గా.

"నేను సీఐడీ ననుకుని నన్నడిగారు. అలాగే ఇప్పుడింట్లోకి ఎవరడుగుపెడితే వాళ్ళే హంతకులనుకోండి. అనుకోడానికి యిబ్బందేమీ ఉండదుగదా—" అని అతనింకా వాక్యం పూర్తిచేయకుండానే వీధి గుమ్మంలోంచి ప్రతాప్ ప్రవేశించాడు.

"అరే—ప్రతాప్—రా రా—" అని—"ఇప్పుడే ఈ రామకృష్ణ నిన్ను హంతకుణ్ని చేశాడు!" అన్నాడు రఘురాం.

ప్రతాప్ తడబడుతూ—"హత్య ఏమిటి?" అన్నాడు.

"అదే—చలపతిరావు హత్య!" అన్నాడు రఘురాం బాధగా. ఆయన ముఖంలో దిగులు, ఆవేదన కనిపించాయి — "తీరి కూర్చుని ఆ పిల్లాణ్నిక్కడికి తీసుకొచ్చాను. అతడి చావుకు నేనే కారణమని నా అంతరాత్మ వేధిస్తోంది—"

"మీరేదో నన్ను హంతకు డన్నారు!" అన్నాడు ప్రతాప్.

తనకూ, రామకృష్ణకూ జరిగిన సంభాషణ చెప్పాడు రఘురాం.

ప్రతాప్ తేలికగా నిట్టూర్చి—"అసలు మనిషి మనిషి నెందుకు చంపాలనుకుంటాడో, ఎలా చంపగలుగుతాడో

నాకు చాలా ఆశ్చర్యంగా ఉంటుంది మామయ్యగారూ" అన్నాడు.

"మా ప్రతాప్‌ది సున్నితమైన మనస్తత్వం! నా జీవితంలో ఇంత సున్నితమైన మనసున్న మనిషి నెక్కడా చూడలేదు—" అన్నాడు రఘురాం. ఆయన ప్రతాప్ కుటుంబానికీ తమ కుటుంబానికీ ఉన్న అనుబంధం రామకృష్ణకు వివరించాడు.

"అసలు మా జాహ్నవి నితనికే ఇద్దామనుకున్నాం. కానీ జాతకాలు కలవలేదు—"

"ఈ రోజుల్లో యింకా జాతకాల పట్టింపులు వున్నాయా?" ఆశ్చర్యపడ్డాడు రామకృష్ణ.

"మనువైన వెంటనే వరుడికి మరణగండమట—" అన్నాడు రఘురాం.

"లోపం అమ్మాయి జాతకానిదా, ప్రతాప్ జాతకానిదా?"

"విడివిడిగా రెండూ మంచివే — కానీ కలిస్తేనే సమస్య!" అన్నాడు రఘురాం.

"ఆ పురోహితుడి అడ్రసు నాకు చెబుతారా?" అన్నాడు రామకృష్ణ.

ఈ ప్రశ్నకు ప్రతాప్ కంగారుపడి — "మా పురోహితుడితో మీకేం పని?" అన్నాడు.

"ఏ పురోహితుడైనా రెండు పెళ్ళిళ్ళు జరపడానికి చూస్తాడు తప్పితే చెడగొట్టడానికి చూడడు-రెండిళ్ళలోనూ ఎవరికో ఇష్టంలేకపోతే తప్ప! రెండిళ్ళవారూ ఇష్టపడిన సంబంధాన్ని తను కాదన్నాడంటే ఆయన

నిజంగా శాస్త్రాన్ని నమ్మినవాడయుండాలి. అలాంటివాడి చేత నా జాతకంకూడా చెప్పించుకుంటే బాగుంటుంది కదా!" అన్నాడు రామకృష్ణ.

ప్రతాప్ నవ్వేసి — "మీరు చాలా తమాషాగా మాట్లాడతారు—" అన్నాడు.

"తమాషా కాదు—నాకు నిజంగానే ఆయన అడ్రసు కావాలి—" అన్నాడు రామకృష్ణ.

"దానికేముంది? నేను చెబుతాను—" అన్నాడు రఘురాం.

"మామయ్యగారూ—మీరు అడ్రసు చెప్పడానికి వీల్లేదు—" అన్నాడు ప్రతాప్.

"ఏం?" అన్నాడు రఘురాం ఆశ్చర్యంగా.

"అందువల్ల మీకూ మాకూ గొడవలొస్తాయి—" అన్నాడు ప్రతాప్.

రఘురాం ఆశ్చర్యానికి అంతులేదు.

"ఆ బ్రాహ్మడు చాలా పిరికి మనిషి. పొరపాటున నాన్నగారి దగ్గర నోరు జారాడు. తర్వాత ఆ తప్పు సరి చేసుకుందామన్నా ఆయన నమ్మటంలేదు. ఎవరైనా గట్టిగా అడిగితే వారు కోరిందే చెప్పేస్తాడు. మీరు రామకృష్ణగారిద్వారా జాతకాన్ని మారిస్తే నాకిష్టమే! కానీ మా నాన్నగారు అది నమ్మరు సరికదా—మీరేదో నా ప్రాణాలకు కూడా హాని తలపెడుతున్నారని మనసులో ఏదో పెట్టుకుంటాడు. పెళ్ళి జరక్కపోయినా మన సంబంధ బాంధవ్యాలిలా ఉంటే బాగుంటుంది కదా!"

"మనసెంత సున్నితమో ఆలోచనంత లోతు!" అని

మెచ్చుకున్నాడు రఘురాం. ఆయన అభిమానంగా ప్రతాప్ వంక చూశాడు.

"అరే — మీ కెంతో వయసులేదు. తలలో తెల్ల వెంట్రుకలు కనిపిస్తున్నాయే—" అన్నాడు రామకృష్ణ.

"అవునండీ—ఎన్ని మందులు వాడినా లాభముండటం లేదు. బహుశా ముఫ్పై ఏళ్ళు దాటేసరికి నా తల పండిపోతుందేమో—" అన్నాడు ప్రతాప్.

"తెల్ల వెంట్రుకలు నల్లబడడానికి నాకో మందు తెలుసు—" అన్నాడు రామకృష్ణ.

"ఏమిటది?" అన్నాడు ప్రతాప్.

అయితే రామకృష్ణ జవాబిచ్చేలోగానే ప్రతాప్ లేచి నాలుగడుగులువేసి — అక్కడ నిలబడివున్న పని కుర్రాడు చంద్రయ్య చెంప ఛెళ్ళుమనిపించాడు.

రఘురాం ఆశ్చర్యంగా — "ఏం జరిగిందయ్యా?" అన్నాడు.

చంద్రయ్య చెంప తడుముకుంటూ—"నే నేంచేశాను బాబూ—" అన్నాడు. వాడిచేతిలోని వాడిన మల్లెలు నేలమీద పడ్డాయి.

ప్రతాప్ మాట్లాడ లేదు. అతనింకా అలాగే చంద్రయ్య వంక కోపంగా చూస్తూ తన్ను తాను నిగ్రహించుకుందుకు ప్రయత్నిస్తున్నాడు.

రఘురాం లేచి ఆ ఇద్దర్నీ సమీపించాడు. చంద్రయ్య వంక తీవ్రంగా చూసి—"ఏం చేసావురా — చెప్పు!" అన్నాడు!

"నాకేం తెలియదండీ బాబూ-" అంటూ చంద్రయ్య కళ్ళనీళ్ళ పర్యంతం అయ్యాడు.

"నీకేమీ తెలియదూ!" ప్రతాప్ గద్దించాడు.

"నిజంగా తెలియదు బాబూ—"

"తెలియదూ—" ప్రతాప్ ఆవేశంతో వణుకుతూ చెయ్యి పైకి ఎత్తాడు.

ఆ చేతిని రఘురాం ఆపి—"అసలు వాడేం చేశాడో నువ్వు చెప్పు బాబూ—నేను వాణ్ని శిక్షిస్తాను...." అన్నాడు.

అప్పటికి ప్రతాప్ ఆవేశం తరిగింది— చెయ్యి వెనక్కు తీసుకొని—"సారీ — మామయ్యగారూ!" అన్నాడు నెమ్మదిగా.

"సారీలు తర్వాత — వెధవ — వాడేం చేశాడో చెప్పు!"

"మల్లెపువ్వును చేతిలో నలిపి వాసన చూస్తున్నాడు" అన్నాడు ప్రతాప్.

"ఊఁ" అన్నాడు రఘురాం.

"అదే వాడు చేసిన తప్పు—" అన్నాడు ప్రతాప్.

రఘురాం వెంటనే — "ఏరా — అసలు నీకు మల్లె లెక్కడివి?" అన్నాడు.

"అమ్మాయిగారు పెట్టుకుని పడేసినవి బాబుగారూ— నాకు మల్లెల వాసన చాలా ఇష్టం. అందుకని నలిపి...."

మళ్ళీ వాడి చెంప చెళ్ళుమంది.

రఘురాం విసుగ్గా — "ఏమిటయ్యా — ఇది!" అన్నాడు.

"మల్లెల్ని నలుపుతూంటే నా గుండె పిండేసినట్లుంది. ప్లీజ్ — మామయ్యగారూ — వాడినామాట కూడా అనొద్దనండి—" అన్నాడు ప్రతాప్.

ఒక్క క్షణం రఘురాంకు నోట మాట రాలేదు. తర్వాత ఆయన చంద్రయ్య నక్కణ్నించి వెళ్ళి పోయ్యా న్నాడు.

"నీకు మరీ యింత సున్నిత మన స్తత్వం పనికి రాదోయ్!"

"ఏం చేయనండీ—అది నా బలహీనత!"

"బలహీనతా? ఒక పనివాడిమీద బల ప్రయోగం చేయడాన్ని బలహీనత అంటారా?"

"మామయ్యగారూ—వాడు పనివాడన్న కారణంగా నేను కొట్టలేదు. వాడి స్థానంలో ఈ రాష్ట్ర గవర్న రున్నా ఆ దేపని చేసేవాడిని. అందుకే బలహీనత అన్నాను—" అన్నాడు ప్రతాప్.

రామకృష్ణ ఆశ్చర్యంగా ప్రతాప్ వంకే చూస్తు న్నాడు. ఒక మల్లెపువ్వు — అందులోనూ వాడిన మల్లె పువ్వు — పనివాడి చేతిలో నలుగుతూంటే చూడలేని సున్నిత మన స్తత్వమా ఇతగాడిది! ఇది నమ్మదగిన విషయమేనా?

ఆతడి ఆలోచనలు దూ ర ం గా పోతున్నాయి. బహుశా ఆ మల్లెపూదండను ప్రతాప్ జాహ్నవి కిచ్చి ఉంటే అదామె విసిరికొడితే — దాన్ని వాడిచేతిలో చూస్తే!

సరిగ్గా ఇదే జరిగివుండకపోవచ్చు. కానీ ఇలాంటిదేదో జరిగి వుంటుంది. అసలు రహస్యం చంద్రయ్యకు తెలు స్తుంది. లేకపోతే వాడిన మల్లెలు చూస్తే జంధ్యాల పాపయ్య శాస్త్రిగారే చలించరేమో!

ప్రతాప్ రామకృష్ణ వంక తిరిగి — "మీ రేడో తెల్ల వెంట్రుకలకు మందున్నదన్నారు—" అన్నాడు.

"మందార నూనె!" అంటూనే చెంప తడుము కున్నాడు రామకృష్ణ. కానీ ప్రతాప్ ఇంకా దూరంగానే ఉన్నాడు.

"మందార నూనె ఎక్కడ దొరుకుతుంది?"

"ఎక్కడ దొరుకుతుందో నాకు తెలియదు. కానీ ఎలా చేయాలో నాకు తెలుసు-" అన్నాడు రామకృష్ణ.

"చెప్పండి!"

రామకృష్ణ జంకుతూనే చెప్పాడు — "మందార పువ్వుల్ని కొబ్బరి నూనెలో ఉడికించాలి—"

"మామయ్యగారూ — మన దొడ్లో మందార చెట్టు వుంది కదూ—" అన్నాడు ప్రతాప్.

"అవునోయ్—విరగబూస్తోంది కూడా!" అన్నాడు రఘురాం.

ప్రతాప్ దొడ్లోకి వెళ్ళాడు. రామకృష్ణ అతడి ననుస రించాడు. చెట్టు దగ్గరకు వెళ్ళి పువ్వులు కోస్తున్నాడు ప్రతాప్.

"చాలా పువ్వులు కోశారే — నూనె ఎవరు చేస్తారు మీకు?" అన్నాడు రామకృష్ణ.

ప్రతాప్ తన చేతిలోని ఓ పువ్వు నలిపి తలకు రాసుకొని — "ఇంకెవరు చేస్తారు. నేనే స్వయంగా చేసుకుంటాను?" అన్నాడు.

రామకృష్ణ అతడివంకే ఆశ్చర్యంగా చూస్తున్నాడు. ఎన్నో ప్రశ్నలు అడగాలనుకొని ఆగిపోయాడతను.

(ఇంకా వుంది)

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్కమాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల 7 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి. సభ్యులు కానివారు తమ వ్యాఖ్యలతో 50 పైసల స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 25/- లు నగదు బహుమతితోపాటు 6 నెలలు "సప్లిమెంట్" కూడా పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 10/- లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారాగాని మీ యింటి దగ్గర అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీలకోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరగాల్సిన అవసరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు ఏడాది పైకము రు. 120/-లు ముందుగా పంపవచ్చును.




## యాపిల్ మహత్మ్యం?

"రాము నీ కెందుకురా ప్రతీ యేడు పరీక్షల్లో ఫస్టు మార్కులు వస్తాయి. నీ కిన్ని తెలివితేటలు ఎలా వచ్చాయి?" అడిగాడు రాము.

"ఏమో! నాకేం తెలుసు. నేను మాత్రం రోజు ఓ యాపిల్ తింటాను. బహుశా, అందుకేనేమో నా కిన్ని తెలివితేటలు వచ్చాయి" అమాయకంగా చెప్పాడు గోపి.

"అయితే, ఈ రోజు నుంచి నేను తింటాను," అంటూ ఇంటికి పరిగెత్తి, "అమ్మా, నాకో రూపాయి ఇవ్వవే!" అడిగాడు రాము.

"ఎందుకురా?" తల్లి ప్రశ్న.

"మరేమో నాకు తెలివి తక్కువ కదా! యాపిల్‌కాయ కొనుక్కుంటాను? రోజు ఒక యాపిల్ తింటే తెలివి పెరుగుతుందని మా ఫ్రెండ్ చెప్పాడు."

"అయితే, యిదుగో యీ రెండు రూపాయలు తీసుకో!"

"రెండ్రూపాయలు యెందుకమ్మా? ఒక్క రూపాయి చాలు!"

"మీ నాన్నకు కూడా ఓ యాపిల్ కొనుక్కురా!!"

—యన్. శివానంద్, బెల్లంపల్లి.

